నేడే చూడండి!






జయంతి పిక్చర్స్ వారి

# శ్రీకృష్ణార్జున యుద్ధము

నిర్మాత . దర్శకుడు

కె. వి. రెడ్డి B.Sc. (HONS)

వాహిని విడుదల

ఉత్తమశ్రేణి కాఫీ విత్తనముల సేకరణ, నైపుణ్యంతో మేలు విత్తనాల మేళవింపు
ఉత్పత్తికాలంలో నిరంతర ప్రతిఘట్టంలో జాగరూకత, పొడుచేయు పద్ధతిలో
శాస్త్రీయత వలన శ్రేష్ఠతలో ఆంధ్రా కాఫీది అగ్రస్థానం.




అనుదిన జీవితంలో అసంఖ్యాకులకు
ఆనందప్రదాయిని
ఆంధ్రా కాఫీ
ఎల్లప్పుడు కొనండి.

# ఆంధ్రా కాఫీ యిండస్ట్రీ,

హెడ్డాఫీసు:- బ్రాడీపేట గుంటూరు.

బ్రాంచీలు:- బ్రాడీపేట, పట్నంబజారు (గుంటూరు) బాపట్ల, నర్సరావుపేట, సత్తెనపల్లి, హైదరాబాదు.

# ఉత్తరాలు

## ముఖచిత్రం

నా అభిమాన నటుడు "శోభన్‌బాబు", అబ్బ! నవ మన్మధునిలా ఉన్నాడంటే నమ్మండి! చిక్కని, చక్కని దరహాసం చిందిస్తూ, వెన్నెలను వెదజల్లే నెలరాజును పరిహసిస్తున్నడా, అన్నట్లుగ ఉన్నాడు. చక్కని 'పోజు'పెట్టిఉన్న అందమైన అమ్మాయిని చూసినంతసేపు చూచి, అట్టు తిరగేశాను. నా అందాల, అభిమాన నటునకు నా నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేయుదురని ఆశిస్తున్నాను.

యం. ఆర్. రాధాకృష్ణ (తాడిపత్రి)

*　　*　　*

## కథలు

"రామకృష్ణారావు"గారి "కఠినాత్మురాలు" కథ ఎంత కఠిన హృదయాన్నయినా కరిగించు వేయునని చెప్పుటకు సంకోచింపనవసరములేదు. ఈ కథ స్వాభావికానికి చాలా దగ్గరలో ఉంది.

అబ్దుల్‌నబీ (బందరు)

*　　*　　*

'పాంథశాల' కథ బాగుంది. కానీ ముగింపుతో "ఆమె తిరిగి రాదు. తనకు తెలుసు" అని శ్రీ విజయగారు వ్రాశారు. దాని అర్థమేమిటో, ఎంత ప్రయత్నించినా తెలియలేదు. అక్కడ తగిన కారణాలు రచయిత ఆమె రాకపోవటానికి వ్రాయలేద రచయిత నా సందేహాన్ని తీర్చగల రను కుంటాను.

జి రాఘవరెడి (చీరాల)

*　　*　　*

"కఠినాత్మురాలు" సహజశైలిలో సాగిపోయింది. కఠినాత్ముల కరడుగట్టిన కాఠిన్యాన్ని కరిగించే శ్రీ "అవసరాల" వారి కథ ప్రతివారు అత్యావసరముగా చదువదగినదని భావిస్తూ వారికి మా హృదయాభివందనములు తెలుపుచున్నాము.

బి. సరోజిని, బి రామయ్య (ఏలూరు)

## సీరియల్ కథ

కొత్త సీరియల్ "పన్నీరు—కన్నీరు" మొదట నీరుకారినా 'సశేషం'వరకు వచ్చేటప్పటికి పరవాలేదనిపించింది. కథాగమనంబట్టి ముందు కథ భాగుంటుందని ఆశిస్తున్నాము.

ఎస్. వి. సుబ్బరాజు (అమలాపురం)

*　　*　　*

## సందేహం

సంక్రాంతి సంచికలో ఒకచోట "సినిమాలు—జాతీయ సమైక్యత" ఆ వ్యాసముపై పోటీ నిర్వహిస్తున్నట్లుగా ప్రకటన చూచాము. అందులో రచనలు పంపవలసిన ఆఖరి తేదీ 29—2—63 అని ఉంది. ఫిబ్రవరి నెల ఈ సంవత్సరంలో 29 వ తేదీ లేదు. ఇది లీపు సంవత్సరం కాదు. ఇది 28—2—63 అని ప్రచురించవలసినది.

ఇద్దరు పాఠకులు (కర్నూలు)

**మీరు సూచించినట్లు పొరబాటు సరిదిద్దుతాము!**











# 'హేజ్‌లైన్' కోల్డ్ క్రీం

## అతి సున్నని, అతి మెత్తని చర్మంకోసం !

'హేజ్‌లైన్' కోల్డ్‌క్రీం, మీ చర్మానికి అతి సున్నితమైన సౌందర్య సాధనం. మీ కంటికి కనపడని మురికిని సహితం ఇది తొలిగించి వేస్తుంది...బయట పడడానికి ముందే మొటిమలూ మొదలైన వాటిని ఆపి వేస్తుంది. 'హేజ్‌లైన్' కోల్డ్ క్రీంలోగల నూనెలు. మీ చర్మాన్ని దిట్టంగానూ, యవ్వనంగానూ వుంచి, మీ శరీర ఛాయను కాంతి వంతంగా చేస్తాయి. మెత్తగా, సున్నగా కాంతివంతంగా వుండే చర్మంకోసం, ప్రతిరోజూ రాత్రి మీ ముఖాన్ని 'హేజ్‌లైన్' కోల్డ్ క్రీంతో పరిశుభ్రంచేసుకొనండి. ప్రతిఉదయం ముఖం కడుక్కొన్నాక, "'హేజ్‌లైన్' స్నో" రాసుకొనండి—దీని మీద పౌడరు బాగా అద్దడమేగాక, మీ చర్మానికి రక్షణ కూడా సమకూర్చుతుంది.



బర్రోస్ వెల్‌కం ఉత్పత్తి

ఆంధ్రసచిత్రవార

# పత్రిక

వ్యవస్థాపకులు
దేశోద్ధారక కాశీనాథుని
నాగేశ్వరరావు పంతులుగారు

శుక్రవారం: 18—1—63
శుభకృన్నామ సం॥ పౌషమాసం॥ బ॥ అష్టమి
సంపుటము : 55 సంచిక : 20
స్థాపితము :
1908

ముఖ్య సంపాదకుడు :
శివలెంక శంభుప్రసాద్
సంపాదకుడు :
శివలెంక రాధాకృష్ణ

## ఒక సంవత్సరం చందా వివరాలు

ఇండియా : రూ. 13.00 ఇతర దేశాలు ఓడమీద ( Sea Mail రు. 20.00. (విమానం ద్వారా (Air Mail ): బ్రిటన్, జర్మనీ ఇతర యూరోప్, ఆఫ్రికా దేశాలు— రూ. 114.00. అమెరికా రూ. 176.50. ఆస్ట్రేలియా · 135 00.)

విడిప్రతి : 25 న.పై.
సంవత్సర చందా : 13-0-0.

ఆంధ్రపత్రిక కార్యాలయము
7, తంబుచెట్టి వీధి, మద్రాసు-1

ముఖచిత్రం
రాజశ్రీ



# మనలోమాట

'రెండు రూపాల మనిషి' వ్యాసాలు రెండు. వీటిలో మొదటిది ఈ వారం ప్రచురిస్తున్నాము. ఎలిజబెత్ టేలర్ హాలీవుడ్ తారగా పరిగణింపబడుతున్నప్పటికీ 'క్లియోపాత్రా' చిత్రంవల్ల 'ప్రపంచ ప్రఖ్యాతి' గడించినట్లు భావించవచ్చు. 'హాలీవుడ్ జర్నలిజం' ఎలా ఉంటుందో ఈ వ్యాసాలు చదివిన వారికి కొంతవరకూ తెలుస్తుంది....

* * *

సినిమా వ్యాసరచన పోటీ ఒకటి ప్రవేశపెట్టాము. కాని ప్రారంభంలోనే పొరపాటు ఒకటి జరిగింది. పోటీ ముగిసే తేదీ 29-2-63 అని పడింది! [బహుశః ఇది 'లీప్ ఇయర్' అని మా కంపోజిటర్ అనుకొని ఉండవచ్చు.] 28—2—63 వ్యాసాలు అందేందుకు ఆఖరి తేదీ అని 'రచయితలు' గుర్తించ ప్రార్థన!

* * *

శ్రీ 'యు' రచించిన విచిత్ర వివాహం లోగడ ప్రచురించాము. చాలా నచ్చినట్లు పాఠకులు ఉత్తరాలు వ్రాస్తున్నారు. చాలా ఉత్కంఠను కథ పోషించినట్లు కూడా వ్రాశారు.

త్వరలో శ్రీ "యు" రచన మరొకదాన్ని పాఠకులకు పరిచయం చేయబోతున్నాము. ఇది కూడా వారి పరిశోధనకు కథారూపమే. వెనకటి కథలోకన్నా ఎక్కువ ఉత్కంఠను పోషించే ఈ నూతన రచన పాఠకులను బాగా ఆకర్షిస్తుందని అనుకుంటున్నాము.

కథ పేరూ, ఎప్పుడు ప్రారంభమయ్యేది, తదితర వివరాలను త్వరలోనే తెలియపరుస్తాము. ★

## విషయానుక్రమణిక


ఎందుకైనామంచిది! వాటిలోముందు కూర్చు! ఢిల్లీలో బేరాలాడేందుకైనా ఉపయోగిస్తయ్!
చైనాతో సాన్నిహిత్యం


చైనా
నేనతన్ని ఇంకా నమ్ముతాననుకుంటున్నారా?


సోషలిస్టు సమైక్యత
లోహియా


మీ మద్దతు నాకేం వద్దు లేవయ్యోవ్ బాబూ!
ఒకే నాయకుడు ఒకే విధానం
నెహ్రూ నాయకత్వం ప్రమాదంలో ఉంది.
నెహ్రూను బలపర్చండి!
వ్యక్తి పూజ వర్ధిల్లాలి!



కాంగోలోని సమితిలో సైన్యాలు కటంగాలోని ఎలిజబెత్ విల్లీ న్నాక్రమించిన తర్వాత పౌరులు సేనాని నరోన్హా (భారతీయుడు)కు స్వాగతం చెప్తున్న దృశ్యం

# అస్తవ్యస్తంగా వున్న మన ప్రచారశాఖ

శ్రీకృష్ణ

గడచిన సంవత్సరం అంటే 1962 మహా విస్ఫోటాత్మకమైన సంవత్సరం ఈ ఏడాది మన గాలి మేడలు భ్రాంతులు ఎలా తూలిపోయాయో భారత ప్రజలకు చక్కగా అవగతమైంది ఈ విషయాలకు సంబంధించిన కొన్ని నగ్నసత్యాలు మనకెంత యిష్టం కాకున్నా నిర్మొహమాటంగా చెప్పుకోక తప్పదు

చైనాపట్ల భారతదేశం పంచశీలసాధారంగా అనుసరిస్తున్న విధానం పునాదులతో సహా తప్పిదమన్న విషయం ఈ సంవత్సరం తేలిపోయింది సుమారు ఒక నూరు సంవత్సరాలపాటు తటస్థించనంతటి భారీది, బాధాత్మకమైన పరాజయం మనకు తటస్థించింది ప్రపంచంలోని తటస్థరాజ్యాలనే, తృతీయ శక్తికి భారతదేశం నాయకురాలనే భ్రమ తెరలు విడినట్లు రూపుమాసి పోయింది ఆఫ్రేషియా రాజ్యాలలో భారతదేశానికి మిత్రరాజ్య మంటూ లేకుండా ఏకాకై పోయింది అంతేకాదు భారతదేశం కష్టాలనుంచి ఆదుకొని రక్షించాలంటే తెల్లవాళ్ళే దిక్కయ్యారు భారతదేశం, ఆర్థికంగా సైనికంగా ఎంత అసంసిద్ధంగా ఉందో—ఆ బండారం బయటపడింది కూడా ఈ ఏడే ప్రాథమిక రక్షణావసర వస్తువుల ఉత్పత్తిని ఒక పక్క శ్రద్ధగా చూస్తూనే, శబ్దవేగాధిగామి విమానాలని నిర్మిస్తున్నారని దేశాన్ని శుష్క వాగ్దానాలతో కడుపునింపారు అయినా, ఒక వ్యక్తి—రక్షణ మంత్రిత్వ శాఖను ఇంత అరక్షణీయ స్థితిలో వదలిపోయిన వ్యక్తి శ్రీ కృష్ణమీనన్, అసలేమి జరగలేదన్నట్లుగా, దేశమంతటా తిరుగుతూ ఉపన్యాసాలు చేస్తున్నారు

ఇక ఆర్థికరంగం విషయంలో, తనకున్న 98 కోట్ల కొద్దిపాటి ధనంతో భారతదేశం, చైనా చేసిన అప్రకటిత యుద్ధాన్ని ఎదుర్కోవలసి వచ్చింది అందులో సుమారు 60 కోట్లు అంతర్జాతీయ ద్రవ్యనిధినుండి వచ్చింది! ఆ పాశ్చాత్య దేశాలు దయదల్చి ఆయుధాలు, తదితర సామగ్రి, ఉన్నీ, ఉన్నిబట్టలు సరఫరా చేయకపోతే మన పరిస్థితి ఇంతకన్న అధ్వాన్నంగా వుండేది

లోగడ భారతదేశం ఆఫ్రేషియా రాజ్యాలను కరాఖండిగా సమర్థిస్తూ వచ్చింది ఈ పనిలో అప్పుడప్పుడు పరువు ప్రతిష్ఠలు పణంగాపెట్టే ప్రమాదంకూడా ఏర్పడింది అలాంటి ఈ తటస్థ రాజ్యాలలో ఏ ఒక్కటి కూడా—మనపై నిష్కారణంగా దురాక్రమణ జరిపిన—చైనాను పల్లెత్తుమాట అనలేకపోయాయంటే నిజంగా విచారించాల్సిన విషయమే మహా ఆర్భాటంతో ఏర్పాటైన కొలంబో రాజ్యాల సమావేశంకు మన—సింహం శ్రీఆర్ కె నెహ్రూ హాజరయినప్పటికీ, ఆ సమావేశం ఇటు ప్రధాని నెహ్రూ చెప్పిన సెప్టెంబరు 8 నాటి పరిస్థితికి, అటు చైనాప్రధాని చెప్పిన 'స్వాధీన రేఖ' వాదానికి మధ్యేమార్గంగా వేరొక క్రొత్త ప్రతిపాదన తయారైందని వార్తలు తెలుస్తున్నాయి చైనాప్రధాని అంగీకరించే పక్షంలో ఈ కొలంబో ప్రణాళికలో భారతదేశం ప్రతిష్ఠకు భంగం రానివిధంగా ప్రతిపాదనేదైనా చూసుకోవచ్చు సైనికంగా, రాజకీయంగా భారతదేశం చేయదగిన ఉచితమైన పని ఒకటే చైనాను దూది మాదిరి ఎగరగొట్టేస్తామనే శుష్క ప్రసంగాలలా వదిలేద్దాం అసలు చైనా సైనికులను మెక్ మాహన్ రేఖకు అవతలవైపున నిలబెట్టే శక్తి సంపాదించుకోవాలంటే భారతదేశానికి కనీసం మూడేళ్లయినా పడుతుంది ఒక భారీ ఎత్తు యుద్ధాన్ని కొనసాగించుకోగలందుకు తగిన ఆర్థిక బలం గానీ, పారిశ్రామిక బలం గానీ ప్రస్తుతానికి లేవు

భారతదేశానికి కొంత వెసులుబాటు కలిగి తన బలాన్ని తిరిగి పుంజుకొని పటిష్ఠం చేసుకోగలిగే ఏ ప్రతిపాదనన్నా ప్రధానమంత్రి ఆమోదించాల్సి ఉంటుంది దానికి ప్రస్తుత పరిణామాల దృష్ట్యా ప్రజల మద్దతు ప్రధానికి ఇప్పుడు చాలా అవసరం భారతదేశం సైనికంగా చాలా దుర్బలంగా ఉందనీ, తిరిగి బలం సమకూర్చుకోవాలంటే, కొన్ని ఊపిరి పీల్చుకునే వ్యవధి కావాలన్న విషయం అందరితోబాటు చైనాకు కూడా తెలుసు కనుకనే, ఇప్పుడు తనకున్న పంచి

54 వ పేజీ చూడండి

# సత్కవితామూర్తి శ్రీ కాటూరి వెంకటేశ్వరరావు

ఆరోజు ఆంధ్రభాషా నిలయంలో అడుగుపెడుతుంటే ఒళ్లు జలదరించింది. ఈ గ్రంథాలయమేమీ కొత్తగాదు; సుల్తానుబజారు సెంటరుకు ఓ నిముషం నడక దూరం ఉంటుంది. ప్రక్కనే రెండు సినిమాహాళ్లు; ఎదురుగా దుకాణాలు బారులు తీర్చి ఉంటాయి. సాయంత్రం అయేటప్పటికి కావలసినంత సందడి. జనం కిటకిటలాడుతూ ఉంటారు. కాస్త మైక్ ధ్వని వినిపించేటప్పటికి, ప్రతివాడు ఈ నిలయంలోకి వచ్చి తొంగిచూసి పోతూ ఉంటాడు. ఇక్కడ జరిగే సభలకు, సమావేశాలకు ప్రత్యేకంగా ప్రచారం చెయ్యకపోయినా సాయంత్రంపూట అక్కడ మసిలే జన సమూహాన్ని ఇట్టే ఆకర్షించేస్తుంది. అదీగాక ప్రతినిత్యమూ, చదువరుల సంఖ్య నిండుగా కనుపిస్తూనే ఉంటుంది.

సాహిత్య సమావేశాలు చూశాం; వైజ్ఞానిక ప్రదర్శనలు తిలకించాము; కవి సమ్మేళనానికి హాజరయినాం; పెద్దల్ని దర్శించాం; ఉపన్యాసాలు విన్నాం. అయితే ఆనాటిది యిలాంటిదేమీ కాదు; సంతాప సభ. శ్రీ కాటూరి వెంకటేశ్వరరావుగారు దివంగతులైనందుకు సంతాప సభ. ఎంతో బరువుగా నిట్టూర్పు వచ్చింది. మనస్తాపం ఎక్కువయింది, అప్రయత్నంగా కళ్లు చెమ్మగిలినాయి. ఎవరో ఆత్మీయుడు చెప్పకుండా అదృశ్యమయినట్లయింది. ఆ నిలయంలోనే, ఎన్నోసార్లు ఠీవిగా నిలబడి ఆ నిండువిగ్రహం ఉపన్యాసాలు చేయటం కళ్లారా చూశాం. తల వంచని వీరుడు హుందాగా చేతికర్ర ఊగించుకుంటూ, గంభీరమైన ముద్రతో, ఆయన ఆ బజార్లో ఒంటరిగా నడుస్తూ వెళ్లిపోవటం చూశాం. కవిత్వంయొక్క అత్యున్నతస్థాయితో పాటు, వ్యక్తిత్వాన్ని కూడా మహోన్నతం చేసుకుంటూ, రెంటియొక్క పరస్పర సంబంధాన్ని పోషించుకుంటూ వచ్చిన ధీశాలి. ఆయనెంత గొప్ప కవో, అంత గొప్ప వ్యక్తి కూడా అని నలుగుర్లో అనిపించుకో గలిగాడు. 'ఓరి బాబో, యిదేమి శైలి! ఎట్లా కుదిరిందీ' అని ఆయన—కవిత్వాన్ని గురించి ఆశ్చర్యబోయినట్టే, అబ్బ! ఎంత గంభీరమైన మనిషి అని ఆయన్ను చూసినవారు ఆశ్చర్యపోయారు. తెలుగు సాహిత్యంలో విశిష్ట స్థానాన్ని సంపాదించుకుని, తోటి కవుల మెప్పులను, గురువుగారి ప్రేమాశీస్సులను పొందిన ధన్యజీవి ఆయనయొక్క ధీశక్తి కేవలం, కవిత్వంమేరకు పరిమితం కాక, అతి విస్తృతమై దేశభక్తి ప్రకటించటంలోనూ, సాంఘిక దురన్యాయాలను ఎలుగెత్తి చాటటంలోనూ, పత్రికా సంపాదకత్వంలోనూ కూడా, శాశ్వతమైన ముద్ర వేసుకో గలిగింది.

ఇలాంటి సహృదయుడు, అమృతమూర్తి, ప్రఖ్యాత కవిని గురించి చాలామంది మాట్లాడారు. వ్యక్తిగత సంబంధాన్ని పురస్కరించుకొని మనస్సుల్లో నాటుకుపోయిన అతి సన్నిహిత విషయాలను జ్ఞప్తికి తెచ్చుకుంటూ ఆయనపట్ల శ్రద్ధాంజలి ఘటించారు. డెబ్బైయేళ్ల జీవితంలోనూ, నలభైయేళ్లుగా సారస్వత కృషి చేసిన ఆయన జీవిత విశేషాలను గురించి గాని, కవితా ప్రతిభను గురించి గాని, ఎంత చెప్పినా తరగదు. అలా ఉపన్యాసాలు వింటూ ఉంటే, మనస్సెటో పోయింది. గత స్మృతులు హృదయాన్ని కదిలించేసినాయి. తల విదిలించేసి, కళ్లు గట్టిగా మూసుకుంటే, మనస్సు కలుక్కుమంది. ఆలోచన యిట్టే మలుపు తిరిగింది. కళ్లు తెరచి నాలుగు మూలలా చూసేటప్పటికి, ఎంతమందో ఆంధ్ర ప్రముఖుల పటాలు గోడలమీద వేలాడుతున్నాయి. కూర్చున్న హాలు రూపురేఖలు కూడా మారిపోయినాయి అసలు శ్రీ కృష్ణదేవరాయాంధ్రభాషా నిలయమే కొత్తదనాన్ని తొడుక్కుంది. ఈ మార్పు ఇటీవలే జరిగింది. ఈ గ్రంథాలయం కేవలం పది పుస్తకాలు దొరికే చోటుగానే పరిగణింప బడలేదు. క్రిందటి సంవత్సరమే వజ్రోత్సవం చేసుకొన కలిగిందంటే సంస్థయొక్క స్థాయి, స్తోమత, విశిష్టత ఇట్టే స్ఫురణకు రాకమానవు.

హైదరాబాదు సంస్థానంలో ఉర్దూ భాష రాజభాషగా ఉండేది. ఆ రోజుల్లో ఉర్దూ ప్రాభవం, తెలుగుయొక్క స్థానాన్ని కప్పేసింది. విద్యాలయాల్లో బోధనాభాష కూడా ఉర్దే! ప్రభుత్వ భాషే అది అయినప్పుడు, దానికి లోటేముంది! ప్రతి వ్యక్తీ, ప్రభుత్వోద్యోగానికో, పరపతి సంపాదించుకోవటానికో తప్పనిసరిగా తెలుగు మాతృభాష అయినప్పటికీ, ఉర్దూకే ఎక్కువ స్థానం యివ్వటంలో ప్రజాబాహుళ్యాన్ని నిందించి ప్రయోజనం లేదు. సంస్థానం విచ్ఛిన్నం అయిపోయి మూడు భాగాలుగా చీలింది. తెలుగు భాషకు కావలసినంత ప్రోత్సాహం లభించింది. అయినప్పటికీ ఈనాటికీ కూడా తెలుగు ప్రాభవం ఆంధ్రప్రదేశ్ రాజధాని నగరంలో ప్రస్ఫుటంగా ద్యోతకం కావటం లేదనే విమర్శ కూడా ఉంది. ఈమధ్యనే ఓ ప్రముఖ నాయకుడు మాట్లాడుతూ, హైదరాబాదు పట్నం వస్తే, ఏ కాన్పూర్కో, లక్నోకో వెళ్లినట్టుగానే ఉంటోంది గాని, మన తెలుగువాళ్ల రాజధానికి వచ్చినట్టు అనిపించటం లేదని అన్నారు. ఇది అతిశయోక్తిగా అన్నమాటైనా దీంట్లో కొంత సత్యం లేకపోలేదు.

ఆ రోజుల్లో తియ్యటి తెలుగుతనం నాలుక కరచుకుందామన్నా కనిపించని పరిస్థితుల్లో కొంతమంది భాషాసేవకులు తెలుగుతేటను పదిమందికీ చవిచూపించుదామనే ఆసక్తితోనూ, అభిలాషతోనూ ఈ గ్రంథాలయం స్థాపించటం జరిగింది. మాతృభాషా పిపాసకులు లేకపోలేదు. ప్రజల్లో రగుల్కొన్న స్వాతంత్ర్యాగ్నిని చల్లార్పుతూ, సంస్థానాధీశులు చేసిన అరాచక చర్యల్లాగానే తెలుగుభాషయొక్క సొంపులు బహుముఖంగా వికాసం చెందకుండా ప్రభుత్వం సవతి ప్రేమ చూపిస్తూనే వచ్చింది. నివురుకప్పిన నిప్పులాగా తెలంగాణాలో జాతీయోద్యమం యొక్క జ్యోతిని వెలిగిస్తే తన వంతుకూడా చమురు

53-పేజీ చూడండి



## అమరకవి
## శ్రీ కాటూరి

సౌమ్యకవితా శ్రీమూర్తి శ్రీ కాటూరి వేంకటేశ్వరరావు గతనెల 25—12—62న స్వర్గస్థులయ్యారు. ఆయన మరణంతో తెలుగుజాతి ఒక సరస కవిని పోగొట్టుకుందనవచ్చు. భాషలోనూ, భావంలోనూ ఆయన చూపే సొంపులన్నిటికీ తార్కాణాలు వారి రచనలు గుడి గంటలు, సౌందర్యలహరి మొదలైనవి.

శ్రీ పింగళి లక్ష్మీకాంతంతో కలిసి శ్రీ కాటూరి సౌందరనందం, పౌలస్త్య హృదయం అనే కావ్యాలు రచించారు. ఇవికాక శ్రీ కాటూరి స్వప్నవాసవదత్తం, ప్రతిజ్ఞా యౌగంధరాయణం లాటి సంస్కృత నాటకాలను తెనిగించారు.

శ్రీ కాటూరి కవితా ప్రాభవం కలవాడు మాత్రమే కాదు; స్వాతంత్ర్య సమరయోధుడు కూడా 1895లో జన్మించిన శ్రీ కాటూరి పట్టభద్ర విద్యాభ్యాసంలోనే దేశ స్వాతంత్ర్యం కోసం కారాగారానికి వెళ్ళారు. వారు కొన్నాళ్ళు కృష్ణాపత్రిక సంపాదకత్వం వహించారు.

నిత్య సౌందర్యానందహృదయుడు శ్రీ కాటూరి మరణం, ఆంధ్రసాహితీలోకాని కొక తీరని లోపం. భౌతికంగా ఆయన అదృశ్యుడైనా, ఆ సుకవితా సౌజన్యమూర్తి తమ రచనల ద్వారా మనలో అమరంగా వెలుగుతూనే ఉంటారు. 

# అద్వితీయమైన వినోదం!

Sharp
JHANKAR

ఉత్తమ పంథా వినికిడి! షార్ప్-ఝుంకార్ మనోరంజితమైన వినోదాన్నిస్తుంది. ఇక్కడకు-అక్కడకు-ఎక్కడకైనా సరే తీసుకు వెళ్లండి. సందడి గొలిపే సహ భాషిణి జీవితాన్ని ఉల్లాసంతో ఊగిస్తుంది. అంతా ఆనందమయం చేసి, ఆత్మ బంధువుగా వుంటుంది.

హయకావా ఎలక్ట్రిక్ కంపెనీ లిమిటెడ్, జపాను. వారి సాంకేతిక సహకారంతో తయారు చేయబడింది.



మోడలు బి. జడ్. 490
9 ట్రాన్సిస్టర్, 4 బ్యాండ్లు
రు. **393** ఎక్సైజు సుంకముతో సహా
(పన్నులు అదనము)
పట్టుకునే వంచికి అదనం



ASP. IR-57 TEL

ట్రాన్సిస్టర్ రేడియోలలో అగ్రగణ్యులు
రేడియో విభాగము:
ఇండియన్ ప్లాస్టిక్స్ లి., బొంబాయి-67.



మీకు సమీపముననున్న షార్ప్-ఝుంకార్ డీలరును కలుసుకోండి.

*మద్రాసు, ఆంధ్రప్రదేశ్, కేరళ, మైసూరులకు ప్రాంతీయ డిస్ట్రిబ్యూటర్లు:*

**జే ఓ. ఫోన్ కంపెని, 13, మింట్ వీధి, మద్రాసు.**




జరిగిన

సిరిపాలెంలో సూరపరాజుకరణం సూర్యనారాయణగార్ల కుటుంబాలు ప్రశస్తికెక్కినవి. సూరపరాజు తల్లి లక్ష్మమ్మ. ఆ ఇంట పెద్దబామ్మగా రున్నది, సూర్యనారాయణకి నలుగురు పిల్లలు. ఆ ఊరికి వరదలువచ్చాయి నరసింహంగారూ, వచ్చారు. అంతకుక్రితం కూరపాడులో వేంకట శాస్త్రిగారి కూతురు పెళ్ళి ముస్సబు పాయంలో జరిగింది కాని,ఆమె మానభంగమైందనే అవమానంలో ఆత్మహత్య చేసుకుంది శాస్త్రిగారు మరణించాడు ఆయన ఇల్లు తగలడిపోగా, కొడుకు మాయమయ్యాడు. కొత్తగావచ్చి నరసింహం సూరపరాజు మద్దత్తులో సిరిపాలెంలో బడి పంతులయ్యాడు. సూరపరాజు కుమారుని వివాహం కారణంగా సూర్యనారాయణగారికి ఆయనకు స్పర్థ ఏర్పడుతుంది,

ఓ..

# 9

## ఇంట్లో చీకటి

ప్రపంచాన్ని పట్టిలు కొట్టిస్తున్న డిప్రెషను రోజులు వచ్చాయి అన్నిటికీ ధరలు పడిపోయాయి ఎన్ని బస్తాల ధాన్యం పండించినా, తిండికంటే పైఖర్చెక్కువైన సూరపరాజుగారిలాంటి వాళ్ళకి ఎందుకూ చాలటంలేదు. అదేదో పద్యంలో అంటాడు. పెళ్ళాం పురుడూ, గురువుల రాక, వాకిట దొమ్మరాటా, అల్లుని అల్క, కరువూ, దరిద్రం, ఆబ్దికం అన్నీ ఒక్క మాటొస్తాయని. అలాగే అయింది సూరపరాజుగారింట్లో. భూమిలో ఏదో పురుగు బయల్దేరి పంటలు సగానికి సగం పోయాయి. పిల్లలు పెద్దవాళ్ళయ్యారు. కుటుంబ భారం పెరిగింది. కూతురూ, అల్లుడూ రావడాలూ, ముచ్చట్లూ యథావిధిగా సాగుతున్నాయి. తన చిన్నప్పట్నించీ తండ్రి—భయంచేత అణచిపెట్టుకున్న కోరికలన్నీ ఇప్పుడు మామగారిద్వారా తీర్చేసుకుందామని అల్లుడి కోరిక. కొద్దో గొప్పో చదువుకుని బుద్ధిమంతు అయినవాళ్ళకి కూడా మామగారి దగ్గరనించి రాబట్టడం విషయంలోఉన్న ఇంగితజ్ఞానం కాస్త అడుగంటుతుంది ఎదటివాళ్ళ ఇబ్బందులూ, అవసరాలూ ఇవేవీ ఆ కళ్ళకి కనబడవు అందరికీ ఇస్తున్నారు మామగార్లు, తన మామగారూ ఇవ్వాలి. లేకపోతే నలుగుర్లో నామర్దా కాదూ! అయినా తనలాంటి అల్లుడు ఊరికే వస్తాడా, ఆ మాత్రం కష్టపడకపోతేను

ఇదికాక తల్లికీ, భార్యకీ జబ్బులూ, కొడుక్కి పిల్లలు పుట్టడాలు, కూతుర్ని పురిటికి తీసుకు రావడాలు ఇలా ఎన్నో. మెల్లిగా తరాలుగా ఉన్న బరువైన బంగారు వస్తువులు ఒక్కొక్కటే తాకట్టులోకి పోడం సాగించాయి. వెళ్ళినది మళ్ళీ రావడం కల్లోమాట. తిన్నగా అమ్ముకొనేనా అమ్ముకుంటే పూర్తి విలువేనా వచ్చేది.

వడ్డీ పెరుగుతోంది. కాని, అసలేనా తీరే మాటం కనపట్టం లేదనుకున్న షావుకారు నాగయ్య పూర్వపు గౌరవాన్ని మరచి, పీకమీద కూర్చున్నాడు, అప్పు తీర్చమని. సుబ్బారావుకి అప్పటికి తమ ఆర్థిక పరిస్థితి కొంచెం అర్థమయింది. నాగయ్య వ్యవహారంలో కొంచెం నరసింహంగారు ఆదుకోకూడదా అని తండ్రితో అన్నాడు. ఆయన అన్నారు. "ఆర్థికంగా చితికిపోయేవాళ్ళని ఎవళ్ళూ ఆపలేరు. నరసింహం ప్రపంచ వ్యవహారాల్లో మేధకుడు. అలాంటి వాడు మన ఈ ఋణ ప్రవాహానికి అడ్డుపడితే, అతను కూడా కొట్టుకుపోతాడు. ఏదో ఇన్నాళ్ళకి కొంచెం మామూలు మనిషిలా బ్రతుకుతున్నాడు నాకు చివరి రోజులకి ఒక మనిషిని బాగుచేశానని ఆ తృప్తైనా మిగలనీ"

సుబ్బారావుతో ఆలోచించి సూరపరాజుగారు పదెకరాలు అమ్మేసి నాగయ్య అప్పు, ఇంకేవో కొన్ని చిల్లర అప్పులూ తీర్చేశారు. సుబ్బారావు ఏదేనా వ్యాపారమో ఏదో చేసి, మిగిలిన ఆస్తిని నిలబెడదామని తండ్రితో అన్నాడు. ఖర్చులు ఎలా తగ్గించాలో కూడా ప్రణాళికలు వేశాడు. కాని, ఇవన్నీ ఊహలు, అంచనాలుగా ఉండగానే ఇంకొక పిడుగు పడింది. భూముల ధరలు పడిపోతున్నాయని చూసిన మార్వాడి సమయం మించిపోకుండా సొమ్ము వేసుకునేందుకు దావా తీసుకొచ్చాడు. కొంచెం వ్యవధి ఇస్తే కొంత భూమి అమ్మి, అప్పు తీరుస్తామన్నారు సూరపరాజుగారు. కాని, ఇచ్చిన స్వల్ప వ్యవధిలో ధరలు రానిచ్చారు కాదు ఊళ్ళోవాళ్ళు. అయినకాడికి వేసుకుందామని చూసేవాళ్ళే ప్రతివాళ్ళూను. భూమి అమ్మకం కాలేదు. కోర్టులో డిక్రీఅయి తనఖాలోఉన్న పదిహేనెకరాల మాగాణి మార్వాడి పరమయింది. ఆ దెబ్బ నుంచి తట్టుకోలేని సూరపరాజుగారు మంచమెక్కారు.

నరసింహంగారికి కోర్టులో వ్యవహారం ఉండగా తెలిసింది సంగతి. ఆయన వెళ్ళి సూరపరాజుగారి నడిగారు: "నన్నెందుకు పరాయివాణ్ణి చేశారు. మాటమాత్రం చెబితే, నా కలిగినంత సర్దితే కొంతలో కొంత భూమి మిగుల్చుకునేవారుకదా. ఆయన అన్నారు: "ఏ జన్మలోనో ఎవరిదో సొమ్ము తిని ఉంటాను. ఇప్పుడు ఇలాంటి బాధలొచ్చాయి. ఇప్పుడు మళ్ళీ ఆ పనే చెయ్యమంటారా?"

45-వ పేజీ చూడండి

# వ్యాస రచన పోటీ

# 'సినిమాలూ - జాతీయ సమైక్యతా'

## మొదటి బహుమతి: రు. 100
## రెండవ బహుమతి: రు. 75
## మూడవ బహుమతి: రు. 50

మన దేశం మొత్తంమీద, ప్రజలందరికీ అందుబాటులోవుండి వినోదాన్ని కలిగించే సాధనాల్లో సినిమా ముఖ్యమైందనే చెప్పాలి. అంతేకాక సినిమా జాతీయ సమైక్యతకు మంచి సాధనమనికూడా చాలామంది అంటున్నారు. హిందీ తదితరమైన ఉత్తరభాషా చిత్రాలు దక్షిణ భారతదేశంలో ప్రదర్శించటం, ప్రదర్శించే చిత్రాలసంఖ్యా, రోజు రోజుకూ ఎక్కువౌతున్నది. చిత్రాల్లో సంగీతంకూడా ఇవ్వాళ అన్ని భాషా చిత్రాల్లోను ఒకేరీతిగా, ఒకేస్థాయిలో ఉన్నట్లు కన్పిస్తున్నది. ఒకవిధంగా చిత్రాలు జాతీయ సమైక్యతకు దారితీస్తున్నవని చెప్పవచ్చు.

మరి కొంతమంది, కొన్ని సినిమాలు దేశంలోని వర్గవర్ణ వైషమ్యాలు తదితరమైన అవాంఛనీయమైన విషయాలను రెచ్చగొట్టి, విచ్ఛిన్నకరశక్తులుగా మారిపోతున్నవని అంటున్నారు.

పై రెండు అభిప్రాయాలలోఏది వాస్తవం అన్న విషయంపై పాఠకుల అభిప్రాయాలు తెలుసుకునే ఉద్దేశ్యంతో ఈ పోటీ నడుపుతున్నాము.

తమ అభిప్రాయాలను వ్యాసరూపంలో పొందుపరుస్తూ 28-2-63 లోపుగా మా కార్యాలయానికి అందజేయవలసిందిగా పోటీలో పాల్గొనే వారిని కోరుతున్నాము.

●

**● వ్యాసాలు 5 అరఠావు పేజీలకుమించి ఉండరాదు. ● కాగితం ఒకవైపుననే రాయాలి. ● కవరుపైన 'సినిమా వ్యాసరచన పోటీకి' అని స్పష్టంగా వ్రాయాలి. ● తుదినిర్ణయం సంపాదకునిదే. దీనిపై ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపబడవు. ● త్రిప్పి పంపగోరువారు తగిన తపాలా బిళ్ళలు అంటించిన కవర్లు జతపరచి పంపాలి. ● బహుమతి పొందిన వ్యాసాలు ఆంధ్ర సచిత్ర వారపత్రిక ఉగాది సంచికలో ప్రచురిస్తాము.**

# వనితాలోకం

## ఇంటివారి పోరు

### "హైమ"

'చెప్పులోని రాయి, చెవులోని జోరీగ' అని చెపుతూ ఇంటిలోని పోరు యింతింత కాదయా అంటూ ముగించారు మన మహాకవి దీనినిబట్టి ఆ మహాకవి బ్రతికున్నరోజుల్లో యిళ్ళు అద్దెకివ్వటం అంటూ ఉండేది కాదేమో అనిపిస్తుంది. అధవా ఇచ్చినా, యిల్లు గలవారితో ఏ గొడవలూ లేకుండా రోజులు సుఖంగా గడిచేవని మనం అనుకోవచ్చు

మా స్నేహితురాలు సుశీల హైద్రాబాదుకి వచ్చి అప్పుడే రెండు నెలలైంది. ఇంతవరకూ పోలేదు ఒక్కసారైనా వాళ్ళింటికి. చూసివద్దాంకదా అని బయలుదేరాను. తీరా యింటికివెళ్ళేప్పటికి ఇల్లంతా రొదతో మార్మ్రోగుతోంది. ఒకటే గోలగా ఉంది నన్ను చూచి "ఏమమ్మా! ఇన్నాళ్ళకి కనుపించావా మేము ? దా ! కూర్చో ! !" అంటూ ఆహ్వానించింది సుశీల "అబ్బే ఏంలేదు సుశీ ! రోజూ వద్దామనుకుంటేనే రోజులు వెళ్ళిపోతున్నాయ్ అది సరే కాని ఏమిటి ఈ గోలంతా ? ఇల్లంతా అదిరిపోతోంది. మూడో ప్రపంచయుద్ధం మీ యింట్లోనే జరుగుతున్నట్లుందే !" అన్నాను నవ్వుతూ.

"ఏం చెప్పను ? అవన్నీ మా యింటివాళ్ళ మాటలు; ఇరవైనాలుగు గంటలూ ఒకటే రణగొణ ధ్వని. ఎవరినో ఒకరిని సాధిస్తూఉంటే కాని వాళ్ళకి రోజులు గడవవు. మా కో మంచి యిల్లు చూసి పెడుదూ. ఈ నరకకూపంనుంచి ఎప్పుడు బయట పడతామా అని ఆదుర్దాగాఉంది. ఎన్ని అమృతాంజనం డబ్బాలు కొన్నా తగ్గటల్లేదు తలనొప్పి" అంటూ చెప్పిన సుశీలమాటలు నాకు చాలా బాధకలిగించాయ్ సుశీల చెప్పిన కొన్ని విషయాలు నాకు సంభ్రమాశ్చర్యాలను కలిగించాయ్

అసలు హైద్రాబాదులో యిల్లు దొరకాలంటే బ్రహ్మప్రయత్నంచెయ్యాలి అధవా దొరికినా సవాలక్ష ఆంక్షలుంటాయ్. ఇంట్లో భార్యా, భర్త, ఒక పిల్ల—ముగ్గురికంటె ఎక్కువ ఉండకూడదు తొమ్మిది గంటల తర్వాత లైట్లు వెయ్యకూడదు. వానొస్తున్నా,వరదొస్తున్నా పచ్చళ్ళు దొడ్లో రోట్లోనే రుబ్బాలి. ఇంట్లో చేసుకోకూడదు. కుంకుడుకాయలు మొదలైనవి యింట్లో కొట్టకూడదు. కొడితే గచ్చు పగిలిపోతుంది. గోడకి మేకులు కొట్టకూడదు. ఏమన్నా అంటే "మీకేం? రెండురోజులుండిపోతారు. తర్వాత బాగుచేయించేప్పటికి మా దుంప తెగుతుంది" అంటారు

మరి కొందరున్నారంటే యిల్లు కడగకూడదనే చెప్తారు. ఏమమ్మాఅంటే గచ్చు నాని పగిలిపోతుందిట. మరి వాళ్ళ అజ్ఞానానికి నవ్వాలో ఏడవాలో తెలియదు.

కొందరు ప్రభుత్వం ఆర్డర్లు జారీచేసినట్లు చేస్తారు. వాళ్ళ యింట్లో అద్దెకున్నవాళ్ళందరూ యింటివాళ్ళు పోయించుకునే పాలవాడిదగ్గరే పాలు పోయించుకోవాలి. ఇంటివాళ్ళ పనిమనిషినే వాళ్ళు పెట్టుకోవాలి. ఇంటివాళ్ళ అనుమతి. లేకుండా యింట్లోకి ఎవ్వరినీ రానియ్యకూడదు. తుఫానులోనైనా చంటిపిల్లలకి నీళ్ళు బైటే పొయ్యాలి. కనీసం దేవుడికి కొట్టే కొబ్బరికాయకూడా యింట్లో కొట్టకూడదంటారు. మరి భగవంతునిముందు కొట్టక బైటకొచ్చి కొడతామా చెప్పండి. ఇలాగుంటాయ్ వాళ్ళ మాటలు.

మా సుశీల చెప్పిన సంగతి నాకు మరీ ఆశ్చర్యం కలిగించింది. ఒకసారి సుశీలయింట్లో ధర్మామీటరు, ఇన్‌హేలరు మొదలైన సామానులు కొన్ని పోయాయిట ఆరోజు యింటివాళ్ళబ్బాయ్ మినహా ఎవ్వరూ రాలేదు. ఇంటివాళ్ళనడిగితే వాళ్ళబ్బాయ్ స్కూల్లో బాగా పరిగెత్తినందుకు ఇన్‌హేలరు, పద్యాలు చదివినందుకు ధర్మామీటరు, డిబేటులో బాగా మాట్లాడినందుకు నేతిగిన్నె, లాంగ్‌జంప్‌లో రెండోవాడుగా వచ్చినందుకు స్ప్రే—పంపు యిచ్చారని చెప్పింది. స్కూళ్ళలో ఎక్కడైనా ధర్మామీటర్లు, స్ప్రే పంపులు బహుమతులుగా యివ్వటం మీరెక్కడైనా చూచారా ? అవి మావేనండీ, మావి కనబడటం లేదు అంటే 'వాటిమీద మీ పేరుందా? మావాడికి బహుమతులు రాకూడదా ?' అంటూ ఎదురుప్రశ్న వేశారుట. మరి వాళ్ళనేమనాలి. ధర్మామీటర్ల దగ్గరనుంచీ ప్రతిదానిమీదా పేర్లు కొట్టించుకోగలమా ! అసలిలాంటి దొంగతనాలు చేసే యిళ్ళల్లో ఉండాలంటే దినదిన గండం నూరేళ్ళయుష్షున్నూ.

మరో చోద్యం చెప్పితే మీరు నవ్వుతారుకూడ! మా స్నేహితురా లొకావిడ మొదట అద్దెకొచ్చినప్పుడు భార్యా, భర్త, పిల్లవాడుండేవాళ్ళు. కొన్నాళ్ళతర్వాత ఆడపిల్ల పుట్టింది. వెంటనే యింటావిడ మా స్నేహితురాలిని పిలిచి 'ఏదో ముగ్గురంటే యిచ్చాంకాని, యింతమందైతే ఎలా ? మీరు మరో యిల్లు చూసుకోండి' అన్నదిట. ఆడది, ఆ మాట అన్నదంటే మీకు మరీ చోద్యంగా లేదూ?

మన సమాజంలో స్త్రీలంటే అసలే చిన్న చూపుంది. దానికి తగ్గట్టు మనం చేసే పనులు, అనే మాటలు యిలాగుంటే మనం గౌరవస్థానం ఎలా సంపాదించుకో గలుతాం చెప్పండి. అలాగని యిల్లుగల ఆడవారందరూ అలాగుంటారని నే ననను. కాని పైన చెప్పిన తగాదాలన్నీ ఆడవారితోనే వస్తున్నాయ్ ఎక్కడ చూచినా! అందుకే అంటారు: పది బట్టతలలు కలిసినా రెండు ముడులున్నంత గోల ఉండదని.

ఇలా చెప్పుకోవాలంటే చాలా గ్రంథం పడుతుంది. కొందరు యింటివాళ్ళున్నారంటే ఆ యింట్లో అద్దెకున్న యింటివాళ్ళ ప్రతివిషయంలోనూ జోక్యం కలిగించుకుని ఆ యింటిని నరకంగా తయారుచేసి పెడతారు. తమాషా చూస్తూ, మరికొందరు మనం చెయ్యాల్సిన ప్రతిపనికీ వంతులుపెడతారు. అదే మనం వాళ్ళ నడిగితే మహాపరాధంగా భావిస్తారు.

కొందరు అప్పంటూ తీసుకువెళ్ళినవి ఎన్నాళ్ళైనా తిరిగివ్వరు. వాళ్ళని మనం అడగకూడదు. ఖర్మంజాలక అడిగామా, రామ—రావణాయుద్ధమే. 'మా యిల్లు ఖాళీచేసి వెళ్ళిపొండి' అంటారు చివరికి. అద్దె తీసుకుంటున్నా, వాళ్ళ దృష్టిలో యిల్లు దాన ధర్మంగా యిచ్చినట్లుంటుంది

అలాగని యిల్లుగల వారందరూ యింతే అనుకోవటం కూడా పొరపాటే కొందరిళ్ళల్లో అద్దెకున్నా స్వంతయింట్లోకంటె సుఖంగా ఉన్నట్లు ఉంటుంది. అద్దెకున్నవాళ్ళందరూ మంచివారని మనం చెప్పలేంకూడా !

అందుకే ఒకరి సాధక బాధకాలు మరొకరు అర్థంచేసుకుపోతే ఏ గొడవలూ ఉండవు. అది లేనిరోజునే గొడవలంటూ బయలుదేరుతాయ్.

కాని ఒక్కవిషయంమాత్రం అనిపిస్తోంది. వేమనకవి ఉన్నరోజుల్లో ఈ విధమైన గొడవలుంటే ఆయన రాసిన పద్యంలో "యింటిలోని పోరు యింతింత కాదయా" అనే బదులు "ఇంటివారిపోరు యింతింత కాదయా, విశ్వదాభిరామ వినురవేమ" అని తప్పక రాసిఉండేవారేమో ననిపిస్తోంది. మరి మీరేమంటారు ? ★

**త్వరలో ప్రారంభం !**

**'అందాలకు చిట్కాలు'**

**వనితల సౌందర్య పోషణకు ఉపయోగపడే 'కిటుకులు' కొన్ని వనితాలోకంలో వరుసగా ప్రచురించబోతున్నాము — ఎదురు చూడండి !**

కాఫీ - రుచిలో
దానికదే సాటి




బ్రూక్ బాండ్
ఫేమిలీ బ్రాండ్ ప్యూర్ కాఫీ

[WTBB432]




## సవరించుకోవలసిన కొన్ని లోపాలు

ఇలాటి వ్యాసాలు ప్రచురించటం "వనితాలోకం" శీర్షికకే గొడ్డలిపెట్టు. ఎందుచేతనంటే వనితలకు ఉపకరించే వ్యాసాలు వ్రాయటం సమంజసం. అంతేగాని, పురుషులలోని లోపాలు వేలుపెట్టిచూప టం, మన (స్త్రీల)లోని లోపాలు కప్పిపుచ్చటం శోచనీయమైన విషయం. మన లోపాలు లేవా ? పురుషులకన్నా మనలోనే ఎక్కువ లోపాలున్నాయి. ఆ లోపాలు అన్నీ వ్రాయాలంటే ఓ వ్యాసమే వ్రాయాలి. దయచేసి ఇకముందు వనితలు వ్యాసాలు వ్రాసేముందు స్త్రీలకు ఉపయోగపడేలా వ్రాయటం ఎంతైనా అవసరం.

యద్దనపూడి మంజులారాణి (గుంటూరు)

* * *

వ్యాసం చదివిన తర్వాత ఈ విమర్శ వ్రాయకుండా ఉండలేకపోతున్నాను.

ఆడపిల్ల లేకపోతే కాలచక్రం దొర్లదని గ్రహించమని వ్రాశారు శ్రీమతి ఎం. సరోజ గారు రీ వారం వనితావాణి వ్యాసంలో. ఆడపిల్ల కాలచక్రం దొర్లడానికి ఎంత అవసరమో, మగపిల్లలు కూడా అంతే అవసరం అనే విషయం మరిచిపోయారనుకొంటాను. లేకుంటే ఇలాంటి వ్యాసం వ్రాసి ఉండరు.

"చదువుకున్న పురుష పుంగవులు కూడా తమ భార్యలను కారణం లేకుండా చీదరిస్తా" రన్నారు. ఏ కొద్దిమందో అలా చేస్తున్నందుకు పురుష ప్రపంచాన్నే సవాలు చేస్తున్నట్లున్న ఈ వ్యాసం చూచే సరికి మనము-వనితలమా, కాదా అనే అనుమానం కూడా వచ్చింది నాకు.

"అబ్బ! ఈ రోజు చాలా పనుంది. ఒక్క నిముషం కూర్చోడానికి కూడా తీరిక లేదన్న"ప్పుడు (భార్య భర్తతో) **"ఆడజన్మ ఎత్తిన తర్వాత ఆ మాట** అనడానికి నీకు హక్కులేదు. మేము చూడు. ఇష్టం వచ్చినప్పుడు లేస్తాం. తిరుగుతాం. నీ కలాంటివేం కుదర"వని హాస్యంగానే ఏ భర్తైనా భార్య నంటారు గాని, వెటకారంగా అనరు. వెటకారంగా అంటున్నారని మన మనుకొనడమే మన కా మాటలు వెటకారంగా అంటున్నట్లు కన్పించడానికి కారణం. అంతకు మించి ఏమీ లేదు!

ఎంత లోభియైనా, తన భార్య ముద్దు ముచ్చట్లు చూచి సంతోషించలేని భర్తలు ఎక్కడో గాని, కన్పించరు. అలాంటి భర్తలు గలవారు తమ దురదృష్టమనో, ఖర్మనో అనుకోవాలి. వనితాలోకం అంటే వనితల ఆశయాలను అభివృద్ధి పరచేదిగాను, మనో ఉల్లాసం, వికాసం కల్గించేదిగాను ఉండాలి గాని, ప్రక్కయింటి వాళ్ళను గురించి, తెలిసిన వాళ్ళను గురించి, దూరపు(దగ్గర)బంధువులను గురించి ఇలా వ్రాయడమే సమంజసంగా లేదు.

జి. ఆర్. హంస (బొంబాయి)

* * *

ఎం. సరోజగారి వ్యాసం చాలా బాగున్నది. నాగరికత పెరిగిన దనుకుంటున్న ఈ రోజులలోనే భార్యలను నీచంగా అనుమానించే భర్తలు ఎంతో మంది ఉన్నారు. సరోజగారన్నట్లు పురుషులు ఏ విషయంలో కసురుకున్నా, పర్వాలేదు కాని, అనుమానిస్తే, ఆ సంసారం నరకమవుతుంది. మన ఈ సోదరులకందరికీ ఎదుటపడిన స్త్రీలు సోదరీమణులన్న భావనే కలిగితే, స్త్రీలు ఈ విధంగా బాధపడవలసిన అవసరం ఏముంటుంది? ఈ వ్యాసం చదివిన తరువాత అటువంటి పురుషులు కొంచెమైనా దారికి వస్తారని ఆశిద్దాం.

సువర్చలాదేవి (హైదరాబాదు)

## అలసట

'అలసట' వ్యాసం చాలా బాగుంది. ఇట్టిసలహాలు కొందరుసోదరీమణులకు అత్యవసరం. కానీ, వారు అదే పేజీలో మూడవ కాలంలో "ఇలాంటి విశ్రాంతి" ఒక్క శారదలాంటి గృహిణులకే కాదు; దినమంతా పనిపాటల్లో ఉండే రక రకాల ఉద్యోగాల్లో ఉన్న యువతులందరికి అని వ్రాశారు. చదివినప్పుడు నాలో కోపం, ద్వేషం కల్గాయి. అలాకాక, దినమంతా పనిచేసే ఆడవారైనా, మగవారైనా సలహా పాటిస్తే ఎంతో లాభదాయకంగా ఉంటుందని నా ఊహ.

అనూరాధ (సికింద్రాబాదు.)

* * *

"వ్యాసం చదివాక నాకు కొంచెం బుద్ధొచ్చిందనే అనాలి. ఇంతకుముందు అంటే పని—మనిషి అన్ని పన్లు చేస్తుంది. ఆయన పొద్దున వెళ్లిపోతే సాయంకాలానికిగాని రారు. ఇంక ఈ మధ్యకాలంలో పుస్తక పఠనమే శరణ్యం. ఇరుగు పొరుగువాళ్ల ఇళ్లకెళ్లే అలవాటున్నా లేదు. మధ్యాహ్నం అన్నం వండుకోటం, తిండం—ఇంతే పని. సాయకాలం కాఫీ కాచాలన్నా మహా కష్టంగా ఉండేది. ఎందుకా అనుకునేదాన్ని. ప్రేమలీలగారి 'అలసట' వ్యాసం చదివేక నా తప్పు తెలుసుకొని ఇంట్లో సగం పన్లు నేనే చేసుకుంటున్నాను. సాయంకాలం షికార్లకి వెళుతున్నాను. ఏదో 24 గంటలు కూర్చోకుండా ఆ పని, ఈ పని కల్గించుకు చేస్తున్నాను. ఇప్పుడెంతో ఉత్సాహంగా ఉంటోంది.

శ్రీమతి పార్వతి రాజన్ (పింపిరి)

★

# వంటలు

## వెజిటబుల్ బోండా

| | |
|---|---|
| బంగాళా దుంపలు | ... 4 పెద్దవి |
| ఉప్పు | ... 2టీ చెంచాలు |
| బఠానీలు | ... 2 ఔన్సులు |
| కారెట్స్ | ... 2 ఔన్సులు |
| ఉల్లిపాయలు | ... 2 |
| బీన్స్ | ...తగుమాత్రం |
| పచ్చిమిరపకాయలు | ... 9 లేక 10 |
| ఆవాలు | ... 1 చెంచా |
| కొత్తిమీర, కరివేపాకు | ...కాస్తకాస్త |
| నూనె | ... 4టీ చెంచాలు లేదా ఎక్కువ అవసరాన్నిబట్టి |
| నిమ్మకాయ | ... ఒక డిప్ప |
| మినప్పప్పు | ... 1 చెంచా |

తొక్కు తీయకుండ బంగాళా దుంపలు ఉడకబెట్టాలి. తరిమ్మా వాటిని ఉల్లిపాయలు తప్ప తరుక్కుని ఉంచుకోవాలి. వాటిని కొంచెంగా మరుగునీళ్లలో ఉడకబెట్టాలి. దీనిని వొలిచిన బంగాళా దుంపల్లో తొక్కుకోవాలి. ఒక అల్యూమినం గిన్నెలో నూనె పోసి పొయ్యిమీద పెట్టండి. అప్పుడు మినపప్పు, పచ్చిమిరపకాయ ముక్కలు, ఉల్లి చెక్కను వేసి వేపండి. ఆనక వెజిటబుల్ తొక్కును వేసి బాగా కలగాపులగంగా చేసి ఉప్పును కలిపి దించి, ఆనక యీ ముద్దను ఉండలుగా చేసి మామూలుగా బంగాళాదుంపల బోండాలకు మాదిరిగానే తయారు చేయాలి — అంటే "పిండిబోవి" లో వేసి వేచి తీసుకోవాలి. ★

# కాల్గేట్ వాడి నోటినించి దుర్వాసన రాకుండా చేసుకోండి రోజంతా దంతక్షయం రాకుండాకూడా కాపాడుకోండి!




ఎందుకంటె : ఒక్క సారి తోముకొంటేనే కాల్గేట్ డెంటల్ క్రీమ్ నోటిలో దుర్వాసన మరియు దంతక్షయమునకు కారణమైన సూక్ష్మ క్రిములను 85% వరకు తొలగించును.

కాల్గేట్ 10 మందిలో 7 గురికి నోటి దుర్గంధమును వెంటనే ఆపుతుందని మరియు భోజనము అవగానే కాల్గేట్ పద్ధతిలో పళ్లు తోముకొనుట ద్వారా ఎక్కువ మందికి ఎక్కువ దంతక్షయము అరికట్టిందని, దంత శాస్త్ర చరిత్రలో పూర్వము ఎన్నడూ తెలియనే యనంతటా శాస్త్ర పరిశోధనల ఫలితముగా నిరూపించబడినది!

ఊరికే నోటిలో నీళ్లు పోసుకొని పుక్కిలించుట చాలదు. భోజనము అయిన వెంటనే క్రమంతప్పకుండా కాల్గేట్‌తో పళ్లు తోముకోండి. దాని చురుకైన నురుగు పళ్ల మధ్య కనపడకుండా ఉండే సందులలోనికి వెళ్లి నోటి దుర్వాసనకు మరియు దంతక్షయమునకు కారణమైన కుళ్లి పోతున్న ఆహారపు తునకలను తీసివేస్తుంది!

పిల్లలు కాల్గేట్‌తో పళ్లు తోము కొనుటకు యిష్టపడతారు. ఎందుకంటె చాల సేపు ఉండే దాని పిప్పరమెంటు వంటి రుచి అంటే వారికి ప్రీతి!

కాల్గేట్‌తో క్రమం తప్పకుండా పళ్లు తోముకొంటే

- ✔ నోటి దుర్వాసనను పోగొట్టును
- ✔ దంతక్షయమును నిరోధించును
- ✔ పళ్లను మెరుస్తూ ఉండేలా ఉంచును




**నోరు ఎక్కువ శుభ్రముగా, తాజాగా ఉండుటకు మరియు పళ్లు ఎక్కువ తెల్లగా ఉండుటకు ప్రపంచములో ఏ యితర పళ్లు తోముకొనే క్రీమ్ కన్న కాల్గేట్ నే ఎక్కువ మంది వాడుతున్నారు**



# హామేషా తమాషా



## ప్రేమ పాఠాలు

ప్రేమించాలనుకొంటున్నారా? నిరభ్యంతరంగా ప్రేమించండి. మనం చూచే చాలామంది ప్రేమికులకన్నా, మనం అనుభవించే ప్రేమే తియ్యగా ఉంటుంది. బాగా ప్రేమించాలంటే దానికి అనుభవం కావాలి.

ప్రేమ పిచ్చి(కి) మందు ఇచ్చి నయంచేసినవాళ్ళు లేరని ఒక డాక్టర్ అన్నాడు. పూర్వం ఒకవిధంగా 'ప్రేమ' ఉండేదికాదు. వాటికి హద్దులు ఉండేవి. ఇప్పుడో ఎక్కడ చూచినా ప్రేమే!

"చల్లని గాలి
మెత్తని పరువు
వెన్నెల రాత్రి
కాదేదీ ప్రేమికుల కనర్హం"

అంటాను నేను. ఎక్కడైనా మనం ప్రేమించవచ్చు. ఆ ప్రేమించేది కొత్త పద్ధతుల్లో ఉండాలి. ఘాటిగా ఉండాలి. ఉదాహరణకు ఒకడు ఒక అమ్మాయిని ప్రేమించాడు. ఆమె అతన్ని నిరాకరించింది. అతడు పెంచాడు గడ్డం. ఆమె వెనుకనే (దీనంగా) తిరుగసాగాడు. ఆమె నవ్వుకొంది. జాలి కలిగి, చేర దీసింది. చూడండి ఎలా ప్రేమను సంపాదించాడో!

ఈమాత్రం కిటుకు తెలుసుకోండి. ప్రయత్నించి చూడండి.

తొలుత అమ్మాయి ప్రేమను (వట్టి చేతులతో కాదు సుమా!) సంపాదించాలి.

తరువాత ఆమెను అప్పుడప్పుడు కలుసుకొంటూ (దెబ్బలాడకుండా) నమ్మకం కలిగించాలి.

ప్రేమకు సంబంధించిన పుస్తకాలన్నీ ఆమూలాగ్రంగా చదివి పారేయాలి.

మీరు ప్రేమలో పడకముందు ఎదుటి వాళ్ళను ప్రేమలో దించాలి.

ప్రేమలేఖలు వ్రాసేటప్పుడు జాగ్రత్తగా (ఎవరికి తెలియకుండా) వ్రాసి అబ్బాయి, లేదా అమ్మాయి చేతుల్లో పడేయాలి. (పిప్పరిమింట్లతోబాటు)

మొదట మొహం మొత్తుతుంది; ఓపికగా ఊగులాడాలి.

### అనుబంధపు చిట్కాలు

1. ఒక్కోసారి ప్రేమించుకొంటే రాత్రుల్లో నిద్ర రాదు. అప్పుడు 'స్లీపింగ్ డోస్' వేసుకోవాలి.
2. కనుల నిదుర రాకపోతే, పద్మావసుకో—ప్రేమలో.
3. కొన్ని కొన్ని సమయాల్లో ప్రేమికుల మాటలు తడబడి—చేతులు ఒణుకులుబుట్టి—ముచ్చెమటలు పోస్తాయి. ఇదే ప్రేమికులకు చిహ్నం.
4. ప్రేమించేముందు గుణగణాలు అవి తెలుసుకోవాలి.
5. ప్రేమించినవారు, తప్పక ఆనందపడుతారు. (కొన్ని కొన్ని సమయాలలో దుఃఖం కూడా) ఇన్ని చిట్కాలు తెలుసుకొన్నారు కనుక ప్రేమించి చూడండి! గుడ్‌లక్!!

యస్. కె. వాసుదేవరావు, పి. విజయారావు (తిరుపతి)

## అంతా - ఇంతే

(మనలో మన మాట) (నదువ్రాలు) కి ఆ కళ్ళజోడు ఎందుకండీ ఆయన (విశాలనేత్రాలు) చూస్తామా? మన కెందుకులే ఇది (లోకం పోకడ) ఐపోయింది. కాకపోతే ప్రక్కన (కుమారి కళ) ఉండగా, ఆ (నరాగమాల) నదువుతూ (బంగారు పంజరం) లో చిలకలా అలా కూర్చుంటా డేమిటి? (వనితాలోకం) అంటే ఈర్ష్య జనించలేదు కదా. లేక ఎప్పుడైనా (విచిత్రవివాహం) చేసుకుందా మనుకున్నాడా? (వివిధ ప్రాంతాల వింత ప్రదేశాలు) తిరిగి వచ్చి (వారఫలాలు) చూసి మరీ చేసుకోమనండి. ఆయన కథ ఒక (కథ గాని కథ) గా మారాలంటే ఇది (హామేషా తమాషా) లోనే ప్రచురించాలి. (ఎందుకు?) అని మాత్రం ప్రశ్నించకండి (మాంత్రికుడు) వచ్చేస్తున్నాడు. ఇంకా (ప్రజలు) చూడాల్సిన పని ఉంది. ఉంటా.

పోనమలి కోటేశ్వరరావు (పటమటలంక)

* * *

"సూర్య చంద్రాదులు అడ్డు వచ్చినా సరే యివాళ నేను ఆగను. పేకాట ఆడి తీరుతాను" అంటున్నాడు భీమారావు.

అప్పడాల కర్రతో ఎదురుగా వచ్చింది భార్య. కిక్కురు మన లేదా పెద్దమనిషి.

హేమాంబరం (కోవెలపాడు)




"విన్నావా? వీళ్ళ నాన్నగారు—మా తాతగారి కాళ్ళు పట్టుకున్నాడుట"!



[ప్రఖ్యాత హాలీవుడ్ తార ఎలిజబెత్ టేలర్‌కి 'క్లియోపాత్రా' సినిమాలో వేషం వేసినందుకు ఇచ్చినంత డబ్బు ఇంతకుముందు ఏ సినిమా తారకీ ఇవ్వలేదని ప్రతీతి. ఈమె వల్ల ఆ చిత్రం నిర్మాణంలో ఎన్నో ఆటంకాలు వచ్చాయి. అంతేకాక ఈమె 'ప్రణయజీవితం' వివరాలు ప్రచారం అయినంతగా మరే సినీమాతార జీవితానికి సంబంధించిన వివరాలూ ప్రచారం అవలేదని కూడ ప్రతీతి. చివరికి ఒక పత్రికా విలేఖరి అన్నాడు: "మారిలిన్ మన్రో అమెరికన్ నేషనల్ సెక్స్ సింబల్ అయితే ఎలిజబెత్ టేలర్ నేషనల్ బోర్!"

క్లియోపాత్రా షూటింగ్ జరిగినప్పుడు ఈజిప్ట్ ప్రభుత్వం పిరమిడ్లను భీమా చేయించిందట!]

లిజ్ టేలర్ 'క్లియోపాత్రా' సినిమాలో నటిస్తున్నప్పుడు ఆమెతోబాటు అదే చిత్రంలో రిచర్డ్ బర్టన్ వేస్తున్నాడు. వారిద్దరూ ఒకరినొకరు ప్రేమించుకున్నారనే పుకారు పుట్టింది. లిజ్ టేలర్ అప్పుడు రోమ్ నగరం పరిసరాలలో వారానికి 300 డాలర్లు అద్దె ఇచ్చి ఒక పెద్ద భవనంలో ఉంటూ ఉండేది. ఆమెతో ఇంటర్వ్యూ సంపాదించాలని ఎందరో విలేఖరులూ, ఫోటోగ్రాఫర్లూ ప్రయత్నించేవారు.

ఒక రోజు ఇంటిముందు ఏభయిమంది ఫోటోగ్రాఫర్లు ఆమెను ఎలాగయినా కలుసుకోవాలని కాచుకు కూర్చుని ఉన్నారు. ఆ సమయంలో ఇంటి వెనక తలుపులో నుంచి నల్లద్దాలు, తెల్ల రెయిన్ కోట్ ధరించిన ఒక అమ్మాయి త్వరత్వరగా బయటికి వచ్చి డ్రయివర్ ఆమెకోసం సిద్ధంగా ఉంచిన తెల్లకాడిలాక్ కారులో ఎక్కి వెళ్ళిపోయింది.

కారు నేరుగా రోమ్ నగరం మధ్య వైపుగా వెళ్ళిపోయింది. 'సిటీ సెంటర్' దక్షిణంగా ఒక చోట ఆగి, రెయిన్‌కోట్ కాలరు ముఖం కప్పేటట్లు పైకి ఎత్తి పట్టి చిన్న సందుల వెంబడి నడుస్తూ వెళ్ళింది. బర్టన్‌ని రహస్యంగా కలుసుకుంటున్నదని ఎవరయినా ఊహించినా ఆశ్చర్యంలేదు.

కాని వారి ఊహ సరి అయి ఉండేది కాదు.

లిజ్ ఒక చిన్న షాపు సమీపించింది. ఆ షాపులో పెంపుడు జంతువులు—పక్షులూ, కుక్కపిల్లలూ వగైరా అమ్ముతారు— షాపు లోపలికి నడిచి వెళ్ళింది. ఆ సమయంలో అక్కడికి వచ్చినవారు ఎవరయినా లోపలి దృశ్యం చూస్తే ఎంతో ఆశ్చర్యపడేవారు.

ప్రపంచంలోకెల్లా పేరు ప్రసిద్ధి పొందిన

క్లియోపాత్రాగా లిజ్ టేలర్.

# రెండు రూపాల మనిషి

రెండు రూపాల మనిషి

సినిమాతార ఒక్కొక్క బోను వద్దకీ వెళ్ళి లోపలి కుక్కపిల్లలను విడిపిస్తూ ఉంటే, అవి ఆమె చుట్టూ మూగి ఒకటే గందరగోళం చేస్తున్నాయి. అంగడి తలుపు ఎవరయినా తెరిస్తే కుక్కపిల్లలు బయటికి పారిపోతాయన్న భయంతో షాపు యజమాని వాటిని తిరిగి వాటి బోనులోపల పెట్టెయ్యటానికి ప్రయత్నించాడు. ఎన్నో విధాల లిజ్ టేలర్‌కి నచ్చచెబుదామని చూశాడు. ఆమె మాత్రం వినిపించుకోలేదు. ఒక్కొక్క కుక్కపిల్లనీ దగ్గరకు తీసుకుని ముద్దాడింది.

ఈ సమయాలలోనే లిజ్ టేలర్ రెండవ స్వరూపం బయట పడుతుంది. ఆమె 'ప్రణయ జీవితం' వార్తాపత్రికలలో ఎక్కినట్లుగా ఆమె స్వభావంలోని ఈ గుణం అసలు బయట పడినట్లే కనిపించదు.

లిజ్ బాగా తెలిసినవాళ్ళు ఆమె ఎప్పుడూ ఇంతే అని చెబుతారు. ఆమె జీవితంలో ప్రవేశించిన పురుషుల కన్నా ఈ కుక్కపిల్లలనే ఎక్కువ ఆదరణతో చూస్తుందంటారు.

'క్లియోపాత్రా' సినిమా తీస్తున్నంత కాలమూ ఆమె రోమ్—భవనం ఒక చిన్న జంతు ప్రదర్శనశాలలాగ ఉండేది. ఒక సెయింట్ బెర్నార్డ్ (పెద్దకుక్క), ఐరిష్ టెరియర్‌లూ, ఒక స్కాటీ, రెండు సయాం పిల్లులూ (వీటిలో ఒకదానికి రిచర్డ్ బర్టన్ అంటే చాలా ఇష్టం!) ఒక పంజరం నిండా పక్షులూ, మూడు కుందేళ్ళూ—ఇంటినిండా కనిపించేవి.

సినెసెత్తా స్టూడియోలలో షూటింగ్ అయిపోయిన తర్వాత లిజ్ రాత్రి ఆలస్యంగా ఇంటికి వచ్చినప్పుడు ఈ కుక్కపిల్లలు ఒకటే గొడవ చేసేవి. సంతోషంగా ఆమె చుట్టూ ఎగురుతూ ఆమెని కింద పడేసేవి కూడా!

"లిజ్‌కి ఏమాత్రం కష్టంగా ఉండేదికాదు," అన్నాడు ఎడ్డీ ఫిషర్ నాతో ఒకసారి, ఇంకా 'మిసెస్ ఎలిజబెత్ టేలర్' గా ఉన్నప్పుడు (ఫిషర్ లిజ్ టేలర్ మాజీ భర్త), "అసలు ఆమె కివంటే చాలా ఇష్టం. ఒక గది నిండా జంతువుల మంచి లిజ్‌ని అక్కడ వదిలితే అన్నీ మర్చిపోతుంది."

లిజ్ టేలర్ జీవితంలో పెంచుకున్న జంతువులన్నీ కలిస్తే ఒక గదిలో పట్టవు—చిన్నపిల్లగా ఉన్నప్పుడు 'మాంటీ' అనే టెరియర్, 'బెట్టీ' అనే గుర్రం, 'నిబ్లెస్' అనే ఉడుత, ఇవికాక ఎన్నో పిల్లులూ, తాబేళ్ళూ, ఒక కోతి ఉండేవి. ఎప్పటికయినా ఒక చిరుతపులిని పెంచాలని అంటూ ఉండేది. జంతువులంటే ఇంత ప్రేమ ఉండటానికి ప్రత్యేక కారణం ఏదయినా ఉంటుందని మనశ్శాస్త్రజ్ఞులు చెబుతారు.

కాని ఎంత పెద్ద మనశ్శాస్త్రజ్ఞుడయినా సినిమాలోకంలోకల్లా అందగత్తె అయిన ఈ అసామాన్య విచిత్ర స్వభావంలో దాగివున్న లోతుల్ని గ్రహించలేడేమో అనిపిస్తుంది. విచారించి చూస్తే ఈ యువతిలో రెండు రూపాలు దాగి ఉన్నాయి.

ఒక రూపం, ప్రఖ్యాత సినిమాతార లిజ్ టేలర్—పన్నెండవ ఏట నుంచీ బాక్సాఫీసు 'హిట్' గా ఉన్న వ్యక్తి. రెండవ రూపం—గారాబంచేత కొంచెం పెంకెతనం అబ్బి, స్థైర్యంలేని ఒక యువతి, ముప్ఫయవ ఏటలో ఇంకే సినిమాతారా ఎరుగని అస్వస్థత, విషాదానుభూతులూ, నాశనం అయిపోయిన వివాహాలూ, గల వ్యక్తి.

బ్రిటిష్ నటుడు పీటర్‌ఫించ్ నాతో ఒకసారి చెప్పాడు: "లిజ్ చాలా మంచి మనిషి. కాని కొన్ని సమయాలలో నిలకడ లేకుండా పోతుంది."

బర్టన్ కూడా — ఇంకా లిజ్‌తో ప్రేమలో పడకముందు — అన్నాడు: "తనెందుకు అంత గొప్పతార అయిందో లిజ్‌నే అడిగి చూడండి, చెప్పలేదు! మొన్ననే అడిగాను, 'చెప్పవోయ్, ఎలా సాధిస్తున్నావో! ఇన్ని రోజులాయ్ నేనూ సినిమా మనిషినే, నాకే తెలియటంలేదు!' అని. నవ్వి ఊరుకుంది. ఆమెకే తెలీదు."

లిజ్ చాలా బోళా మనిషి—ఎప్పుడు ఏది తోస్తే అంత. ఇంకా ఫిషర్‌కీ ఈమెకీ పూర్తిగా చెడిపోకముందు రోమ్ ఫోటోగ్రాఫర్లను ఒకసారి తప్పించుకోవలసి వచ్చింది. అన్ని విషయాలూ క్షుణ్ణంగా చర్చించుకునేందుకూ ఎడ్డీతో కారులో అలా షికారుకి వెళ్ళింది. ఒకచోట ఆగి ఆమె కాడిల్లాక్ కారులోనే కూర్చుని మాట్లాడుకుంటున్నారు. ఇంతలో పక్కనే ఒక పొలం దగ్గరనుంచి సంగీతం వినిపించింది. ఎవరో పాడుతున్నారు. ఈ పాట ఎక్కడినుంచి వస్తోందో తెలుసుకునేవరకూ లిజ్‌కి తృప్తిలేదు. వెళ్ళి శోధించి ఒక వృద్ధ కృషీవలుడు ద్రాక్షపండ్ల రసం తీసేందుకు వాటిమీద తొక్కుతూ తనలో తనే పాడుకోవటం చూసింది.

లిజ్ వెంటనే తన చెప్పులు విప్పేసి, వేసుకున్న లాగు పైకి మడిచి అతనితోబాటే పండ్లను తొక్కుతూ పాడటం ప్రారంభించింది!

లిజ్ టేలర్ ద్వంద్వ స్వభావం బాగా బయటపడింది, టెనెసీ విలియమ్స్ నాటకం 'సడన్‌లీ లాస్ట్ సమ్మర్' సినిమాగా తీస్తున్నప్పుడు. లండన్ దగ్గరే ఉన్న షెప్పర్‌టన్ స్టూడియోస్‌లో షూటింగు జరుగుతోంది. ఇంచుమించు పిచ్చి ఎక్కే స్థితిలో ఉన్న ఒక యువతి పాత్ర ధరిస్తోంది లిజ్ టేలర్. ఒక సీనులో వెర్రికేకలు పెట్టి చివరకు నేలమీదకు కుప్పగా కూలిపోయేట్లు అభినయించవలసి వచ్చింది.

సెట్ మీదకు 'గమ్' నములుతూ వచ్చింది. డైరక్టర్ జోసెఫ్ మాంకియవిచ్ పిలవగానే 'గమ్'ని బుగ్గనే ఉంచి, అంతవరకూ నెమ్మదిగా, నవ్వుతూ ఉన్న యువతి కాస్తా పిచ్చిగా అరుస్తూ పడిపోయే ఉన్మాదినిగా మారిపోయింది. తిరిగి కెమెరా ఆగిపోగానే, ప్రశాంతంగా 'గమ్' నములుతూ అవతలికి వెళ్ళిపోయింది.

"విషయం కొళాయి తెరిచి మూసినంత సులభంగా చేస్తుంది," అన్నాడొక కెమెరామాన్. "నాకే ఆశ్చర్యంవేస్తుంది!"

ఒక వారం తర్వాత మరొక షూటింగ్ జరిగింది. ఈసారి లిజ్ ఎందుకో నిలకడగా లేదు. సెట్‌మీదకి వచ్చినప్పటినుంచీ చిటపటలాడుతూనే ఉంది. మాంకివిచ్ 'ఏక్షన్' అని పిలవగానే లిజ్ మళ్ళీ పిచ్చిదానిగా నటించింది.

సీను పూర్తి అయింది. "కట్", అన్నాడు మాంకియవిచ్. లిజ్‌తోబాటే నటిస్తున్న మాంట్‌గమరీక్లిఫ్ట్ పక్కగా నడచి వెళ్ళిపోయాడు. లిజ్ కదలలేదు.

చుట్టూ ఉన్నవారందరూ ఆశ్చర్యంతో ఆమె వంక చూశారు. ఇంకా, అక్కడే స్టూడియో నేల మీదనే పడి వెక్కివెక్కి ఏడుస్తోంది! ఆమెను



ఎలిజబెత్ టేలర్

మామూలు స్థితికి తీసుకురావటానికి పది నిముషాలు పట్టింది.

'సడన్‌లీ లాస్ట్ సమ్మర్' నిర్మిస్తున్న కాలం ఆమె జీవితంలో సంతోషంగా ఉండగలిగినవాటిలో ఒకటేమో! అంతకుముందే ఆమె మూడవ భర్త మైక్‌టాడ్ మరణించాడు. ఎడ్డీఫిషర్— డెబ్బీ రెయినాల్డ్స్ వివాహం చెడిపోయి ఫిషర్ టేలర్‌ల జంట ఏర్పడింది. షెపర్‌టన్ స్టూడియోలో తిరుగుతూ తనలో తనే 'ఎడ్డీ ఈజ్ ది మాన్ ఆఫ్ మై లవ్' అని పాడుకుంటూ ఉండేది.

45-వ పేజీ చూడండి

# అవీ - ఇవీ - అన్నీ

ఉత్తరాది నుంచి విపరీతంగా వినవస్తున్న వార్తల్లో రక్షణనిధికి తారలు చేస్తున్న ప్రకటనలు ఎక్కువగా ఉంటున్నాయి ఇందులో కొన్ని చిత్రంగాను, కొన్ని ఆశ్చర్యంగానూ ఉన్నా ఒక మంచి పనికి చేసే త్యాగం గనుక—అందులోనూ తారలు చేస్తున్నారు గనుక మనం కొంచెం యెక్కువగానే హర్షించాలి అయితే దక్షిణాదిన తారలకు యింత తీరిక ఉన్నట్లు లేదు. తీరికలేదూ అంటే పిల్లు వాళ్ళలా విధులు విరాళాలు యివ్వలేదనికాదు మన ఉద్దేశం పోతే, ఉత్తరాది తారలు యీమధ్య మరీ రాజకీయంగా సాంఘికంగా ఉపన్యాసాలు, వ్యాసాలూ, ఉద్యమాలూ 'షీట్'లా గట్రాచేస్తున్నారు అందుకు కారణాలు ఏమైనా దక్షిణాది తారలు యిలాంటివి చేయడం లేదు కారణం బొంబాయి వాతావరణం కాదు మద్రాసు వాతావరణం ఐతే యీమధ్య మద్రాసులో తారలుకూడా 'హాకీ' ఆడారు ఆడిన దేమైనావరే వారు దాన్ని 'హాకీ' అన్నారు 'హాకీ' అయినా క్రికెట్ అయినా వరే మొదటిది వారు రక్షణనిధికోసం ఆడుతున్నారుగనుక, రెండోది వాళ్ళు తారలు గనుక బాగానే చెల్లింది ఈ హాకీఆట సుమారు 17000 రూ ఆర్జించింది రెండు పక్షాలుగా విడిపోయిన తారా సమూహంలో రెండు జట్లకూ శివాజీ, జెమినీ గణేశన్‌లు (?) నాయకత్వం వహించారు సర్దాగా కొన్ని నిముషాలు గడిచిపోయాయి ముఖ్యంగా చెప్పొచ్చేది ఏమిటీ అంటే యిది మంచి పనికోసరం చేశారనీ, 'ఫార్సు'గా పరిణమించినా ప్రజలు సహించారని మాత్రమే బొత్తిగా 22 నిముషాలు మాత్రమే 'తారలు' యీ హాకీ లాంటిదాన్ని ఆడారూ అంటే అందుక్కారణం అది క్రికెట్ కాకపోవడం ఒకటే, రెండూ: ఆటగత్తెలంతా పట్టుచీరెలు ధరించి (హాకీ గ్రౌండు చాలాపెద్దదిగా) రావడ మొకటి. అయితేనేం సినిమాతారలు తల్చుకుంటే ఏమయినా చేస్తారనిపించారట!

*　　*　　*

సాధన (లవ్ ఇన్ సిమ్లా) అనే హిందీతార జవాన్లకు సంతోషిన్ని యివ్వడానికి ఎవరే సిన్మా తీస్తున్నా ఉచితంగా నటిస్తానని చెప్పింది బహుశా వైజయంతిమాల ఆ మధ్య తానే స్వయంగా వెళ్ళితే జవాన్‌లను సంతోషపర్చడానికి అక్కడ నృత్య ప్రదర్శన లిస్తానన్నది, పాఠకులు తెలుసుకునే ఉంటారు పైగా బొంబాయి తారలంతా బ్రహ్మాండమైన ఊరేగింపు చేద్దామని తక్షణం చేసిన ఉదంతం ఎరుగుదుము మనం కాని మద్రాస్ తారలు మాత్రం చేద్దామనుకుని తక్షణం ఆ ప్రయత్నం మానేశారు కారణం యిక్కడ కాల్‌షీట్ల రద్దీ



అన్నపూర్ణావారి 9 వ చిత్రంలో బి. సరోజ.

కాబోలు హితే రాజ్‌కపూర్, దిలీప్‌కుమార్, జి పి సిప్పీ, ప్రభృతులంతా శ్రీ గోపాలరెడ్డిని కలిసి జవాన్లను సంతోషపరచడానికి తాము నేఫా ప్రాంతాలకు వెళ్తామని సంసిద్ధత తెలిపారు అలాగే భారతసేవక్ సమాజ్ శాఖ ఆధ్వర్యాన వైజయంతిమాల టాగోర్ 'ఛండాలిక' (సంగీత నృత్యం)ను ఢిల్లీలో జనవరి 26వ తేదీన రక్షణనిధి నిమిత్తం వేస్తుందని వాళ్ళు చెప్పారు ఈ సంగీతనృత్యాన్నే వైజయంతిమాల ఆమధ్య బొంబాయిలో బిర్లా మందిరంలో రాష్ట్రపతి శ్రీ రాధాకృష్ణ సమక్షాన ప్రదర్శించిందికూడా అయితే మద్రాసులోనూ యిలాంటివి జరుగుతూ ఉంటాయి గాని యిక్కడి పద్ధతివేరు ఈ మధ్య దేశ వ్యాప్తంగా వచ్చిన చైతన్యంలో తారలు చూపిన ఉత్సాహం అక్కడా యిక్కడావుంది

అయితే యిక్కడ ప్రచారయుక్తమైన ధోరణి తక్కువగా ఉంది బొంబాయిలో యిటు విరాళమూ యిచ్చారు, అటు పబ్లిసిటీ పొందగలిగారు ఇందుకు కారణం అక్కడి తారల ఉత్సాహమనీ ఐకమత్యమనీ, సరదా అనీ యిలా మనం రకరకాలుగా అనుకోవచ్చును

* * *

ఇదంతా వో మంచి పనికోసరం మంచిపనిచేయడం సంగతి ఐతే వో మంచిసు పేరిట కొందరు వెధ్వపనులుచేస్తారు ఏది వెధ్వఅంటే ఎవరూ జవాబు చెప్పలేరనుకోండి అయితే 'దేవుడా—ప్రేమ—' అనేపేరు మంచిదనిమాత్రం ఒప్పుకుంటాంగా అలాగే లైలా మజ్నూల కథా పాతదేగా ఐతే ఈ రెంటిని ఎక్స్ప్లాయిట్ చేయడంలోనే వుంది బిజినెస్సు పాఠకులకు కాస్త ఆలస్యంగా అందినాసరే యీవార్తమాత్రం చెప్పదగ్గదేమరి 'నిమ్మీ' ('బర్సాత్' నాటితార) నగ్నస్నాన నృత్యమొకటి కె ఆసిఫ్ (మొగలే ఆజామ్ నిర్మాత) అద్భుతంగాతీసి దాన్ని సెన్సారువాళ్ళు కత్తిరించకుండాను, ప్రజలు విరగబడి చూసేలాగా చేస్తానన్నాడు ఈ ప్రఖ్యాత నిర్మాత అన్నంతపనీ చేస్తాడు వెనకటికి 'మొగలే ఆజామ్' కథను బ్రహ్మాండంగా తీసి ఆనక ఎందుకో నాలిక్కర్చుకుని విషాదాంతంగాదని సుఖాంతం చేశాడని అనుకున్నారు నేను విషాదాంతమే చూశాననుకోండి అంచేత త్వరలో నిమ్మీని నగ్నస్నాన దృశ్యంతో (దేవుడా— ప్రేమా) అనే సిన్మాలో ప్రజలు చూస్తారు అనుకోవచ్చును యీ 'సీను'కు మరో ఆకర్షణ 'నౌషద్' (సన్ ఆఫ్ యిండియా) చేసిన పాటకూడాను ఈ కే ఆసిఫ్' ప్రస్తుతం మొగలే ఆజామ్‌ను యింగిలీషులోకి 'డబ్' చేసుకోవాలని ప్రయత్నిస్తున్నాడు



లలితా శివజ్యోతి వారి "లవకుశ"లో అంజలీదేవి

అన్నట్టు సావిత్రి గణేశ్ (తెనుగు సంసారం జ్ఞాపకం వుందిగా) యిప్పుడు దక్షిణాదిగ్విజయయాత్ర పూర్తి చేసుకుంది గనుక, నిర్మాతల బహుకాల వాంఛ నెరవేర్చి బొంబాయిఫీల్డు ఏ లాలాని వెళ్ళిందని విన్నాము. అందులోకి మీనాకుమారి నటించాల్సిన చిత్రంలో ఆమెస్థానే సావిత్రి నటించబోతున్నది. తథాస్తు. సావిత్రిదగ్గర పరిణతిపొందినట్టి నిగ్రహంతో కూడిన నటనాశక్తి వున్నది. అదే ఆమెకు ఏ భాషలోనైనా శ్రీరామరక్ష.

* * *

మరో మాటగా 'ఆల్ రౌండర్' భానుమతి 'అన్నైన్' (అరవంలో) అనే దక్షిణాది చిత్రంతో తిరిగి మరోసారి తారపథారాణించే సూచన లున్నాయని ప్రాజ్ఞలంటున్నారు. ఆమె ఇప్పుడు అనుపమావారు తీస్తున్న తెనుగుసినిమాలో నటించడమే గాకుండా పాటలుకూడా పాడుతున్నది. పరిణతికి మరోపేరు అయిన భానుమతి పునర్దర్శనం (బాటసారిని మరిచిపోలేదుగా మనం) ఆమె 'ఫాన్స్'కి కనులపండువు కాగలదని మన అంచనా. మన దాకా అసలు పేరురాలేదు గాని వోల్గా ప్రొడక్షన్సు వారి నెం 1 చిత్రం పూర్తైందని అంటున్నారు. 'కృష్ణార్జున యుద్ధం' 'ఇరుగుపొరుగు' దేశంమీదకు రానున్న యీ తరుణంలో హిందీ నుంచి తెచ్చిన మహాభారతంకూడా దేశంమీదకు

23-పేజీ చూడండి



వినీ చిత్రావారి "సవతి కొడుకు"లో రామారావు, జానకి




"ఏమిటీ ! అప్పారావు పోయాడా ?" అని ఆశ్చర్యంగా ఒకేసారి అడిగారు, రచ్చబండమీద కూర్చుని, తీరిగ్గా కబుర్లు చెప్పుకుంటున్న పెద్ద మనుషులు ఏడెనిమిదిమంది. "అవును పోయాడు" అని మళ్ళీ అన్నాడు ఆ వార్త తెచ్చిన మనిషి.

"అయ్యో ! పాపం ! జబ్బేమిటి ఇంత హఠాత్తుగా పోవటానికి? రాత్రికూడ బాగానే ఉన్నాడే ! ప్చ్! పాపం! ఏ మాట కా మాట అనుకోవాలి గాని ఆతని బుద్ధి చాల మంచిదండి !" అంటున్నాడు ఒకాయన.

"మంచి భక్తుడుగా మారాడయ్యా ! పుణ్యం చేసుకున్నాడు కాని ఆ గుడి తతంగం ఏదో పూర్తి చేసినట్లయితే అతని పేరు చిరకాలం ఉండేది !" అంటున్నాడు మరొక పెద్దమనిషి

అప్పారావు చేష్టలన్నీ ఎంతగానో ఒకదాని కింకొటి కల్పించి చెప్పుకుంటున్నారు తలా ఒక రకంగా మాట్లాడుతున్నారు. అందరూ మెచ్చుకునేవారే !

అందరి మాటలు విని ఆ వార్త తెచ్చిన మనిషి ఒక్కసారిగా పొట్టచెక్కలయ్యేటట్లు నవ్వుతున్నాడు.

అక్కడున్న మిగతావారికి చిర్రెత్తుకొచ్చింది. "ఎందుకయ్యా ! అట్లా నవ్వుతావ్ ? అప్పారావంత మంచివాడు పోతే విచారించాల్సింది పోయి నవ్వుతావేంటి ? చాలు ! వాళ్ళే ! ఎవరన్నా నవ్విపోతారు. ఇక ఆపు సదండి! ఒకసారి వెళ్ళి చూచి రాకపోతే బావుండదు "అంటూ ఒక పెద్దమనిషి తుండు దులిపి భుజాన వేసుకున్నాడు.

అప్పారావు పోయాడన్న వార్త తెచ్చిన మనిషి

—42వ పేజీ చూడండి

# అవీ - ఇవీ - అన్నీ

21 వ పేజీ తరువాయి

...పోతుందని వినికిడి ఇదిలా వుండగా ... 'లక్షాధికారి' ఒపేషి(రం) (రవీంద్ర ఆర్ట్సు) మొదలెట్టారనీ తెలిసింది పోతే కులగోత్రాలు వి ఏ పి మరో సినిమా తీద్దామనుకుంటున్నారని వివరాలు తెలిసిన వార్త ఒకటి వచ్చింది "కలిసివచ్చిన కాలం" అనే చిత్రమొకటి మంచి తారాగణంతో యువరాజ ప్రొడక్షన్స్‌వారు నిర్మిస్తున్నారని అంటున్నారు

* * *

స్టూడియోల చుట్టూ తారల్లైపోదామని తారాడే అబ్బాయిలను అమ్మాయిలనూ వీరగుడుములుగాని త్రాచుపాములకుకూడా యీ తారపథంమీద మోజు వుంటుందని మనం అనుకోము అయితేనే

ఓ నాగరాజు ఆ మధ్య విజయా స్టూడియోలోకి యిలాగే జొరబడి మొదట తిరస్కారం పొందాడు పామును పాములవాడు కోరలు—పీకేసి పట్టుకుపోయాక ఆర్—ఆర్— నిర్మాతలు మాకో సర్పతార కావాలన్నారుట దాంతో కోరలుపోతేనేం ఆ పాము తారైపోయింది ఈ నెల జాబితాలో వున్న చిత్రాల్లో మరో పేరు ఎదురీత వినవస్తోంది ఇరుగుపొరుగు (రివ్యూ దిగువ) వుండిగా ★

ఇరుగైన సి. ఎస్. ఆర్. పొరుగైన రేలంగి.

చిత్రసమీక్ష

## తారాబల[గ]ం పుష్టిగా గల చిత్రం "ఇరుగు పొరుగు"

నిర్మాణం కళాప్రపూర్ణా థియేటర్స్ దర్శకత్వం ఐ ఎస్ మూర్తి (బెంగాలీ కథ) మాటలు కొండేపూడి పాటలు ఆరుద్ర కొసరాజు సంగీతం వేణు నటీనటులు రామారావు రేలంగి, కృష్ణకుమారి, సంధ్య, సి ఎస్ ఆర్, గుమ్మడి, జానకి నిర్మల నాగయ్య, బాలయ్య, గిరిజ, అల్లు రామలింగయ్య బాలకృష్ణ మొదలగువారు

బెంగాలీలో మంచి కథలు, తెలుగులో మంచి ...టులూ ఉన్నారని అనిపిస్తుంది 'ఇరుగుపొరుగు' సినిమాను చూస్తుంటే అయ్యయ్యో ఇంతా తారాబలం మోతాదు మించిపోయి 'కథ'ను ఖూంచేసేశారే అనిపిస్తుంది కూడా అయినా ఈ మోతాదు మించినందువల్ల ఒనం పొందగలిగేదీ, సంతోషమే గనుక ఇరుగు పొరుగు సినిమా అందరికీ నచ్చుతుంది ఈమధ్య తారాపటాలంగల చిత్రాలకూ ఈ ఇరుగు పొరుగుకూ ఉన్న తేడా ఒకటిఉంది ఈ చిత్రంలో నటులంతా హేమాహేమీలు అయినా, ఒక "టీము" గా, సర్వా బరువుగా గాగా, సందర్భోచితంగా నటించడం నటులందరికీ నిర్మాతలు కృతజ్ఞత ఎందవల్సివుంటే, పాటలు రాసిన వాళ్ళకి, వాటికి రాగా బాణీ వేసినతనికి (ఒరిజినల్ అవునా? అనకండి) అవి శ్రావ్యంగా, కమ్మగా పాడినవాళ్లకీ కూడా తప్పకుండా అది అందాలి "వేణు" సంగీతం నేపథ్యసైతం బాగుంది

'ఇరుగు'న ఒక పరువంలోని అందాలభామ (కృష్ణకుమారి) 'పొరుగు'న (హైటూ, వైటూ ఆరడుగుల పర్సనాలిటీవున్న అబ్బాయివుంటే కథ "వారెవ్వా జో కుహై" అని సాగుతుంది దానికితోడుగా రిటైర్డ్ గవర్నమెంట్ ఆఫీసరుగా (కేరక్టర్ ఫిటింగ్) రేలంగీ, అతని రెండో భార్యగా సంధ్య (రిటైర్డ్ చిలకా గోర్వంకా) వుంటే చిత్రం మజాగా సాగిపోతుందనీ, అలాంటి పట్టుపగ్గాలులేని క్లైమాక్స్‌తో కథ దాటిపోకుండా సి. ఎస్. ఆర్. (డిటెక్టివ్) కరుణామయ్యగా వీళ్లను నిలబెట్టిన తీరు ప్రేక్షకులను ముగ్ధులను చేస్తుంది అయితే చిత్రం పోను పోను నిర్మాతల కళ్లేలకు చిక్కని పెంకెగుర్రంలా పోతుంది చివర పతాక సన్నివేశాల్ని హడావుడిగా వచ్చేస్తాయి. అయితేనేం ఈలోగా ప్రేక్షకుడికి కావల్సినంత వినోదం కిడుతుంది

అనగనగా ఒక "రేసు"ల విశ్వనాథం గారు (గుమ్మడి) గుర్రాలు సరిగ్గా పరిగెత్తి తిరిగి వస్తూ, దోవలో తాగి, కారుకిందపడటంవల్ల అతని పిల్లలిద్దరకూ (పెరిగిన తర్వాత బాలయ్య, కృష్ణకుమారి) దూరమవుతాడు కూతురు 'జిక్కి' అల్లా చిత్రయ్య (సి. ఎస్. ఆర్. నిర్మలలయింట) కృష్ణకుమారిగా అందంగా పెరుగుతుంది. ఆనక పొరుగున ఇంటిగలవాళ్లబ్బాయి ప్రేమలోపడి పొరపడ్డాననుకుని, చివరకు ఒక నాటకం స్టేజీమీద తిరిగి, ఆ అబ్బాయినే పెళ్ళి చేసుకుంటుంది. ఈ కథలో ఇంకా చాలా ఇతర పాత్రలు 'గిరిజా', 'నాగయ్యా' మున్నగువారంతా వస్తారు. పైగా జానకి చేసిన ఒక నాట్యం ('కలలో కలుసుకో'), ఇ. వి. సరోజా (జానపదమే హోయీ) నృత్యం ప్రత్యేకతలైతే, ఎల్. విజయలక్ష్మి 'కాళ్లలో ఎలక్ట్రిసిటీ' చేసిన డ్యాన్సు 'హైలైట్'.

ఆరుద్రకూ, కొసరాజుకూ ప్రత్యేకాభినందనలు. రేలంగికీ, సంధ్యకీ, సి. ఎస్. ఆర్.కూ స్పెషల్ కాంప్లిమెంట్సు వెళ్ళాలి. కృష్ణకుమారి, రామారావులు చలాకీగాఉంటే బాలయ్య గిరిజా పాత్రత పెరిగి నటించారు. చాలా విధాల బాగున్న ఈ చిత్రం క్లైమాక్సు భీభత్సంగానూ, ఐ. ఎస్. మూర్తి దర్శకత్వం అక్కడక్కడ బలహీనంగానూ ఉన్నా జనరంజకం కావచ్చును.

—పి. కృష్ణానంద్.

డ్యాన్సు హైలైట్‌గా విజయలక్ష్మి



అన్నపూర్ణ వారి కొత్త చిత్రంలో సావిత్రి, నాగేశ్వరరావు

తెనుగు సినీమాలోకంలో-4

# నటుల స్థాయినంద గల కథలు కావాలి!

కథను కుణ్ణంగా పరిశీలించి, అందులోని పాత్రా దాని 'పాత్రతా' నెరిగి స్వభావసిద్ధమైన, సందర్భోచితమైన సన్నివేశాలు కూర్చి ఒక నిర్దుష్టమైన మార్గంలో ఒక సినిమాను తయారు చెయ్యాలి అంటే, ఇందుకు అవసరమైన శిక్షణ వేరు. తెనుగు సినిమాలు వాస్తవికత గురించి ఆలోచించడం, సందేశం గురించి బెంగపెట్టడం ఇత్యాదులు చేస్తే ఆ నిర్మాతకు చివరకు మిగిలేది, అతని రాలకు విలువ మాత్రమే చేసే విమర్శకుల తాకిడులు తప్ప మరేమీ మిగలవు అన్న 'సామెత' ఒకటి ఉంది ఇందులో కొంత నిజముంది కొంత లేదు

[ దిగువ ]

"కృష్ణార్జున యుద్ధం"లో మిక్కిలినేని, సరోజాదేవి, రామారావు



## రెండూ కలిసే మార్గాలు లేవా?

సినిమాలు "ఎక్స్‌ప్లాయిటేషను" మానేసి తియ్యడం వ్యాపారం అనిపించుకోదు. వ్యాపార దృష్ట్యా గాకపోతే సినిమా ఎందుకు తియ్యడం ? వేరే పనేమేనా చేయొచ్చును. అయితే వ్యాపారమూ కళా వ్యవహారమూ రెండూ కలిసే మార్గాలేవీ అస్సలు లేవా ? 'సినిమా' అనేది ఉదాత్తంగా ఉండగల సావకాశాలు అస్సలు లేవా ? ముఖ్యంగా తెనుగు సినిమాలు మరొక మెట్టు పైకి పోగల అవకాశాలు లేవా ? ఇన్ని ప్రశ్నలున్నాయి.

### ఇదీ కారణమే !

తెనుగు సినిమాలమీద కేవలం తమిళ కథల ఆధిపత్యం ఉంది అంటే అందుకు కారణం తెనుగు సినిమా కాపురం పరాయి చోటైన మద్రాసులో ! మద్రాసు తెనుగు దేశానికి దూరమైపోయింది. 'మద్రాసు' 'మద్రాసు' లాగే కేవలం 'మెట్రొ పాలిస్' గా వృద్ధి పొందుదామనుకుంటున్న ఒరవడితో తెనుగు నిర్మాత మొదలు తెనుగు ఎక్స్ట్రా వరకూ యిక్కడ "బ్రతుకూ", "బ్రతుకు తెరువూ", యితరత్రా అనువైన "తెరువూ" కూడా ఏర్పరుచుకున్నారు. తెనుగు 'ఇన్‌ఫ్లూయన్సు' యిక్కడ రాకపోగా, "అరవ ధామ్సులు" ఎక్కువగా రాగల అవకాశా లున్నాయి. ఉభయత్రా తెలుగూ కమ్ తమిళ్ గా "చిత్రాలు", వేషాలూ ఉంటే, యివి పరిశ్రమలో నాలుగు రాళ్లు అర్జనకు గట్టి పోషణాలు.

### తమిళ్ మార్కెట్ పెద్దది !

ఐతే కేవలం 'తెనుగు' సినిమాకేనా రాష్ట్రం తరవాతం, హిందీ బయస్కోపుకు 'బొంబాయి' సొంత యిల్లా? అని అడిగేవా రున్నారు. హిందీ చిత్రాల మార్కెట్, దాని అవధులూ, అవకాశాలూ, అది ఇతర భాషా రాష్ట్రాలలో చెలాయించే జోరూ యివన్నీ వేరు. పైగా 'బొంబాయి' లో హిందీ బయస్కోపుమీద ఒక ఇన్‌ఫ్లూయన్సు చేయడం దాకా ఎందుకు ? ఆ ప్రక్కని "పెట్ట పోరుగు ఓర్వదూ" అన్నట్లు మరో భాషారంగం నిలబడలేదే ! .... మద్రాస్‌లో "తెనుగుతారను" ఆ స్థాయికి రాకుండానే 'తమిళ తెర' తీసుకోడమో, లేక త్రోసిరాజనడమో అగుపిస్తోంది అదో బెంగ.

"ఐతే "ఫిల్ము" ను ఎత్తుకుపోగలమా ? ఎక్కడ పెడతాం ? అనొచ్చు. ఈ ప్రశ్నకు సమాధానం అంత తేలికగా దొరకదు. అసలు యీ ప్రశ్న ఇప్పట్లో ప్రమాదకరంగా అగుపించడమే లేదు. ఎంచేతనంటే మద్రాసు కథల బయస్కోపులన్నీ సూత్రోజాలు ఆడి మరీ వస్తున్నాయి తెనుగు దేశంలో.

ఐతే ఏమిటి నష్టంగా వుందని అని మనం విసుక్కుంటూ మనుకోండి. ఏమీలేదు. తెనుగువాడు "తగువులాట" లకూ, తెనుగుదేశం గోంగూర, దోసకాయ పచ్చళ్లకూ మించి మరెందుకూ ప్రశస్తికి ఎక్కదా ? అనిపిస్తోంది.

'అఖిలభారత స్థాయి' లాంటి పెద్ద కోర్కెలు కలగడం చిన్న నిర్మాతల కేమో గాని, పెద్ద నిర్మాతలకు మంచిదే ననిపిస్తుంది. గృహచ్ఛిద్రాలు వినా యితరమైన కథావస్తువులు లేవా ?



పద్మినీ పిక్చర్స్ "పెంపుడు కూతురు"లో హరనాథ్, దేవిక.



వోల్గా ప్రొడక్షన్స్ నెం. 1 లో రామారావు, అంజలీదేవి.

పెంపుడు కూతురులో రేలంగి

# తెనుగు సినిమాలోకం

## మధ్యలో బొంబాయి ప్రసక్తి

బొంబాయి సినిమాల్లో అబ్బాయీ, అమ్మాయి కలిసి 'కాశ్మీరు' మొదలు 'సిమ్లా' దాకా చెట్ల తిరగడం కథావస్తువైతే మనకు సంసారంలో కుట్రలూ, మెలో డ్రామాలు మాత్రమేనా కథలు?

తెనుగుదేశం చరిత్రలో తెర కెక్కగల వస్తువు లేదా? 'విజయనగర సామ్రాజ్యం' గురించి ఒక్కటో రెండో సినిమాలు వచ్చాయి కాని, యిలాంటివి ఇంకా రావొచ్చునుగా! చరిత్రను వదిలేయండి. వర్తమానాన్ని తీసుకోండి — అనగనగా ఒక తెనుగు యిల్లు. ఆ యింటి వ్యక్తులలో దేశంలో కొత్తగా పదిహేనేళ్ళ క్రితం వచ్చిన స్వతంత్రం గురించి జిజ్ఞాస కలిగే సన్నివేశాలూ—అందులో వృత్తి విద్య అక్షరాస్యతల ఆవశ్యకత, దేశంలో కుంటుపడిన దేశభక్తి అంటే, ప్రతీ యిల్లు ఒక మంచి కుటుంబమైతే దేశం కూడా మంచిదవుతుందీ లాంటి సందేశం గల కథ —

ఈ కథతో డాక్యుమెంటరీ తప్ప తియ్యలేమూ అనుకుంటే మన "కళ" ఇంకా చాలా పెరగాల్సిందే ఉన్నమాట ఒప్పుకోవాలి ఫ్యాక్టరీలు, తగాదాలు యివి 'ఎక్స్‌ప్లాయిట్' చేయకండి, వర్గ వైషమ్యాల నాలంబనగా "ఎస్కేపిజం" తీసుకోకండి—అని ఒక పనిని పనే నీతికోసం సినిమా లెవరా తీస్తారా అంటారా? సరి ప్రతి సినిమాలోనూ యిప్పుడు మాత్రం చివర నీతి సందేశం, సమైక్యతా నినాదం, గ్రూపు ఫోటో యిత్యాదులు పెట్టడంలేదా? ఈనీతి కథలు (నీతి బీరకాయలు) చూసే జనం అవి చూడరా?

## కొత్త అంటే ఏమిటి?

పౌరాణిక యుగపు త్యాగాలూ, పాతకాలంనాటి ప్రతిజ్ఞలు, ఆదర్శాలతో, వర్తమానం దుస్తులు ధరించిన పాత్రలకంటె యిప్పటి సాంఘిక జీవితంలో ఉన్న పాత్ర చిత్రణ, రూపకల్పనా అవసరం ఎంతైనా ఉంది

"నవరసభరితమైన చిత్రాలు" అనే మాట రానురాను అలవాటై పోతోంది ఎంతో గంభీరమైన సమస్యను చిత్రీకరిస్తూ ఆ చిత్రంలో ఏమాత్రమూ అతకని హాస్య బీభత్స రసాలను జొప్పించడం, అలాగే హాస్యరస భరితమైన చిత్రాల్లో తప్పనిసరిగా రెండు బ్యాక్‌గ్రౌండు శోకాలైనా ఉంచడం ఆనవాయితీగా ఉంటోంది

## అసలు కన్న హాస్యం మిన్న

దీనివల్ల చిత్రంలో మూల వస్తువు మరుగున పడి, నీళ్ళు గారిపోతుంది ఏ తత్వానైనా సరే భూతద్దాల్లో చూసిన తీరుగా తెనుగు సినిమాలు నిర్మిస్తున్నాయి ఉదాహరణకి ఒక అత్తగారు కోడల్ని, ఒక ధనవంతుడు పేదవాళ్ళని హింసించే తీరూ, విపరీత మనిపించేటంత మేరకూ చూపడం తెనుగు బయస్కోపుకు సహజదోషమై పోయింది— తెనుగులో మంచి చిత్రాలు చేసేవారెవరూ అనరు కాని, వీటిలో మంచి మింగేసే మైనాలనీ" ఉంటున్నది ఇది మారాలి

డాక్యుమెంటరీలకు పనికివచ్చే కథావస్తువులు 'సత్యజిత్' లకు పనికొస్తాయి గని, మనకి పనికి రావు? పైగా ఇప్పి బెంగాలీ చిత్రాల ఇన్‌ఫ్లూయన్సు ఉండి, ఒక 'సత్యజిత్‌రాయ్' దేశా పెద్ద ప్రభావం? విపరీతమైన ఎంటర్టైన్‌మెంటు ఉంటే కేవా చిత్ర విజయానికి దోహదం?

సన్నివేశంలో పాత్ర వైజం, పాత్ర స్వభావంలో యధార్థ తత్వం ప్రతిబింబింపజేయగలగడం తెనుగు చిత్రసీమకు కొత్తేమైనదేం కాదు ప్రధాన పాత్రల నటుంచి ఉపపాత్రదారులలో భారత స్థాయినే కాదని నటించగల దిట్టలు ఉన్నారు. ఎటొచ్చి ధైర్యే సాహసే లక్ష్మీ అన్న సూక్తి అర్థం కాకపోడమే శోచనీయం అయినా ఆశిద్దాం!

శుభమ్! —ఎ కృష్ణానంద్ ★

అనుపమావారి "ఈడూ—జోడూ"లో మణిమాల, చలం.

# శ్రీదేవి

**రంగధామ**



### జ రి గి న క థ

దుర్గాప్రసాద్, విశ్వేశ్వరరావు కుమారుడు; భార్య అనసూయమ్మను హింసిస్తూ ఉంటాడు. దుర్గాప్రసాద్ కుమార్తె శ్రీదేవి జగన్నాథం వద్ద సంగీతం నేర్చుకుంటూ ఉంటుంది. సంపన్న కుటుంబీకుడే అయినా దుర్గాప్రసాద్ పిల్లలను, భార్యను ఉపేక్షించి, త్రాగుడూ, స్త్రీలోలతలకు అలవడతాడు. ఒకనాడు అనసూయమ్మను పొడిచి గాయంచేసి వెళ్ళిపోతాడు. గాయం మానాక, విశ్వేశ్వరావుగారి విధవప్ప చెల్లెలు; సుభద్రమ్మ అనే ఆమెను శ్రీదేవికి అత్తయ్య అని పరిచయం చేసింది. ఆమె భర్త చనిపోయి రెండు నెలలైంది ఆర్యాపురంలో ఆమెకు యిల్లువుంది అక్కడ శ్రీదేవికి ఆమె మరిది వేణుతో పరిచయమై, అతనంటే ఆకర్షణ ఏర్పడుతుంది. శ్రీదేవికి, శ్యామల, సావిత్రి అనేవారు ఆత్మీయులౌతారు.

... ...

## 4

రెండురోజుల తరువాత ఒకనాడు సుభద్రమ్మ వచ్చి జయమ్మ దగ్గర చాలాసేపు కూర్చొని తన భూముల సంగతులు మాట్లాడసాగింది. జయమ్మ వాటి గురించి తనకు తోచిన సలహాలిచ్చిన తరువాత తనకూ, అనసూయమ్మకూ జరిగిన పోట్లాటంతా చెప్పింది. అది విని సుభద్రమ్మ చాలా విచారించింది. జయమ్మ మీద చాలా సానుభూతి చూపించింది. అనసూయమ్మ మీద అక్కసుకొద్దీ జయమ్మ, దుర్గాప్రసాద్‌కు గల వ్యసనాల గురించీ, అతని చెడు నడత గురించీ కూడా ఒక్క విషయం దాచకుండా చెప్పేసింది. సుభద్రమ్మ అంతకుపూర్వమే ఈ సంగతుల్ని చాలా వరకూ ఊహించుకోగలిగింది గాని, అవాళ అధికార వార్తగా తనకు జయమ్మ ఈ విషయం చెప్పడంతో తనకు కూడా ఆ కుటుంబంలో ఒక స్థానమిచ్చి జయమ్మ మాట్లాడుతోందని తెలుసుకుంది. తను జయమ్మతో అన్నివిధాలా ఏకీభవిస్తున్నట్లు జయమ్మకు వెంటనే తెలియజేసింది. అనసూయమ్మంటే తనకేనాడూ సానుభూతి లేదంది.

జయమ్మయొక్క అనేక ఆరోపణలలో 'శ్రీదేవిని అనసూయమ్మ సరిగా పెంచలేకపోయిందని కూడా చేర్చింది. సుభద్రమ్మ ఉద్దేశం కూడా అదే. జయమ్మ ఇకనుంచీ శ్రీదేవి బాధ్యతను సుభద్రమ్మ కప్పజెప్ప దల్చింది. రేపు ఒక పెద్ద కలక్టరే శ్రీదేవి భర్త అయితే శ్రీదేవికి బొత్తిగా ప్రపంచజ్ఞానం లేదనీ, నలుగురిలో తిరగడం చాతకాదనీ అనడూ? నలుగురూ అప్పుడు తల్లినీ, అమ్మమ్మనీ తిట్టిపోస్తారు. తమకు తెలియకపోతే ప్రయివేటు మాస్టర్లని పెట్టి చెప్పించరాదా? అంటారు. అనవసరంగా తను అపవాదులపాలు కాదల్చుకోలేదనీ, శ్రీదేవికి కాస్త ప్రపంచజ్ఞానం వచ్చేటట్లు చెయ్యమని జయమ్మ సుభద్రమ్మతో చెప్పింది. సుభద్రమ్మ వారానికి రెండు మూడుసార్లు శ్రీదేవిని తనవద్దకు పంపిస్తూ ఉండమని చెప్పింది. సుభద్రమ్మకు హిందీ కూడా వచ్చు. శ్రీదేవికి హిందీ నేర్పుతానంది. మిషన్‌మీద బట్టలు కుట్టడం కూడా నేర్పుతుంది.

నిజానికి శ్రీదేవిమీద జయమ్మకు అంత శ్రద్ధ గాని, అభిమానం గాని లేవు. అవి మొదటినుంచీ ఉండిఉంటే ఆమెకు చదువే చెప్పించి ఉండేవారు. పైనైనా, విశ్వేశ్వరరావుగారి సరదావల్ల చెప్పించారుగాని, అంతకుమించి వారికి పెద్ద ఆశయామేమీ లేవు. కాని, ఇప్పుడు అనసూయమ్మకూ, తనకూ పడకపోవడంవల్ల, తనేదో పెద్ద శ్రద్ధను శ్రీదేవి గురించి తీసుకుంటున్నట్లూ, తల్లికేమీ శ్రద్ధ లేనట్లూ చూపించాలని జయమ్మ ఆరాటం.

బయట ప్రపంచం కొద్దిగా చూసేసరికే ఇంటి వాతావరణం మీద విసుగెత్తిన శ్రీదేవికి సుభద్రమ్మ ఇంటికి తరుచూ వెళ్ళాలనీ, సరదాగా నలుగురిలో తిరగాలనీ చాలా ఆతృతగా ఉంది. అందువల్ల మరునాడు తన ఇంటికి రమ్మని సుభద్రమ్మ ఆహ్వానించగానే, శ్రీదేవికి చాలా సంతోషం కలిగింది. అందుకు జయమ్మ కూడా ప్రోత్సాహం ఇవ్వడంవల్ల ఆమెకు భయం పోయింది.

సుభద్రమ్మకు సినిమాలంటే తగని వెర్రి. మరునాడు శ్రీదేవిని మధ్యాహ్నం బయల్దేరి వచ్చెయ్యమనీ, మాట్నీకి వెళ్దామనీ చెప్పి సుభద్రమ్మ వెళ్ళిపోయింది.

41–వ పేజీ చూడండి




"అన్నయ్యా!"

గదిలో కుర్చీలో కూర్చుని పెళ్ళి జాబితా రాసుకుంటూన్న సుధాకరం క్షణంసేపు వెనక్కి తిరిగి చూసి 'నువ్వా-రా' అంటూ మళ్ళీ రాసుకోవటంలో మునిగిపోయాడు.

సుజాత మెల్లగా వచ్చి అన్నగారు కూర్చున్న కుర్చీ వెనక నిలబడింది.

"ఏమిటమ్మా" కొద్దిసేపయింతర్వాత తన వెనక నిశ్శబ్దంగా నిలబడిపోయిన చెల్లెలు గుర్తొచ్చి అడిగాడు.

'అన్నయ్యా ." సుజాత పెదవులు అస్పష్టంగా కదలి వూరుకున్నాయి.

'నీ స్నేహితురాళ్ళందరికీ ఉత్తరాలు రాశావా ? శుభలేఖలు పంపటంలో నే నెవర్నీ మర్చిపోలేదు గదా" జాబితాలో ఏదో వస్తువు గుర్తువచ్చిన సుధాకరం మళ్ళీ చటుక్కున వంగి రాస్తూ అన్నాడు. మళ్ళీ ఐదు నిమిషాలు గడిచిపోయినాయి. సుజాత అన్నగారు రాస్తున్న లిస్ట్ వంక చూస్తూ నిలబడి పోయింది.

'ఆ ! మర్చిపోయాను. నీకే రంగులు యిష్టమో చెప్పు. చీరెలు పంపమని షావుకారుకి ఖబురు పంపాలి.' హఠాత్తుగా గుర్తొచ్చిన సుధాకరం ఆగిపోయి తలెత్తుతూ అన్నాడు.

"నాకీ పెళ్ళి వద్దు. వద్దన్నయ్యా" చాలాసేపటి నుంచి ఎదురుచూస్తున్న సుజాత యెలగో అనేసింది.

"వద్దా ?' తెల్లబోతూ చేతిలో పెన్ డ్రాయరు మీద పెట్టేస్తూ అన్నాడు.

"అవును. నిజం. ఎలాగైనా ఈ పెళ్ళి ఆపు చేసెయ్యి."

సుజాత మాటలకంటె ముందుగా మొహం ఎర్రబడిపోయింది. అంతకంటె ముందుగా కళ్ళు నేలమీదకి వాలిపోయినాయి. తప్పుచేసినదానిలా కళ్ళు వాల్చేసుకుని బొమ్మలా నిలబడిపోయిన చెల్లెలి వంక ప్రశ్నార్థకంగా చూశాడు. అతని కనుబొమ మధ్య ముడిపడింది. ఎడంచెయి చాచి చెల్లెలి చేతిని పట్టి ముందుకి లాగుతూ 'ఎందువల్ల ? అతను నీకు నచ్చలేదా ?' అన్నాడు. వరుడు నచ్చటం విషయంలో ఎవరికీ అనుమానం లేదు. అందుకే అతను మాటవరసకి కూడా చెల్లెల్ని అడగలేదు. ఓ విధంగా ఈ సంబంధం తమ స్థితికి వూహకి మించింది.

సుధాకరం మాటలకి అది కాదన్నట్లు తల అడ్డంగా వూపింది.

'మరి ?' ఏమడగాలో అతనికి అర్థం కావటం లేదు.

సుజాత చెప్పటంలేదు.

'ఎందువల్లో చెప్పకపోతే నా కెలా తెలుస్తుంది? ఫలాన కారణం అంటూ ఉండాలిగా. ఇన్ని ప్రయత్నాలు చేసుకుని, తాంబూలాలు పుచ్చుకుని లగ్నం నిర్ణయించుకున్నాక యిప్పుడు—అసలే—' అర్థోక్తిలో ఆగిపోయాడు సుధాకరం.

'నే నప్పుడే చెప్పాలనుకున్నాను. కాని నువ్వుగాని, వదినగాని అసలు ఛందే యివ్వలేదు. నాకీ పెళ్ళి వద్దు. నా కిష్టంలేదు. అత్తయ్య తిట్లు—శాపనార్థాలు నువ్వు మర్చిపోయినా నేను మర్చిపోలేదు. గబగబ అనేసి గుక్కున వెనకనుంచి అన్నగారు పిలుస్తున్నా లక్ష్యపెట్టకుండా వెళ్ళిపోయింది.

చెల్లెలి వెళ్ళిపోయిన దిక్కే అచేతనంగా చూస్తూ కూర్చుండిపోయాడు సుధాకరం అంతకుముందు ఎంతో ఉత్సాహంతో కూర్చుని రాస్తున్న జాబితా హఠాత్తుగా అతనికి విసుగ్గా అన్పించింది సుజాతకి ఈ పెళ్ళి నిజంగా యిష్టంలేదేమో. ఆ లేత మనసులోంచి మధుబొమ్మ యింకా చెరిగిపోలేదేమో. ఇష్టంలేని పెళ్ళి చేసి సుజాతతోపాటు మరీ ముక్కు మొహం తెలియని వ్యక్తిని బాధ పెట్టటం దేనికి! హఠాత్తుగా అతనిలో నీరసం ప్రవేశించింది. జాబితా కాగితాన్ని మడిచి పుస్తకంలో పెట్టేసి లేచి లోపలకు వెళ్ళాడు.

లోపల పెళ్ళి తాలూకు పనిమీద హడావుడిగా అటు యిటు తిరుగుతోంది శాంత. శాంత కసలు బుద్ధిలేదు! తనేదో పన్లో ఉండి సుజాత అభిప్రాయం తెలుసుకోవటానికి వీల్లేకపోవచ్చు. కాని శాంత కేమైంది? 'శాంతా!' గుమ్మం బైటనుంచి కొంచం కటువుగా వచ్చిన పిలుపుకి యెవరితోనో మాట్లాడుతూ ఏదో పనిచేస్తున్న శాంత తలెత్తి చూసింది. సుధాకరం కనుబొమలు ఇంకా ముడిపడే ఉన్నాయి ఏదో చికాకు కలిగితే తప్ప అవి అలా ముడుచుకోవు. 'ఏమిటో' అంటూ శాంత యివతలకు వచ్చింది. 'ఇలారా' గదిలోకి దారి తీస్తూ పిల్చాడు.

శాంత భర్తవెంటే లోపలికి వచ్చింది. 'సుజాత పెళ్ళి వద్దంటుంది ఏమిటి ?' భార్య మొహంలోకి సూటిగా చూస్తూ అడిగాడు. శాంత కళ్ళు కాసేపు తెల్లబోయినట్లు భర్త మొహంలోకి చూసినాయి.



"ఎందువల్ల అలా అంటోంది? నిజంగా ఇష్టంలేకపోతే ఈ పెళ్లి జరిగి మటుకు ప్రయోజనం ఏమిటి? అస లెందుకు వద్దంటుంది?"

"మీ రడగలేక పోయారా?' అతని కర్థంగాని విషయాలు భార్యమీదకు నెట్టటం సుధాకరాని అలవాటే?

"అడిగాను. అత్తయ్య తిట్లు, శాపనార్థాలు నువ్వు మర్చిపోయినా నేను మర్చిపోలే దంటోంది అంతేనా? లేక ....' భార్య వంక చూస్తూ ఆగి పోయాడు.

"ఇంకేం మరి? తన కసలు పెళ్లికాదని. అయినా అది సవ్యంగా ముగించదని తనలో నో అభిప్రాయం ఏర్పడినట్లుంది. ఇదివరకు ఒకటి రెండు సార్లు నాతో అంది గూడ."

"అంతేనా అని?"

"అంతకంటె కారణం నాకు కన్పించటంలేదు. అయినా కనుక్కుంటాను."

శాంత వెళ్లిపోయింది. కారణం అదే అయితే ఫర్వాలేదు. జీవితంలో అనుకోకుండా దెబ్బతిన్న వాళ్లకి ఆ పిరికితనం తప్పకుండా వస్తుంది. సుధాకరం మళ్లీ లిస్ట్ తయారుచెయ్యటంలో మునిగి పోయాడు.

ఆ రాత్రి పడుకోబోతుండగా 'కారణం అదే. అంతకంటే ఏంలేదు. మీరు ఖంగారు పడకండి. చచ్చిపోయిన మధు కంటే మేనత్త తిట్లు ఆ అమ్మాయి మీద ఎక్కువగా పనిచేశాయి అంతే' అంది శాంత.

"అంతే కదా." సుధాకరం నిట్టూర్పు విడిచాడు. సుజాత అతనికి ఒక్కగా నొక్క చెల్లెలు. ఆ

31 వ పేజీ చూడండి

## గ్రహస్థితి

కర్కాటకంలో అంగారక రాహువులు; వృశ్చికంలో శుక్రుడు; మకరంలో సూర్య, బుధ, శని, కేతువులు; కుంభంలో గురువు; తులా, వృశ్చిక, ధనుస్సులలో చంద్రుడు.

# వారఫలాలు

## దైవజ్ఞ పాతూరి శ్రీరామమూర్తి

**18-1-1963 శుక్రవారము మొదలు**
**24-1-1963 గురువారము వరకు**

### మేషం :

**(అశ్విని, భరణి, కృత్తిక 1 పా.)**

ఈ వారం ఏ ప్రయత్నమైనా సులభంగా నెరవేరుతుంది. అయితే చేసిన పనిలో రకరకాల లోపాలు బయటపడే సమయం. ఇతరుల వ్యవహారాలలో పెత్తనం చేయటం, హామీ ఉండటం మొదలయిన వాటివల్ల ఇబ్బంది పడతారు. తరచు సంచారము, శరీర శ్రమలతో కూడిన పనులు తటస్థపడుతవి. కోర్టు, కచేరీలలో మీ యుక్తివల్ల చురుకుగా కార్యం సాధించుకొని, బయటపడగలుగుతారు. ధనరూపంలో ఫలితం అపరిమితంగా ఉంటుందని అనుకోవద్దు. మీ జాగ్రత్తవల్ల ఇంతకుముందు నష్టములను సరిచేసుకొనే అవకాశాలున్నవి. అధికారుల విషయంలో జాగ్రత్తగా ప్రవర్తించవలసి ఉంటుంది. వారం మధ్యలో అనుకోకుండా అనారోగ్యం సూచించవచ్చు. 23, 24 తేదులలో ఆస్తివృద్ధి సూచనలు, దైవ కార్యాలు, గౌరవ లాభం.

* * *

### వృషభం :

**(కృత్తిక 2, 3, 4 పా., రోహిణి, మృగశిర 1, 2 పా.)**

స్థిర సంకల్పంతో మీ వృత్తి ఉద్యోగ ధర్మాలను నిర్వహించగలుగుతారు. ఎప్పుడూ ఆత్మీయుల ఆదరణతోబాటు ధనాదాయం కూడా వృద్ధి అవుతుంది. విశేషంగా పెట్టుబడి పెట్టవలసిన పనులు కలిసివస్తవి. మీ సలహా సదినుండికీ అనుకూలంగా ఉంటుంది. విశ్రాంతి లేకపోవటంవల్ల ఒకప్పుడు నిరుత్సాహం కలుగుతుంది. మీ విద్యా సంబంధమైన కృషికి ప్రోత్సాహం బాగుంటుంది. కుటుంబంలో ప్రశాంతంగా జరుగ తగిన సమయం. ఏ వ్యవహారం తలపెట్టినా, ఒడుదుడుకులు లేకుండా చల్లగా సాగిపోతుంది. కాని, మనస్సుమాత్రం చెడును శంకిస్తూ ఉంటుంది. రాజకీయాలలో మీ ఆందోళనకు సంబంధించిన కారణాలు క్రమంగా తొలగిపోతవి. వారాంతంలో దొంగతనంగా వస్తువులు పోవచ్చు. 22, 23 తేదులలో బంధు దర్శనం, కలహవార్తలు.

* * *

### మిథునం :

**(మృగశిర 3, 4 పా., ఆర్ద్ర, పునర్వసు 1, 2, 3 పా.)**

ఏ సందర్భంలోనూ వెంటనే ఫలితం కన్పిస్తుందనుకోవద్దు. మిమ్ములను గురించి నిరాదరణగా మాట్లాడేవారు, నిరుపయోగమైన సలహా లిచ్చేవారు తటస్థపడతారు. అనుకోకుండా కష్టవార్తలు తెలియగల సమయం. వృత్తిలో అత్యాశకు పోయి, అందిన ఫలితాన్ని వదలుకొనటం జరుగుతుంది. సంఘంలోని మనుష్యుల స్వభావాన్ని గ్రహించటం శ్రమకరంగా తోస్తుంది. కుటుంబంలోనివారి అనారోగ్యాలు అధికం కాగల సమయం. బాహ్య విషయాలలో దీర్ఘ ప్రసంగాలకు అవకాశం ఇవ్వకుండా పనులు జరుపుకొనటం అవసరం. ఈ సమయంలో మనో నిగ్రహం ప్రధానం. ఎన్ని ఆటంకాలు వచ్చినా, శుభ కార్యాలు, పుణ్యకార్యాలు సకాలంలో నెరవేరుతవి. మీ అంతస్తుకు సంబంధించిన కొన్ని కార్యక్రమాలను తగ్గించుకొంటారు. 21, 22 తేదులలో శత్రుబాధ, విలాస విషయాలలో దుబారా అధికం.

* * *

### కర్కాటకం :

**(పునర్వసు 4 పా., పుష్యమి, ఆశ్లేష.)**

వ్యవహార రంగంలో తొందరపాటు కలుగుతూ ఉంటుంది. కాని, దైవానుగ్రహంవల్ల విచక్షణతో ప్రవర్తించగలుగుతారు. వృత్తిలో తెలిసి కూడా కొన్ని పొరపాట్లు చేయటం జరుగుతుంది. అయితే పరులకు ఇబ్బందులు రాకుండా సమర్థించుకొనగలుగుతారు. ధన, కుటుంబ పరిస్థితులలో మనోధైర్యం, క్రమక్రమంగా అనుకూల లక్షణాలు కనపించగలవు. పిల్లల మూలంగా ఆనందం లభిస్తుంది. మీ పరోక్షంలో జరిగే పనుల నిమిత్తం ఇతరులమీద ఆధారపడి విలువగల వస్తువులు గాని, ధనం గాని వినియోగించటం జరుగతుంది. ప్రయాణాలు సుఖంగా నెరవేరగలవు. ఒకరు చెప్పిన మాటలను నమ్మి, మరొక పెద్ద మనుష్యునికి మాట ఈయటం మంచిదికాదు. మొత్తంమీద బెట్టుతో అంతస్తు నిలుపుకొనవలసిన సమయం. 20, 21 తేదులలో శుభవార్తలు, అధికారులతో స్నేహం, సంఘంలో ఆడంబరం.

* * *

### సింహం :

**(మఖ, పుబ్బ, ఉత్తర 1 పా.)**

గత విషయాలను గురించి ఆదుర్దా చెందతగిన సమయంకాదు. సంఘ కార్యాలలో ఉదారం చూపవలసివస్తుంది. వృత్తి విషయాలలో మంచి మార్పులు రాగలవు. దుబారా ఖర్చులనుమాత్రం తగ్గించలేకపోతారు. ఒక సమయంలో గోటితో తుంచివేయ తగిన సమస్యను అశ్రద్ధ చేయటంవల్ల ప్రస్తుతం కొంత ఆట్టహాసం చేయవలసివస్తుంది. ప్రస్తుతం మీకు అందరూ అపకారం చేయరు. కాని, ఏ సమయంలో, ఏ రూపంలో మోసం జరుగుతుందోనని జాగ్రత్త పడుతూ ఉండటం అవసరం. ఆదాయం విషయంలో తృప్తి కలుగదు. మీ ధర్మమును చక్కగా నెరవేర్చుకొని, పైవారిని సంతోషపరచగలుగుతారు. భాగస్తులు మొదలయినవారివల్ల సహాయం లభిస్తుంది. వారాంతంలో పుణ్యకార్యాలు జరుగుతవి. 19, 20 తేదులలో సంతోష వార్త, స్వల్ప లాభం.

## —ఈ వారము ధరలు—

బంగారు ధర 18, 19 తేదులలో కొంచెం చురుకుదనం కనుపించవచ్చు. పిమ్మట క్రమంగా తగ్గుదల వస్తుంది. వెండి ప్రస్తుతానికి కొంచెం తేజీ వస్తుంది. వేరుశనగ పప్పు ధర 23, 24 తేదులలో పెరుగుతుంది. నూనె మాత్రం మామూలుగానే నిలుస్తుంది. నూవులకు గిరాకివచ్చినట్లే వచ్చి,వెంటనే యధాప్రకారం అవుతుంది. మిర్చిధర ఇప్పుడు తగ్గి ముందు ముందు నిదానంగా తేజీ వస్తుంది.

### కన్య :

**(ఉత్తర 2,3,4 పా., హస్త, చిత్త 1, 2 పా.)**

గ్రహబలం బాగున్న సమయం. మీరు అనుసరిస్తున్న మార్గం లాభదాయకంగా ఉంటుంది. మిమ్ములను పదిమంది మెచ్చుకుంటారు. ప్రయాణం చేస్తారు. అనుకున్నదానికంటె అధికంగా ఫలితం లభిస్తుంది. మధ్యలో శారీరకంగా అసౌఖ్యం కనుపించి, వెంటనే నివర్తి అవుతుంది. అనుభవంలో ఆశ్చర్యకరమైన విషయాలను తెలుసుకొంటారు. వ్యవహారభయం తొలగుతుంది. ఎదటివారి మాటలను నిదానంగా అర్థం చేసుకొనటం మంచిది. తొందరపాటువల్ల కలహాలు, ధనవ్యయం కలుగతగిన అవకాశాలున్నవి. ఆహార విహారాలలో శ్రద్ధ తీసుకొనక పోవటంవల్ల ఈ సమయంలో కష్టపడవలసివస్తుంది. వారాంతంలో క్రొత్త మార్గాలలో ఆదాయం లభిస్తుంది. సంఘ కార్యాలలో పాల్గొంటారు. వాగ్దానాలు నెరవేరుతవి. 18, 19 తేదులలో ధనలాభం కార్యసిద్ధి.

* * *

### తుల :

**(చిత్త 3, 4 పాదాలు, స్వాతి, విశాఖ 1, 2, 3 పాదాలు)**

ఈ వారం మనో నిగ్రహం ఒక్కటే మిమ్ములను కాపాడుతుంది. ముందుగా చేసిన ఆలోచన, నిర్ణయాలు సమయం వచ్చేసరికి ఉపయోగించకుండా పోతవి. వ్యవహార రంగంలో మిమ్ములను స్తోత్రం చేసేవారే గాని, ఆదుకొనేవారు తక్కువ. ఆస్తిపాస్తులు కొనటంవంటి సందర్భాలలో శక్తి, సామర్థ్యాలను చూచుకొని దిగండి. మబ్బులోని నీటికి ఆశపడినట్లుగా ప్రవర్తించవద్దు. మీ వృత్తి వ్యాపారాలకు సంబంధించిన విషయాలలో మానసిక శ్రమే అధికంగా ఉంటుంది. మీ వలన కార్యం సాధించుకొనటానికి ఆశ పెట్టేవారే గాని, మాటలను కాపాడుకొనేవారు తక్కువ. దైవిక విషయాలయందు ఆసక్తి కలుగుతుంది. క్రొత్తవారి పరిచయంవల్ల ధనలాభము, సంఘంలో ఆడంబరము పెరుగుతవి. ఏది ఎలా ఉన్నా, ఆత్మవిశ్వాసము, ఉత్సాహము బాగుంటవి. 18, 19 తేదులలో సంఘ గౌరవం, ఆదాయవృద్ధి.

* * *

### వృశ్చికం :

**(విశాఖ 4-వ పాదం, అనూరాధ, జ్యేష్ఠ.)**

ప్రస్తుతం బుద్ధిబలంతో చల్లగా పైకి రాగలుగుతారు. బయటికి తెలియని ప్రతిబంధకాలు వస్తూ

ఉంటవి. ఆ యా సమయాలలో ముందుగా జాగ్రత్త పడుతూ, మీ ధన గౌరవాలను నిలుపుకొన గలుగుతారు. ఆరోగ్యం బాటుంటుంది. నౌకరులను, మీ వ్యవహారాలలో మధ్యవర్తిత్వం చేసేవారిని నమ్మవద్దు. కుటుంబంలో ఏదో ఒక సందర్భంలో భేదాభిప్రాయం వచ్చినా, వెంటనే సర్దుమణిగిపోతుంది. సుఖం లభిస్తుంది. ప్రస్తుతం ఎంత ధన వ్యయం జరిగినా, దుబారా అని అనిపించుకోదు. ప్రయాణం చేయువలసివస్తుంది. విలువగల వస్తువులు కొనే సందర్భాలలో తొందరపడవద్దు. అన్ని రకాల కార్యాలు మీ పైననే వేసుకుందామని పట్టుపట్టవద్దు. 19, 20 తేదులలో అధిక శ్రమ.

* * *

**ధనుస్సు :**

(మూల, పూర్వాషాఢ, ఉత్తరాషాఢ 1 పా.)

సాధ్యమైనంతవరకు బాధ్యతలను తొలగించుకొనండి. క్రొత్త వ్యవహారాలలో మీకు అనుకూలం తక్కువ. లెక్కలు, వ్రాతలు మొదలయినవాటిలో తప్పులు రాగల సమయం. శారీరకంగా విశ్రాంతి తీసుకున్నా మనస్సుమాత్రం పని చేస్తూ ఉంటుంది. పిల్లల ఆరోగ్యం సరిగా ఉండదు. ఇతరుల చేతికి పోయిన ధనం ఏదో విధంగా రప్పించుకొంటారు. ఇంతకుముందు విరోధంగాఉన్నవారివద్దనుంచి సంతోష వార్తలు తెలుస్తవి. మామూలుగా చేయు పనులను కూడా ఈ సమయంలో శ్రమతో పూర్తి చేయుట మవుతుంది. ఆయుధాలు, అగ్ని మొదలయినవాటి పనులలో జాగ్రత్త అవసరం. ఒక పని చేస్తూ, మరొక విషయం గురించి యోచిస్తూ ఉంటారు. 20, 21 తేదులలో విచార వార్తలు, ధనవ్యయం.

* * *

**మకరం :**

(ఉత్తరాషాఢ 2, 3, 4 పా., శ్రవణం, ధనిష్ఠ 1, 2 పా.)

మీ వృత్తిలో ఒక సమయంలో చాలా ప్రోత్సాహం కనుపిస్తుంది. కాని, స్థిరంగా నిలువదు. ప్రయాణాలు లాభదాయకంగా ఉంటవి. ఈ సమయంలో ఎక్కువ భాగం ఆలోచనలతోను, ఇతరుల బాధ్యతలతోను సరిపోతూ ఉంటుంది. మీ అజాగ్రత్తను, ఏమరుపాటును ఎదురు చూచేవారు ఉంటారు. శుభకార్యాలకు, దైవకార్యాలకు ఆటంకాలు తొలగి, సుఖంగా నెరవేర్చుకుంటారు. అధికారులను గాని, సంఘంలో పెద్ద మనుష్యులను గాని కలిసి, సంప్రదింపులు జరుపగలుగుతారు. ఎప్పటికప్పుడు ధన లోపం కనుపిస్తూ ఉంటుంది. తిరిగి సమృద్ధిగా లభిస్తూ ఉంటుంది. వారాంతంలో అకస్మాత్తుగా దేహ బాధలకు గురి కావలసివస్తుంది. 21, 22 తేదులలో కార్యసిద్ధి, ప్రయాణం.

* * *

**కుంభం :**

(ధనిష్ఠ 3, 4 పా., శతభిషం, పూ. భాద్ర 1, 2, 3 పా.)

ఎప్పుడూ పదిమందిలో సంతోషంతో గడపతగిన సమయం. అయితే ఆత్మీయులవల్ల భంగం కలుగుతుంది. ఆదాయాన్నిమించిన ఖర్చులు, ధైర్యంతో మీ పనులను జరుపుకొని పోగలుగుతారు. అనుభవం లేని పనులలో దిగటంవల్ల ముందు కొంత శ్రమ తప్పదు. ఎంత భారమైన వ్యవహారమైనా స్వయంగా నిర్వహించటమే కొంతవరకు మేలు. ఇతరులతో కలవటం అనేది చిక్కులకు దారి తీస్తుంది. కుటుంబంలో సంతోషదాయకమైన సమయం. మీకు సంబంధించిన వారివల్ల జరిగే పొరపాట్లను మృదువుగా సవరించుకొనవలసిన సమయం. వారం రెండవ భాగంలో గౌరవస్థానం లభిస్తుంది. ఇంతకుముందు ఎప్పుడో వచ్చిన ఊహలు ఈ సమయంలో కార్యరూపంలోకి వస్తవి. ఆహార విహారాలలో జాగ్రత్తగా ఉండండి. 22, 23 తేదులలో ధనలాభం.

* * *

**మీనం :**

(పూ. భాద్ర 4 పా., ఉ. భాద్ర, రేవతి.)

ప్రస్తుతం అవకాశాలు బాగుంటవి. సాధారణంగా ఎవ్వరూ మీ మాటను త్రోసివేయరు. మీ సంకల్పం నిలకడగా ఉండటం అవసరం. ప్రతి విషయంలో ముందు సాహసం చేయవలసి ఉంటుంది. ఈ సమయంలో వృత్తికి సంబంధించిన పనులలో శ్రద్ధ అవసరం. మనస్సు పరిపరివిధాల పోతూ ఉంటుంది. అందువల్ల ఒక సమయంలో కాని పనులకు దిగటం జరుగవచ్చు. కుటుంబ వాతావరణం కొంత చికాకును కలిగిస్తుంది. వారం రెండవ భాగంలో విశ్రాంతిలేని పనులు, ఆదాయవృద్ధి కనుపించగలవు. ప్రతి పనిలోను నిదానము ,ఇతరుల పొరపాట్లను సహించుకొనగల మనస్తత్వము అవసరం. 23, 24 తేదులలో సంఘంలో గౌరవం, అకస్మాద్ధన లాభం.



# నాకీ పెళ్లి వద్దు

29 వ పేజీ తరువాయి

అమ్మాయి సంతోషం కోసం, సుఖం కోసం తనేదైనా చెయ్యగలడు. 'ఏదయినా నువ్వు దానికి ధైర్యం చెప్పు. అసలే ఒట్టి పిరికిది. ఏవేవో ఊహించుకుని ఖంగారుపడిపోతుంది." పక్కకు ఒత్తిగిలి పడుకుంటూ అన్నాడు' రేపు తనుగూడా సుజాత కీ విషయంమీద కాస్త ధైర్యం చెప్పాలి అనుకుంటూ.

సుధాకరం గదిలో పెద్దలైటు తగ్గి బెడ్ లైటు వెలగటం తన గదిలో కిటికీ దగ్గర నిలబడ్డ సుజాత గమనిస్తూనే ఉంది. ఇల్లంతా నిశ్శబ్దం ఆవరించుకుంది. నిద్రలో లేచి ఏడుస్తున్న బాబుని శాంత జోకొట్టింది. బైట పిండారబోసినట్లున్న వెన్నెల్లో సర్వ ప్రపంచం సుఖశాంతులతో విలసిల్లుతున్నట్లుగా ప్రశాంతంగా నిశ్శబ్దంగా ఉంది. కావాలని ఎంత ప్రయత్నం చేసినా సుజాతకి నిద్ర రావటంలేదు. తనేలాగో అన్నయ్యకి చెప్పేసింది. చెప్పకపోతే ఎలా ? ఈ పెళ్ళి ఆగిపోగానే తన కసలు పెళ్లి వద్దని. సంబంధాలే చూడద్దని అన్నయ్యకు గట్టిగా చెప్పాలి. ఆరోజు—బావతో తన పెళ్లికోసం లగ్నం పెట్టినప్పుడు—తనని పెళ్లికూతుర్ని చేసిన రోజున దురదృష్టవంతురాలివి అని జీవితం తన నుదుటమీద గీసిన దొంగ్రటి గీతని ఎవరు మర్చిపోయినా తనెలా మర్చిపోగలుగుతుంది.

అసలు మొట్టమొదట్లో టైఫాయిడ్ జ్వరముతో తీసుకుంటూ చావు బ్రతుకులమీదున్న తండ్రిని తన మేనత్త విశాలక్ష్మమ్మగారు చూడటానికి రావటంతో అసలు కథ ప్రారంభమైందని చెప్పొచ్చు. అంతకుముందు ఎవరూ సుజాతని మధు భార్యగా ఏదో ఒకటి రెండు సార్లు తమాషాగా తప్ప అనుకోలేదు. ప్రసాదరావుగారికి కూతురూ కొడుకు యిద్దరూ రెండు కళ్లు. సుధాకరం బి. ఏ. పూర్తిచేసి ఆర్థిక పరిస్థితులవల్ల పై చదువుల కెళ్లలేక బి. ఇడి పాసయి ఉన్న ఊళ్లో బెజవాడలోనే స్కూలు టీచరుగా జీవితానికి బాట వేసుకున్నాడు. సుధాకరం కుటుంబానికి తగ్గ ఫాయాలోంచే వచ్చిన శాంత ఆ కుటుంబంలో వ్యక్తిగా కలిసిపోయింది. కూతురికి మటుకు ఎలాగైనా మంచి సంబంధం తీసుకురావాలని ప్రసాదరావుగారు కలలు కనేవారు.

అనుకోకుండా విషజ్వరం మహమ్మారిలా వచ్చి ఆయన నెత్తినెక్కి కూర్చోవటంతో యిష్టం లేకపోయినా 'ఈ లోకంలో నుంచి వెళ్లిపోవటానికి సిద్ధపడక తప్పలేదు. తన పరిస్థితి గమనించుకునే గుంటూరునుంచి చెల్లెల్ని వెంటనే రమ్మనమని ఉత్తరం రాశారు. ఏ అవసరం వచ్చినా వెంటనే వచ్చి అన్నగారిని ఆదుకునే విశాలక్ష్మమ్మగారు ఉత్తరం చూడగానే బయలుదేరి వచ్చింది.

'బ్రతుకుతాననే ఆశ లేదు విశాలా. సుజాతని ఏంచేసి పోవాలో తోచటంలేదు.' కళ్లంబడి నీళ్లు పెట్టుకుంటూ అన్నారాయన చెల్లెలితో.

అదేమిటి ? చెట్టంత కొడుకుని కళ్లెదట బెట్టుకుని అలా మాట్లాడ్డా డన్నా! విశాలక్ష్మమ్మగార్కి అది నచ్చలేదు. పోనీ మధుకు చేసుకోమని మనసులో ఉంటే అది పైకి చెప్పచ్చుగా. అన్నగారి నోటినుంచే అది వినాలనుకున్న ఆవిడ కూడా ముభావంగా ఉంది. అదీ గాకుండా పుట్టగానే తల్లిని పోగొట్టుకున్న సుజాతంటే ఆవిడకు సదభిప్రాయం లేదు. చివరికి రెండు రోజుల్లో మృత్యుముఖంలోకి వెళ్లిపోతా ననగా ప్రసాదరావుగారు ఆ విషయం యెత్తారు.

'చూద్దాంలే అన్నయ్యా. దానికోసం నువ్వు బెంగపెట్టుకోకు.' అన్నారావిడ.

'సుధాకరం పసివాడే తల్లీ! కాస్త నువ్వు దయతల్చకపోతే వాడా బరువు ఎత్తలేడు. వెనక ఆస్తిపాస్తులేం లేవు. రెక్కలు తప్ప వాడికి ఏమీ యివ్వలేకపోయాను.' దుఃఖంతో ప్రసాదరావుగారి గొంతు బొంగురుపోయింది.

'అవిచ్చావు. చాలదూ! దిగులుపడకని చెప్తున్నానుగా. నువ్వనుకోలేదు గాని, లేకపోతే ఈపాటికి వాళ్లిద్దరి పెళ్లి ఎప్పుడో అయిపోయేది. నాకు మటుకు ఎవరున్నారు ?' అంది అందులో నువ్విది వరకు మధుని కాదని సంబంధాలు చూశావు. ఇప్పుడు వాడే కావాల్సి వచ్చాడు. అనే ఎత్తిపొడుపుంది.

చివరికి ఏ నిర్ణయం నిశ్చయంగాకుండానే ప్రసాదరావుగారు పోయారు. ఆ పదిరోజులూ ఉండి విశాలక్ష్మమ్మగారు వెళ్లిపోయారు. వెళ్లే ముందు సుధాకరం పెళ్లి సంగతి ఎత్తబోతే 'నాన్న సంవత్సరీకాలు కానివ్వు. ఇప్పుడు తొందరేమిటి' అని ఆవిడ వెళ్లిపోయింది.

సంవత్సరం యిట్టే తిరిగిపోయింది. విశాలక్ష్మమ్మగారి పరిస్థితి గూడ మారిపోయింది. అనుకోకుండా కలప వ్యాపారంలో పెట్టిందానికి రెట్టింపు

లాభాలు వచ్చాయి. డబ్బెప్పుడూ సాధారణంగా ఊరికే రాదు. హోదాని, పరువు ప్రతిష్ఠలని వెంటబెట్టుకుని మరీ వస్తుంది. విశాలక్ష్మమ్మగారి పనీ అంతే అయింది. డబ్బుతోపాటు వ్యాపారం పెద్దదయింది. పరిచయాలు పెరిగాయి. సంఘంలో మంచి మంచి హోదాగల మనుష్యులు మిత్రు లయ్యారు. కూతుళ్ళున్న కొంతమంది తండ్రుల దృష్టి మధుమీద పడటం ఆవిడ గమనించక

## నాకీ పెళ్ళి వద్దు

పోలేదు. కాని మధు కివేమీ పట్టలేదు. సూరయ్య పోయినప్పుడు వెళ్ళినప్పటినుంచి సుజాతని అతను భార్యగా నిర్ణయించేసుకున్నాడు. ఈ లాభాలు, హోదాలు, అదృష్టవంతురాలైన సుజాత రాకకి సన్నాహాలు అనుకునేవాడు. ఆదే సుధాకరానికి ఉత్తరంలో రాసేవాడు కూడ. సుధాకరం, విశాలక్ష్మమ్మ

గారి మౌనం చూసి జంకినా మధు ఉత్తరాలు నిశ్చింతగా ఉండేటట్లు చేశాయి. మరో ఏడాది గిర్రున తిరిగిపోయింది. ఈలోపల మధు ఏదో పని పెట్టుకుని అడపాదడపా బెజవాడ వచ్చి పోయేవాడు. ఆ యింట్లో వివాహం కాకపోయినా మధును ఇంటి అల్లుడిగానే అందరూ చూసుకునే వారు. సుజాత సరేసరి. మధు వచ్చాడని తెలిస్తే చచ్చినా గదిలోంచి బైట కొచ్చేదిగాదు. 'ఏమ్—

**అంత సిగ్గయితే యెలా ? చూడు. ఆ మూడు** ముళ్ళు వేసేసి నీ సిగ్గు నిమిషంలో యెగరగొట్టక పోతే ?' ఎప్పుడో అనుకోకుండా కన్పించిన సుజాత చెయ్యి గట్టిగా పట్టుకుంటూ అనేవాడు. మొహం అంతా ఎర్రబడిపోగా సుజాత చెయ్యి లాక్కుని పారిపోయేది.

ఆనాటి మధు కోర్కెమీదనే సుధాకరం మేనత్త పేరిట వివాహానికి ముహూర్తం ఏర్పాటు చేయించటానికి అనుమతి కోరుతూ ఉత్తరం రాశాడు. తిరుగు టపాలో విశాలాక్షమ్మగారు దగ్గిరనుంచి ఘాటుగా సమాధానం వచ్చింది. అందులో మొదట్లో మధుని కాదని సుజాతకి సంబంధాలు వెతికిన విషయాలు గుర్తుచేస్తూ — ఇప్పుడు మధుకి సుజాతకంటె లక్ష రెట్లు విలువైన సంబంధాలు వస్తున్నాయని. ఏలాంటి పరిస్థితుల్లోనూ సుజాత ఆ యింటి కోడలు కాలేదని, ఏదైనా ఆర్థిక యిబ్బందులవల్ల బాధపడుతున్నట్లయితే సుజాత పెళ్ళికి తను సంతోషంగా సాయం చేస్తానని మరో సంబంధం చూసుకోమని రాసింది. ఉత్తరం చూస్తుండగానే అందులో అక్షరం అక్షరం యిచ్చే అర్థం అవగాహనం చేసుకుంటూనే సుధాకర్ మండిపడ్డాడు. రోషంతో అతని నర నరం ఒణికింది మధు యిష్టాన్ని గ్రహించాక. కాని లేకపోతే ఏనాడూ తను సుజాతని బలవంతాన కట్టబెట్టాలని అనుకోలేదు. పైగా డబ్బు సాయం చేస్తుందిట! డబ్బు సాయం! తను మరీ అధమస్థితిలో లేనని వెళ్ళి చెప్పాలనిపించింది. కాని ఇందులో మధు అభిప్రాయం తెలుసుకోందే తొందర పడకూడదని నిర్ణయించుకుని తల్లి రాసిన ఉత్తరాన్ని మధు పేరు పోస్ట్ చేశాడు.

ఆ సాయంత్రం కాలేజీనుంచి మామూలుగా కంటె త్వరగా వచ్చేసిన మధు సరాసరి వంటయింటి దగ్గరకి వెళ్ళి 'ఈ ఉత్తరం నువ్వు రాసిందేనా అమ్మా' అని అడిగాడు. క్షణంసేపు అర్థం కాని విశాలమ్మగారు 'ఏ ఉత్తరం' అంటూ తీసుకుని కొయ్యబారిపోయింది. సుధాకరం అలాటి పని చేస్తాడనుకోలేదు. అయినా మునిగిపోయింది లేదు. 'అవును ఏం ?' అంది తల్లి తను సరిచేసుకుంటూ. 'ఇంతవరకూ ఏ విషయంలోనూ నా మాట కాదన లేదు. ఇందులోనూ కాదనటం నా కిష్టంలేదు. సుజాత తప్ప ఇంకెవరూ ఈ ఇంటికి కోడలుగా రారు. రాలేరు. తర్వాత నీ యిష్టం.' అని వెళ్ళిపోయాడు. ఆవిడ స్థాణువులా నిలబడిపోయారు.

పది రోజులు గడిచిపోయిం తర్వాత విశాలక్షమ్మగారు సుధాకరం పేరిట "లగ్నాలు యిష్టం వచ్చినప్పుడు నిర్ణయించుకోవచ్చుని. పెళ్ళి మధుకి ఏ పద్ధతిలో అంగీకారం అయితే అదే పద్ధతిలో జరిపించవచ్చునీ, ఏ విషయంలోనూ, తన ప్రసక్తి లేదని. రెండు వైపులా పెత్తనం వహించి ఇష్టం వచ్చినట్లు చేసుకోమని రాసింది.

సుధాకరం ఆ ఉత్తరం చూసి తెల్లబోయాడు. ఆ యింట్లో విశాలక్షమ్మగారి విలువ, వ్యక్తిత్వం గ్రహించిన అతను అత్తయ్యకి ఇష్టం లేనప్పుడు అలా చేసుకోవటం మంచిదికాదని సుజాత వెళ్ళబోయే కుటుంబం భోగభాగ్యాల ఘాటుకి తెలావున్నా క్షేమానురాగాలతో ప్రతి వ్యక్తి ఆహ్వానించేటట్లుండాలని మధు పేరిట ఉత్తరం రాశాడు.

**మర్నాటి సాయంత్రానికి మధు వూడిపడ్డాడు.** వస్తూనే సుధాకరంమీద విరుచుకుపడ్డాడు 'నువ్వే ఏం తక్కువ తినలేదు. అమ్మని మించినట్లే ఉన్నావు. మీ యిద్దర్నీ సన్నలేక జవాబులు చెప్పలేక నా ప్రాణం పోతోంది. ముందు పెళ్ళి గానీ. తర్వాత అమ్మ సంగతి నేను చూసుకుంటాను. మీ చెల్లెలికేమీ ఫర్వాలేదయ్యా మహానుభావా !" అన్నాడు. సుధాకరం తృప్తిగా నవ్వాడు. లగ్నాలు నిర్ణయించుకున్న తర్వాత మధు వెళ్ళిపోయాడు. ఇందులో మేనమామ తన కసలేం పట్టనట్లు ఎటూ చెప్పకపోవటం సుధాకరానికి చాలా బాధ కలిగించింది.

లగ్నం నిర్ణయించటం జరిగింది. తనకు అందినంతవరకూ ప్రతి విషయంలోను మేనత్తని సంతృప్తిపరిచేవిధంగా ఉండాలనే సుధాకరం ప్రయత్నం చేస్తున్నాడు. తిథి, వార నక్షత్రాలు మంచివని చెప్పి పురోహితుడు పెళ్ళికి నాలుగు రోజులు ముందే సుజాతని పెళ్ళికూతుర్ని చేయించాడు. వేడుక చాలా వినోదంగా జరిగింది. శాంతకి పిల్లాడ్ని దగ్గరకు తీసుకునే తీరుబడి గూడా లేదు.

సాయంత్రం అయింది. పెళ్ళికూతురితోపాటు పేరంటాళ్ళందరికీ కూడ శాంత గాజులు వేయిస్తోంది.

'మొదట పెళ్ళికూతుర్ని కానివ్వమ్మా.' అంది పెద్ద ముత్తయిదు.

---

ప్రియుడు : నాకు రెండు జెళ్ళు అంటే యిష్టం.

ప్రేయసి : అలాగా! అయితే ఇంచక్కా వేసుకోండి.

మహేశ్వరి (హైదరాబాదు)

---

గాజులు బత్తులు సంచీ లోపల్నుంచి రంగు రంగు గాజులు తీసి సుజాత చేతికి ఎక్కిస్తున్నాడు.

'ఇంద్రధనుస్సులా ఏడు రంగులు వచ్చేట్లు వెయ్యి.' శాంత పురమాయిస్తోంది.

'అలాగేనమ్మా' అన్నాడు గాజులు బత్తులు ఎర్ర గాజులు తీస్తూ.

వచ్చిన పేరంటాళ్ళందరూ ప్రస్తుతం ఆడపిల్లల గురించి—వాళ్ళకి కాబోయే పెళ్ళిళ్ళ గురించి—అందులో సాధకబాధకాల గురించి లోకాభిరామాయణం చెప్తున్నారు.

ఇంతలో వాకిట్లోంచి ఎవరో శాంతని పిల్చి గుంటూరునుంచి మనిషి వచ్చారని, సుధాకరం మాట్లాడుతున్నారని చెప్పారు.

కాబోయే పెళ్ళివారి దగ్గరినుంచి మనిషి రావటం ఎవరికీ ఏమంత ఆశ్చర్యం కల్గించలేదు. అందులో అయినవాళ్ళు, రెండు ప్రక్కలా కావాల్సినవాళ్ళూ. ఏ ఖబుర్లయినా ఉండచ్చు. కాని శాంత లేచి వెళ్ళింది.

పది నిముషాలు గడిచిపోయినాయి. గాజులబత్తు నీలంరంగు గాజు తీసి సుజాత చేతి కెక్కిస్తున్నాడు. ఇంతలో బైటనుంచి శాంత హడావుడిగా లోపలికి వచ్చి 'ఇదుగో ఆపు. వేసినవి చాల్లే, అలాగే. 'ఏమిటదీ? ఎందుకూ' అదోరకంగా మారిపోయిన శాంత మొహంలోకి చూస్తూ ఎవరో ఆదుర్దాగా **అడిగారు.**

'ఆపేసెయ్యి. పెళ్ళి ఆగిపోయిందిట మనిషి. వచ్చాడు.' సుజాత ఉలిక్కిపడి వెనక్కుతిరిగి చూసింది. నీలంరంగు గాజు ఎక్కిస్తున్న గాజులబత్తు కూడా ఎక్కిస్తున్న గాజు మధ్యలో ఆపేసి గుడ్లు పెట్టుకుని చూస్తుండిపోయాడు.

'క్షమించండి. పిల్లవాడి తల్లికి ఒంట్లో బాగా లేదుట. మమ్మల్ని ఉన్న పళంగా బైలుదేరి రమ్మని ఖబురు వచ్చింది. సుజాతా నువ్వు లేచి లోపలికి వెళ్ళు.' ఎలాగో గబగబా అనేసి శాంత లోపలకు వెళ్ళిపోయింది. వచ్చినవాళ్ళంతా ఒకళ్ల మొహాలు ఒకళ్ళు చూసుకున్నారు.

మరో అరగంటలో శాంత కోరికమీద ఇల్లంతా ఖాళీ అయిపోయింది. వచ్చినవాళ్ళంతా తలోవిధంగా గుసగుసలాడుకుంటూ వెళ్ళిపోయారు.

'వదినా ! అత్తయ్య కేమైంది' గబగబా పెట్టె సర్ది తలుపులు వేసి ప్రయాణానికి సిద్ధమవుతున్న వదినగార్ని అడిగింది సుజాత.

'అత్తయ్య కాదమ్మా. బావకే బాగుండ లేదుట! మరి ఎంతవరకు నిజమో ! నువ్వు ఖంగారుపడకు. ముందా వేషం తీసేసి మామూలు బట్టలు వేసుకుందా.' సుజాతమీద తన మాటలు ఎలా పనిచేశాయో గమనించకుండానే వెళ్ళిపోయింది శాంత.

వేషమా!? పొద్దుట్నుంచి తన ప్రాణాలు తిని వద్దు మొర్రో అంటున్నా వినకుండా కేకలేసి బుజ్జగించి బలవంతాన కూర్చోపెట్టి చేసిన అలంకరణ వేషమా!? అసలు బావకేమైంది !

సుజాత ప్రశ్నలకి ఎవరూ సమాధానం చెప్పలేదు.

ఆ రాత్రే అందరూ వచ్చిన మనిషితో గుంటూరు బైలుదేరి వెళ్ళారు. ఆ బైలుదేరటంలో తన మొహాన అదృష్టవంతురాలు అనే పదం తుడిచేసుకోటానికి వెళ్తోందని సుజాతకి తెలియదు. వచ్చిన మనిషి మధు ఆ ఉదయం గుండె ఆగిపోయి మరణించాడని చెప్పలేదు. వెళ్ళగానే చావు ఖబురు వినాల్సి వస్తుందని సుధాకర్ కల్లో గూడా వూహించలేదు. అదేమాత్రం వూహకి అందినా వెంట చెల్లెల్ని భార్యని తీసుకెళ్ళేవాడు గాదు.

వాకిట్లో వాళ్ళని చూస్తూనే విశాలక్షమ్మగారు—శోకంతో శివం ఎత్తినట్లయింది. చెట్టంత కొడుకు హఠాత్తుగా గుండె ఆగి చచ్చిపోయి శవంగా మారిపోతే ఆ శవాన్ని నిర్దయగా కాల్చి పారేస్తే యీ లోకం ఇంకా ఇలాగే ఉండిపోవటం ఎందుకో ఆవిడకు అర్థంకావటంలేదు. కొడుకు చావుతో దాదాపు పిచ్చిదైపోయిన ఆవిడ సుధాకర్ని చూస్తూనే మీద కురికి 'మీరే నా బిడ్డని పొట్టన పెట్టుకున్నారు. ఇదుగో ఈ రాక్షసి మూలంగానే వాడు చచ్చిపోయాడు.' అంటూ సుజాతని జెయిపట్టి గుంజింది. అనుకోకుండా ఎదురైన యీ సంఘటనకి అంతా తెల్లబోయారు. సుజాత భయంతో అన్నగారి గుండెలకి బల్లిలా అంటుకుపోయింది. 'నీ మొహానికి పెళ్ళి టే ? నీ మొహంలో వాడి చావు రాసిపెట్టుందని నా కప్పుడే తెలుసు. అందుకే వద్దంటే వాడు విన్నాడా ? ఇప్పుడు అనుభవిస్తున్నది ఎవరు ? నీకేమే, నువ్వు రేపీపాటికి పెళ్ళి చేసుకుని బాగానే వుంటావు. అయినా ఎలా చేసుకుంటావో చూస్తాను!

# నాకీ పెళ్ళి వద్దు

వాడు కూడా నా కొడుక్కు పెళ్ళి చూడటానికి రావకపోతే నా పేరు విశాలమ్మేగాదే. చూడు' వడగళ్ళవానలా ఆవిడ సుజాతమీద కురిపిస్తున్న శాపనార్థాలని వినలేక ఎవరో సుజాతని అక్కడుంచి అవతలకు లాక్కుపోయారు.

ఆ రాత్రికి రాత్రే భార్యని, చెల్లెలిని వెంట బెట్టుకుని బెజవాడ తిరిగి వచ్చేశాడు సుధాకర్.

జరిగిన ప్రయత్నాలు వృధా అయ్యాయి అనే కంటే చెల్లెలి జీవితం యిలా భగ్నమై పోయిందే అన్న బాధ ఎక్కువైంది సుధాకర్‌కి. జీవితం ప్రక్కవాటుగా వచ్చి అనుకోకుండా కొట్టిన యీ దెబ్బకి సుజాత మనసు దిమ్మెరపోయింది. చాలారోజులవరకూ మతి పోయినదానిలా గదిలో అలా గంటలు గంటలు కూర్చుండిపోయేది.

రెండు సంవత్సరాలు యిట్టే గడిచిపోయినాయి జరిగిన యీ సంఘటన గూడ పాతబడిపోయింది. శాంత ప్రోద్బలంతో మళ్ళీ సుధాకర్ సుజాత కోసం సంబంధాలు వెతకసాగాడు. విశాలక్షమ్మగారు వేయి నాలుకలతో సుజాత దురదృష్టాన్ని చాటటం మానలేదు. ఒకటి రెండు సంబంధాలు కుదరబోయి ఈ సంగతి తెలిసి వెనక్కు జంకినాయి. రోజులు గడుస్తున్నకొద్దీ తన చెల్లెలు దురదృష్టవంతురాలు కాదని, దానితో జీవితం పంచుకునే అవకాశంలేని మరే దురదృష్టవంతుడు అన్పించేలా సుజాత జీవితం చక్కదిద్దాలని సుధాకర్‌లో గట్టి పట్టుదల ఏర్పడింది. కాని ఎవరు ఎలా అనుకున్న సుజాత మనస్సులో విశాలక్షమ్మగారి తిట్లు శిలా రూపం ధరించాయి. ఆవిడ బాధ తన పాలిట శాపంగా మారి జీవితాంతం తనెక్కడున్నా తనకి సుఖం లేకుండా చేస్తుందనే నమ్మకం ఏర్పడి పోయింది. అది తెలిసి యింకో వ్యక్తిని దానికి బలి చెయ్యటం సుజాత కిష్టంలేదు. అందుకే యివాళ అన్నగారితో అలా నిస్సంకోచంగా నాకీ పెళ్ళి వద్దు అని చెప్పగలిగింది.

సుజాత అదృష్టమో, దురదృష్టమో దానికి సవాల్ అంటున్నట్లుగా నిశ్చయమైన యీ సంబంధము చూస్తే సుధాకర్‌కి కూడా మతి పోయినంత పనైంది. పెళ్ళికొడుకు శేఖరానికి ఉన్న డబ్బుకీ యినప్పెట్టెకీ కాపలాగా అన్నట్లు ఒక్క ముసలమ్మ తప్ప ముందు వెనకా ఎవరూ లేరు. బోలెడంత ఆస్తితోపాటు మంచి సంస్కార హృదయం గూడా కలిగిఉండటం అతని ప్రత్యేక లక్షణం అన్పిస్తుంది. ఆడవాళ్ళకి చదువు కంటె అందం, అందం కంటె గుణం ప్రధానం అనే మనిషి అతను. విదేశాలకు వెళ్ళొచ్చి హైద్రాబాద్‌లో ఉన్న పెద్ద కంపెనీలో ఇంజనీరుగా పనిచేస్తున్నాడు. అతనెంత ఆధునిక భావాలు గలవాడో వాళ్ళ బామ్మ అంత పాతకాలపు మనిషి. అటు బామ్మని తృప్తిపరుస్తూ ఇటు తనని సంపూర్ణంగా అర్థం చేసుకోగల వ్యక్తి కావాలి అతనికి. కాని ఎంత వెతికి కినా అటో యిటో తప్ప అలాటి మధ్యరకపు మనుష్యులు దొరకటంలేదు. వెతికి వెతికి విసిగి పోయిన అతను అసలు బామ్మ బ్రతికున్నన్నాళ్ళూ పెళ్ళి చేసుకోగూడదనే నిర్ణయానికి వచ్చాడు.

సుధాకరం స్నేహితుడైన రంగధామానికి శేఖరం గూడా కావాల్సినవాడు. ఏదో మాటలమీద ఓసారి హైద్రాబాద్‌లో కలుసుకున్నప్పుడు ఇలా తన

స్నేహితుడి చెల్లెలు హో అమ్మాయి ఉందని. ఒక్క పిల్ల, చాలా బాగుంటుందనే విషయం తప్పిస్తే ఇహ ఏ విషయంలోను శేఖరంతో సరితూగలేరని గూడా చెప్పాడు. బెజవాడ వెళ్లి చాలా సంవత్సరావ లయింది. ఓసారి చూసినట్టు ఉంటుంది. పెళ్లి కూతుర్ని చూసినట్లు ఉంటుందనుకొన్న శేఖరం చూడటానికి వస్తారని కబురు చేశాడు. శేఖరం స్థితిగతులు రంగధామం వర్ణించి చెప్పుంటే సుధాకరం వూ అని గాని ఆ అని గాని అనలేదు. మరీ అంత పైగా ఉన్న సంబంధం అతని వూహ కందనిది. కాని రంగధామం పట్టు వదల్లేదు. శేఖరాన్ని తీసుకొచ్చాడు. సన్నగా పొడుగ్గా రివటలా ఉన్న సుజాత క్షణంసేపు శేఖరం కళ్లల్లోకి చూసి అవి తనవైపే ఆసక్తిగా చూస్తున్నాయని గ్రహించి వెంటనే కళ్లు ప్రక్కకు తిప్పేసుకొంది. ఆ తిప్పేసుకోవ టంలో శేఖరం మనసు కూడా ఆ చూపుల వెంబడి వెళ్లిపోయిందనే చెప్పాలి. స్వదేశంలోనూ, విదేశాల్లోనూ శేఖరం చాలామంది అందమైన ఆడవాళ్లని చూశాడు గాని, ఇలా చాలా సాధార ణంగా ఉన్నట్లుండి ఒక్క చూపుతో పదేపదే తన వైపు చూసేలా చేసే మహా సౌందర్యాన్ని ఎక్కడా చూడలేదు. ఉన్న అరగంటలో శేఖరానికి సుజాత వైపు నుంచి కళ్లు తిప్పుకోవటం చాలా కష్టమే అయింది.

చూసి వెళ్లగానే ఆ సాయంత్రమే రంగధామం చేత కబురు చేశాడు. పిల్ల నచ్చిందని మిగతా విషయాలు వచ్చి మాట్లాడమని. శేఖరం మిగతా విషయాల అనటంలో గల ఉద్దేశ్యం లగ్నం ఎప్పుడూ వీలుగా ఉంటుంది? పెళ్లి ఎక్కడ చేస్తారు? అని మటుకే ఆ పై విషయాలు సుధా కరు శక్తిసామర్థ్యాలకి వదిలేశాడు సంబంధం ఖాయనుకుని ఇంటికి వచ్చేస్తుంటే సుధాకర్‌కి మతి పోయినంత పనైంది. తను చేసింది తనకే నమ్మకం ఏర్పడటంలేదు సుజాత శేఖరంలాటి వాడిని పొంద బోతోంది అంటే అతనికి ఊపిరి పీల్చటానికిగాని ఈ విషయం ఇంకొకళ కి చెప్పాలి అని గాని అనుకోటం గూడా భయంగా ఉంది అందుకే ఈ పెళ్లి విషయం ఎవరో మరీ ముఖ్యులు అనుకున్నవాళ్లకి తప్ప బంధువు లందరికీ తెలియపరచలేదు. విశా లక్ష్మమ్మగారికి అసలు కబురే తెలియకుండా జాగ్రత్త పడ్డాడు.

చాలా స్వల్ప వ్యవధిలో లగ్నం నిర్ణయింప బడింది శేఖరం బామ్మగారు వచ్చి పిల్లని చూసు కొని సంసార పక్షంగా ఉందని తృప్తిపడి వెళ్లి పోయింది.

పెళ్లి పనులు చాలా నిరాడంబరంగానే ప్రారంభ మైనా శాంతకి సందడి తప్పలేదు ఈ సందట్లో అస లెవరూ సుజాత గొడవ పట్టించుకున్నట్లే లేదు తనకీ పెళ్లి యిష్టంలేదని మొదట్లో వదినగార్కి చెప్పాలని సుజాత చాలా ప్రయత్నిం చింది. కానీ అవకాశం చిక్కలేదు. ఓ చెంప లగ్నం దగ్గర పడిపోతోంది. ఏ సమయంలో ఎలాటి కబురు వినాల్సి వస్తుందో అని సుజాత శరీరంలో నరనరం ఒణికిపోతోంది. పెళ్లి ఏదో కారణంచేత తనే ఆపేస్తే బాగుండుననిపిస్తోంది. అందుకే ఎలాగో అన్నగార్కి చెప్పేసింది.

సుజాత మాటలు సుధాకరం చెవిని పడినట్లు లేదు. అతను మామూలుగానే ఉన్నాడు. మధ్య మధ్య మటుకు ఏదో గుర్తు వచ్చినవాడిలా 'శాంతా —సుజాత ఏదీ? ఏం చేస్తోంది' అని మటుకు అడిగేవాడు. అలా అడగటంలో ఓ కన్ను—చెవి చెల్లెలివైపున్నాయని అర్థం అయేది. శాంత కసలు సుజాతవైపు కళ్లెత్తి చూసే తీరుబడి కూడా లేదు. సుజాత అనుకున్నట్లుగా ఈ పెళ్లి ఆగేట్లు లేదు. ఉరిశిక్ష దగ్గర పడుతున్న ఖైదీ గుండెల్లా సుజాత బిగపట్టుకుని ఆ క్షణం కోసం ఎదురుచూస్తోంది.

అలా బిగపట్టుకుని చూస్తుండగానే ముహూర్తం దగ్గర పడింది. పెళ్లికొడుకు తరలివచ్చాడు. మంగళ వాయిద్యాలు మోగినాయి. ఇద్దరిమధ్య అడ్డుగా పురోహితులు పట్టుకున్న సన్నటి తెర జారిపో యింది. ఎదురుగా తెల్లగా, పొడుగ్గా, పసుపు బట్టల్తో ఆరోగ్యంగా, బలంగా ఉన్న చేతుల్తో మంగళసూత్రం పట్టుకుని శేఖరం నిలబడ్డాడు. క్షణంసేపు సుజాత కళ్లెత్తి చూసింది. అతని కళ్లల్లో పెదవులమీద చిరు దరహాసం మెరిసింది అప్పటికే నీళ్లు నిండిన సుజాత కళ్లు క్రిందకు వాలిపోయినాయి. పురోహితులు గొంతెత్తి మంత్రాల చదివారు. 'సీతమ్మ పెళ్లికూతు రాయెనే' అని బిగ్గరగా బాండ్‌మేళం పాడింది. శేఖరం చేతులు సుజాత మెళ్లో మూడు ముళ్లూ వేసేసినాయి. సుజాత చెవులకి మేనత్త తిట్లు, శాపనార్థాలు వెయ్యి కంఠాలతో మంత్రాలఘోషగా విన్పిం చాయి. మిగతా తతంగం ఎలాగో పూర్తి అయింది అప్పించి తడబడుతున్న అడుగులతో తూలిపోతున్న శరీరంతో సుజాత వదినగారి సాయంతో లోపలకు వెళ్లిపోయింది.

భోజనా లయింతర్వాత పూజ గదిలో కూచుని విశ్రాంతి తీసుకొంటున్న పెళ్లికూతురి దగ్గరికి శేఖరం బామ్మగారు వచ్చి కూర్చుంది ఆవిడ మొహం ఆనందంతో యింత చేసుకుని 'వాడికీ జన్మలో అసలు పెళ్లే కాదనుకున్నానే అమ్మాయి నాకేం తెలుసు భగవంతుడు నిన్ను పుట్టించి యీ మారుమూల పెట్టాడని, దానికోసం వెర్రి సన్నాసి దేశాలన్నీ గాలిస్తున్నాడని' సుజాత అంటే ఆవిడ కెంత తృప్తి, సంతోషం కలిగాయో ఆనం దంతో తెరుచుకున్న ఆ బోసినోరే చెప్తోంది

'మళ్లీ ఈ రోజులకి ముని మనవణ్ణి యివ్వక పోయావంటే చూసుకో నీపని చెప్తా.'

బొమ్మలా కూర్చున్న సుజాత ఆవిడవైపు పెద్ద పెద్ద కళ్లు చేసుకుని చూడసాగింది. రేపు శేఖరానికి ఏదన్నా అయితే యీవిడ మొహం ఎలా మారిపోతుంది? ఇప్పుడు కన్పిస్తున్న ఈ సంతోషం —తన పాలిట మళ్లీ శాపంగానో, ద్వేషంగానో మారి పోతుంది కాబోలు. ఆలోచించి చూస్తే అదృష్టా నికి దురదృష్టానికి వెంట్రుకవాసి తేడా, అంతే అది గ్రహించినవాళ్లకే తెలుస్తుంది

సాయంత్రం దంపతు లిద్దరూ సుధాకర్‌కి నమస్కరించటానికి వెళ్లారు. వాళ్లు సాంతం వంగకుండానే ఇద్దర్నీ చెరో చేత్తో లేవదీస్తూ చెల్లెలి చేతిని శేఖరం చేతిలో పెడ్తూ 'శేఖరం, నా చెల్లెలి మనస్సు శరీరంకంటె సుకుమారం. అపరూపం గూడాను' అన్నాడు.

'అపురూపమైన వస్తువుల్ని ఎంత జాగ్రత్తగా చూసుకోవాలో నాకు తెలుసులే సుధాకర్' అన్నాడు శేఖరం నవ్వుతూ. అతని నవ్వు పరధ్యానంగా ఉన్న సుజాతనిపట్టి యీ లోకంలోకి తెచ్చి మరీ గిలి గింతలు పెట్టింది. దూరంగా నిలబడ ఎవరో

'ఈడూ జోడూ చక్కగా కుదిరింది కన్నుం పండువగానుంది' అనటంతో సుజాత చటుక్కున తల తిప్పి అటువైపు చూసింది.

చూస్తుండగానే కలలోలా అన్నీ జరిగిపోయి వాయి.

## నాకి పెళ్లి వద్దు

శేఖరానికి ఎక్కువగా శలవు లేకపోవటంవల్ల వెంటనే వెళ్లిపోవాల్సి వచ్చింది. ఆరాత్రి సుజాతని దగ్గరకు లాక్కుంటూ 'పెళ్లికూతుళ్లని వెతుక్కోవటంలోనే నా శలవులన్నీ అయిపోయినాయి. తీరా పెళ్లికూతురొచ్చేసరికి శలవే లేదు చూడు' అన్నాడు నవ్వుతూ.

ఎక్కడో పుట్టి ఎక్కడెక్కడో ప్రవహించి—ఏ మారుమూలలగా ఉన్న సముద్రాన్నో వెతుక్కొని అందులో వెళ్లి ఐక్యమైపోయిన మహానదిలా సుజాత శేఖరంలో కలిసిపోయింది. నిన్నటి సుజాత బెరుకుతనం, సంకోచం అన్నీ పోయినాయి. అతని పక్కన నిలబడ్తే అదో అందమైన అనుభూతి తప్ప యింకేం కన్పించటంలేదు.

"ఉండుండి అలా ఏదో పోగొట్టుకోబోతున్న దానిలా బేల చూపులు చూస్తావేం ?" సుజాత భుజాల చుట్టూ తన చేతులో పెన వేస్తూ అడిగాడు శేఖరం.

ఇన్నాళ్లు ఈ అమ్మాయి లేకుండానేనెలా గడిపాను ? అని అన్పిస్తోంది అతనికి. అతని ప్రతి కదలికలో, ప్రతి స్పర్శలో సుజాత పట్ల అనురాగం తొణికిసలాడ్తోంది.

"మాట్లాడవేం ? నిన్ను నాతో తీసుకెళ్లిపోవా లనుకుంటున్నాను. రావటానికి నీ కిష్టమేనా ?" ఎందు కలా చూస్తావు ? నేనేం నీలా బొమ్మలా లేనుగా" తన జుట్టువంక, కనుబొమల వంక, పెదవులవంక పరిశీలనగా కన్నార్పకుండా చాలాసేపటినుంచి చూస్తున్న భార్యని వంగి కళ్లమీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు. సుజాత చప్పున కళ్లు మూసుకుంది. అతని పెదిమల కుండే స్పర్శ కళ్లను తాకి లోపల నరాల్లోకి విద్యుత్తులా ప్రవహించినట్లుగా ఉంది సుజాతకి.

'ఈ కళ్లే నన్ను ఆకట్టుకున్నాయి. నీ మనసు దేనికి స్థానమో నే నింకా గ్రహించలేదు గాని—కళ్లు మటుకు అందాలకి ఆలయాలు." చూడు. నాకు తెలియని భావాలకి భాష గూడా నేర్పుతున్నాయి." నుదుటిమీద పెదవులో తాకుతూ అన్నాడు.

'ఛ ! కాటుక !' సుజాత చప్పున కొంగుతీసి శేఖరం పెదవులకి అంటిన కాటుక తుడిచేసింది.

ఆ రాత్రి తన్నెలా సమాధాన పరచాలో—బామ్మగారి నెలా సంతృప్తిపరచాలో వివరంగా సుజాతకి కొత్త జీవితాన్ని గురించి పాఠాలు చెప్పాడు శేఖరం. అతను చెప్తున్న ప్రతి మాటని శ్రద్ధగా ఆలకించింది సుజాత.

"మర్నాడు సుజాతని తీసుకెళ్తానన్న శేఖరాన్ని చూసి "ఇంత త్వరగానా ? ఒక్క నెలరోజు లుంచగూడదూ ? పోనీ కనీసం 20 రోజులు" అడగలేక అడగలేక అడుగుతున్న సుధాకరాన్ని చూసి శేఖరం ఏమనుకున్నాడో 15 రోజుల తర్వాత వచ్చి తీసుకెడ్తానని చెప్పి వెళ్లిపోయాడు.

వచ్చిన చుట్టాలంతా వెళ్లిపోయారు ఇల్లంతా నిశ్శబ్దంగా అయిపోయింది. పెళ్లి తాలూకు సువాసనలు యింకా యింటిని వదిలిపోలేదు. ఏమూల చూసినా పెళ్లి తాలూకు ఏదో చిహ్నం కన్పిస్తోంది సుజాత మనసులో భావాలు ద్వంద్వ యుద్ధం మొదలుపెట్టినాయి. ఒక్కోసారి ఇదంతా అబద్ధం. తనేదో భ్రమలో పడి కొట్టుకుపోతున్నా ననిపిస్తోంది. కాని మరు క్షణంలోనే శేఖరంతో గడిపిన క్షణాలు అనుభూతులుగా మారి మనసంతా ఆనందడోలికల్లా వూగుతా నంటున్నాయి. తన వేలికున్న దానిమ్మగింజ రంగు రాయి ఉంగరం చూసినపుడల్లా అందులోంచి నవ్వుతున్న శేఖరం

మొహం కన్పిస్తోంది.

శేఖరం వెళ్లిన మూడోరోజునే ఉత్తరం వచ్చింది. అందులో తనకేం తోచటంలేదని, క్షణం యుగంలా ఉందని, ఏ నిమిషంలోనైనా వచ్చేయ్యగలవని రాశాడు. సుజాతకి అతని ఉత్తరం మరో కొత్త లోకం ఏర్పరిచింది.

'ఏమ్మా ? ఈ పెళ్లి అసలు వద్దే వద్దన్న మనిషివి గదూ ! అలా తహతహ లాడిపోతున్నావు ?' నాలుగోరోజు మళ్లీ ఉత్తరం కోసం ఎదురుచూస్తున్న సుజాతని శాంత వెక్కిరించింది.

'ఫో ! వదినా !' తెచ్చిపెట్టుకున్న కోపంతో సుజాత అక్కడ్నుంచి లేచి వెళ్లిపోయింది. కాని లేచి యివతలకు వచ్చేసిన వెంటనే మనసు ఎలాగో అయిపోయింది. తనా అఘాతం దాటి వచ్చెయ్యలేదూ ? వచ్చేసే గదా శేఖరం చేయి అందుకుంది. యేమో ! యెవరు చెప్పగలరు ? ఈ సంతోషం. ఈ పట్టలేని ఆనందం దేనికన్నా సూచనలేమో ! అనుకుంటుండగానే సుజాత మొహం వివర్ణమై పోయింది. అసలు శేఖరాన్ని పొందకుండా ఉంటే అదోమాట గాని. ఒకసారి పొంది మళ్లీ పోగొట్టుకోవాలంటే ! క్షణంసేపు సుజాత గుండెలు తెలియని భయంతో వణికినాయి.

'ఎక్కడ మువ్వా ? ఇదుగో ఉత్తరం వచ్చింది. బైటికి రా—' బైటనుంచి వినిపిస్తున్న శాంత మాటలకి సుజాత హృదయం ఎగిరి గంతేసింది. కాని ఆ చైతన్యం శరీరంలోకి రాకుండా జాగ్రత్తపడి మామూలుగా, మెల్లగా యివతలకు వచ్చింది.

ఇదుగో—నీ ఉత్తరం. మీ అన్నయ్యే పేరిట గూడా రాశారు" శాంత ఆ ఉత్తరం చింపుతూ అంది.

గదిలోకి వచ్చేసి కూర్చుని ఉత్తరాన్ని ఒకటికి రెండుసార్లు చదువుకుంది. అందులో సారాంశం బామ్మగారు కూడ సుజాతని తీసుకురమ్మనమని గోల చేస్తోందిట. తనకీ ఏమీ తోచటంలేదుట. శనివారం రాత్రికి తన స్వంతకారులోనే వచ్చేస్తున్నాట్ట. తిరిగి సోమవారం ఉదయం ఇద్దరూ కలిసి హైదరాబాద్ వెళ్లిపోవాలిట. అదే విషయం సుధాకర్‌కి గూడా రాస్తున్నానని రాశాడు. దోవలో తను ఎక్కడెక్కడ ఆగేది, ఏఏచోట్ల సుజాతని గురించి ఆలోచించేది వివరంగా గుర్తుపెట్టుకుని వచ్చేటప్పుడు ఆయాచోట్లు చూపిస్తానని రాశాడు. ఉత్తరం చాలా వివరంగా విశేషాలతో, అలంకారాలతో మృదుమధురంగా ఉంది.

అసలు దేనికోసమూ ఎదురుచూడగూడదు. అలా చూడటం మొదలుపెడ్తే కాలమే ఆగిపోయినట్లనిపిస్తుంది. సుజాతకి ఈ జన్మలో శనివారం అనేది రాదనిపించింది ఎలాగైతేనే వచ్చింది. సాయంత్రం అవనూ అయింది. స్నానంచేసి బట్టలు వేసుకుని అలంకరణ కోసం నిలువుటద్దం ముందు కూర్చున్న సుజాతకి అద్దంలో తన ప్రతిబింబానికి బదులు శేఖరం మొహం కన్పించి చిలిపిగా నవ్వి కవ్విస్తోంది. శేఖరం తనెదుట లేకపోయినా అతన్ని ప్రత్యక్షంగా చూస్తున్నట్లుగానే ఉంది. ఒక్కోసారి వూహ మనిషిని ఎంత పిచ్చివాణ్ని చేస్తుంది!

జడ వేసుకోవటం పూర్తయి ఒకసారి పెట్టుకున్న పూలే సరిగ్గా కుదరలేదని తీసేసి మళ్లీ పెట్టుకుంటుండగా వెనకనుంచి శాంత వచ్చి ఏవమ్మోయి. ఇంకా నీ సింగారం పూర్తికాలేదా ? **అతనికి అన్నంలోకి ఏం చెయ్యమంటావు' అంది.**

"పో వదినా ! నాకేం తెలుస్తుంది." కృత్రిమ కోపంతో పెదవులు ముడుచుకుంటూ అంది సుజాత.

"లేకపోతే నాకు తెలుస్తుందా ? మరి గంటలు గంటలు గదిలో కూర్చుని చెప్పుకున్న ఆ ఖబుర్లన్నీ ఏమిటో ?"

సుజాత ఫక్కుమని నవ్వింది. 'బావుంది. అయితే నీకేం కూర యిష్టం. ఏ పులుసు యిష్టం. ఇవేనా ఖబుర్లు ?'

"కాక ? ఏమోనమ్మా, నాకేం తెలుస్తుంది. మీ అన్నయ్య నన్ను మొట్టమొదట అడిగిన మాట నీకు గుత్తి వంకాయ కూర వచ్చునా అనే ?' గాంభీర్యం తెచ్చిపెట్టుకుని అంటున్న వదినగారి మాటలకి సుజాత కిలకిలా నవ్వేసింది. ఖంగుమన్న ఆ నవ్వులో మనసులో పొంగుతున్న సంతోషం కట్టలు తెంచుకుని ప్రవహిస్తోందని స్పష్టంగా తెలుస్తోంది

'ఏమిటి. వంకాయకూర అంటున్నావు ?' అప్పుడే సుధాకరం లోపలికి వస్తూ అడిగాడు.

'ఏంలేదు. అన్నంలోకి ఏం చెయ్యాలో సుజాతని సలహా అడుగుతున్నాను..' శాంత లోపలకు పారిపోయింది.

'ఓహో ! ఇదెప్పటినుంచి' అన్నాడు సుధాకరం వస్తున్న నవ్వు పైటచెంగులో దాచేసుకోవటానికి ప్రయత్నిస్తున్న చెల్లెలివంక చూస్తూ.

'ఏమ్మా ? నీపని కాలేదూ ! అతను వచ్చే వేళయింది. ఇంకో గంటలో వచ్చెయ్యెచ్చు' అంటూ సుధాకరం బైట కెళ్లిపోయాడు.

సుజాత మళ్లీ అద్దంవైపు తిరిగింది. ప్రతిబింబంతో మళ్లీ సంభాషణ మొదలైంది. అవును. వదినమాటలు నిజమె. ఈసారి అతనికి యేవేమి యిష్టమో అన్నీ అడగాలి. రంగులు కూడ. యే రంగు చీరలు యిష్టమో తెలుసుకోవాలి. తెలుపు అతనికి యిష్టం ఉంటుందో వుండేదో. కట్టుకున్న తెల్లచీరవంక చూసుకుంటూ అనుకుంది.

ఎలాగో 7 గం. అయింది. హాల్లో గడియారం గంటలు కొట్టింది. సుజాతకి హెచ్చరికచేసేసి, మళ్లీ తనపని చూసుకోసాగింది. ఆ గంటలు విన్నప్పట్నుంచి సుజాతకి కూర్చో బుద్ధికావటంలేదు. మాటిమాటికి బైటికి తొంగిచూస్తూ. కారుహారన్‌కోసం ఒళ్లంతా చెవులు చేసుకునివింటూ ఇంట్లో అటుయిటు తిరగసాగింది. తలనిండా సువాసనల్ని విరజిమ్ముతున్న మల్లెపూవులతో, వాటికి పోటీ పడుతున్నయా అనేంతటి తెల్లటి బట్టల్లో, కళ్లనిండా మెరుపులు కురిపిస్తూ, యేదో తెలియని చైతన్యంతో కదిలిపోతూ అటుయిటు తిరుగాడుతున్న సుజాతని చూస్తుంటే సుజాతలో యింత సౌందర్యంవుందా అని శాంతకే ఆశ్చర్యం వేసింది.

మాటిమాటికీ గడియారం చూస్తూ, బైటకు అసహనంగా చూస్తున్న ఆడబడుచుని వేళాకోళం పట్టించా లనిపించింది శాంతకి.

"యేమిటి ? అలా కాలుగాలిన పిల్లలా యిల్లంత కలియచేస్తున్నావు? ఆ మాత్రం ఆలస్యం కాకపోతే అందం యేముందిలే—అసలింతకీ బైలుదేరాడో లేదో.

"ఛీ — ఛీ — అలా అనకు వదినా. నాకు ఉత్తరం రాసి ఎలా రాకుండా ఉంటారు?" ప్రపంచంలో యిదెక్కడన్నా సంభవమా అన్నట్లు చూసింది సుజాత.

"యేమో, మామూలు మనిషా ? అనుకోగానే బైలుదేరేందుకు ? అధికారంగల ఆఫీసరయ్యె. యేక్షణంలో యే అవసరంఅయినా రావచ్చు. ఆగిపోవచ్చు."

"పోవదినా. అవున్లే — నీకు తమాషాగా వుంది కదూ — సర్లే — నిజంగా రారేమో — నీవంటలన్నీ తినుకెళ్ళి అవతలపారెయ్యి." పాపం యిందాకట్నుంచి కష్టపడి చేశావు.' కోపంగా సుజాత అక్కడనుంచి లేచిపోయింది.

"బావుంది. ఆయనగారు రాకపోతే మానొళ్లేమైనాయి. మధ్య మమ్మల్ని పస్తులు పడుకోమన్నావా యేమిటి ?" శాంత నవ్వుతూ వెళ్లిపోయింది.

వదినగారిదగ్గరనుంచి లేచివచ్చేసిన సుజాతకి అనుకోకుండా కళ్లలో నీళ్ళు తిరిగాయి. నిజమే! ఒకవేళ అతను నిజంగా రాకపోతే. వస్తాడని మనసు గట్టిగా చెప్తోంది యేమో. వదినన్నట్లు హఠాత్తుగా ఏ అర్జంట్ పనైనా తగిలితే ? హఠాత్తుగా సుజాతకి ఆరాత్రి ఆ నిశ్శబ్దం — తనలా ఎదురు చూడటం అంత చప్పగా అన్పించింది. ఏదో తెలియని నీరసం గుండెల్లో ప్రవేశించి వుత్సాహాన్నంతా లాగేసింది. అసలివాళ తనింత అలంకరణ చేసుకుందెందుకు ? అన్నయ్యా—వదిన చూస్తున్నారనే సిగ్గు కూడా లేకుండా. ఛీ—ఛీ—తను సామాన్యంగా యెందుకుండలేదు. ఒకవేళ అతనొస్తే — ఏ అలం



కరణాలేక ఉదాసీనంగావున్న తననిచూసి యేమను కుంటాడు ? నే రావటం అనేది ఈ అమ్మాయికి యేమంత గొప్పవిషయంగా లేదుకాబోలు అనుకోడు? వస్తూనే మొదటిచూపులోనే అతనిమనసు నొప్పించడం కాదూ ! తల్లోంచివద్దు తీసేద్దాం అనుకుంటున్న పూలని సుజాతచేతులు ఈ ఆలోచన రాగానే మళీ అలాగే ఉంచేశాయి.

## నాకీ పెళ్లి వద్దు

ఇంతలో వాకిట్లోంచి 'సుధాకరం' అన్న పిలుపు విన్పించింది.

"యెవరు ?" అంటూ యివతలకు వచ్చింది సుజాత.

వచ్చింది రంగధామం. 'అన్నయ్య ఉన్నారమ్మా?' అన్నాడతను కొత్తఅలంకరణతో రాత్రిరాణిలా మెరిసిపోతూ వచ్చిగుమ్మంలో నిలబడి సుజాతని చూస్తూ.

'ఉన్నారు. పిలుస్తాను. కూర్చోండి' వరండాలో వున్న కుర్చీచూపించి వెనక్కుతిరిగి లోపలకు వచ్చేస్తుండగా 'యెవరు' అంటూ ఇంతలో సుధాకంమే బైటకొచ్చాడు.

'కాలేజికి ట్రంక్‌కాల్ వచ్చిందోయి. శేఖరం కారు యాక్సిడెంట్ అయిందిట.'

ముందుకి అడుగులువేస్తున్న సుజాత చటుక్కున ఆగిపోయి గిరుక్కున వెనక్కు తిరిగింది.

'బెజవాడకి 30 మైళ్ళ దూరంలోనే. కారే దయినా పంపించాలి'

'కారా ? యాక్సిడెంటా ? శేఖరం వంగలేనా నువ్వుచెప్పేది' ఖంగారుగా అన్నాడు సుధాకరం.

గుమ్మందాకా వచ్చిన సుజాత స్థాణువులా నిలబడిపోయింది. ప్రపంచం అంతా గిర్రున తిరిగి నట్టయింది. ఏదో తెలియనిశక్తి సుజాతకిని తేలిక చేసేసి భూమ్మీదనుంచి ఆకాశంలోకి విసిరేస్తోంది. శూన్యంలో గిరగిరతిరుగుతున్న సుజాతనుంచి తల్లో పూలు వంటిమీద బట్టలు. విడిపోయి భూమ్మీదకి రాలిపోతున్నాయి. గుమ్మాన్ని చేత్తో గట్టిగా పట్టు పట్టుకున్న సుజాతకి తను కెవ్వుమనటంగాని — రంగధామంతో మాట్లాడుతున్న అన్నగారు త్రుళ్లిపడి గబగబా వెనక్కువచ్చి పడిబోతున్న తనని చేతుల్లో పట్టి ఆపటంగాని సుజాతకి తెలియదు.

సుజాతకి మళ్లీ మెలకువ వచ్చేసరికి తను మంచంమీదున్నట్లుగా యెవరో తలవైపు కూర్చుని తన మొహంమీదకి వంగి ఆదుర్దాగా పరిశీలిస్తున్నట్లుగా తోచింది. 'వదినా' అస్పష్టంగావున్న పోరం మధ్య తళుక్కుమన్న ఒంటిరాయి ముక్కుపుడకని చూసి తనదగ్గర కూర్చున్నది వదినగారని గ్రహించిన సుజాత మెల్లగా నీరసంగా అంది:

'మెలకువ వచ్చిందా' మృదువుగా అడిగింది శాంత.

తనకేమైంది ! సుజాతకి గుర్తొచ్చింది యాక్సిడెంట్ అయిందని ట్రంక్‌కాల్ వచ్చిందని మరో కారు పంపించాలని చెప్తున్నాడు. మరీ కారుపంపించాలంటే మనుష్యులు బాగా గాయపడ్డారన్నమాట. శేఖరానికి యెలావుందీ తనెవర్ని అడగాలి ?

'పూర్తిగా మెలకువవస్తే— లేచి కొంచెం వేడి వేడి కాఫీతాగు. ఖంగారుపడకు. అన్నయ్యకారుతీసుకునివెళ్లి చాలాసేపయింది. ఈ పాటికి తిరిగివచ్చేస్తుండవచ్చు' సుజాత ధైర్యం చెప్తున్నట్లుగా దగ్గరకు వంగి చెప్పింది.

"చాలా సేపయిందావెళ్లి అన్నయ్య' అస్పష్టంగా అంది సుజాత. అంతకంటే యేం అడగాలో తోచలేదు. తన దురదృష్టాన్ని యీపాటికి కారులో వేసుకుని సుధాకరం తిరిగివస్తుండచ్చు.

"ఊ" ! అంతకుమించి చెప్పదల్చుకోలేదులా ఉంది శాంత. 'నువ్వులేచి కాఫీతాగు. కాస్త ప్రాణం వచ్చినట్లుంటుంది'. సుజాత కళ్లనించి ప్రక్కలకి వెచ్చగాకారిపోతున్న నీళ్లని చేత్తో తుడుస్తూ అంది శాంత. తన మనసుగూడ యెలాగోవుంది. ఇందాక తమాషాకే అతను రాలేదేమో అని తను యెగతాళి చేసింది. యెన్నడూలేంది తననోటినుంచి అలాటి పరిహాసం యెందుకు వచ్చిందివాళ ?

సుజాత లేచి కూర్చుంది.

'ఇంకానేవు పడుకో అప్పుడే లేవకు.' అంటూ గారిస్తున్న వదినగారిని లక్ష్యపెట్టకుండా "నేనప్పుడే యీ పెండ్లి వద్దనిచెప్పలేదు ? మీరెవరూ నా మాట వినలేదు— నాకుతెలుసు. అత్తయ్యనాట [illegible] " [illegible] మొదలుపెట్టింది సుజాత.

'ఇది మరీబాగుంది. యేమిటా పిచ్చిమాటలు' మందలించింది శాంత.

'మొదట్నుంచి నా మాటలు మీరలాగే తోసేశారు. నాకు తెలుసుఒదినా. నాక్షోభ. నా భయం. మీరిప్పుడు ఆలోచించలేరు. లేకపోతే యిన్నిదేశాలు కారులో తిరిగిన మనిషికి యీ యాక్సిడెంట్ యేమిటి ? నా దురదృష్టం కాబోతే. నువ్వు— అన్నయ్యకలిసి అతన్ని మోసంచేసి నన్ను అతనికి అంటగట్టారు.' వెక్కిళ్లతో సుజాత పక్కలు కదిలిపోతున్నాయి.

అర్థంలేని యీమాటలకి యేంజవాబు చెప్పాలో శాంతకి తోచలేదు. అవతలగదిలోంచి పిల్లాడి యేడుపు విన్పించటంతో లేచివెళ్లింది. ఒంటరిగా శూన్యంలో మిగిలిపోయిన సుజాతకి దుఃఖం మరింత కట్టలు తెంచుకుని ప్రవహించింది. ఎన్ని అనుకుంది తను ? అతనికి యెన్నిచెప్పాలనుకుంది! ఈ పదిరోజుల్లో అతనితో తను గడపబోయే జీవితాన్ని గురించి యెన్నికలలుకంది ! అసలీవిషయం యెలా మర్చిపోగలిగింది ? అసలు పెళ్లయింతర్వాత

"ఇంతకీ ఏక్సిడెంట్ జరిగి నప్పుడు నువ్వు అక్కడఉన్నావ్ ఎందుకు?" (ఏక్సిడెంట్ ఫొటో తీసిన అతనికి పోలీసు ఇన్‌స్పెక్టర్ ప్రశ్న.)

"ఆ స్టార్ ఫొటో తీద్దామని వెళ్లాను."

పి. రామన్న (కైలాసం)

అతనివెంట వుండకుండా తను దూరంగా యెందుకుంది? తనకోసం ఆత్రంగా [illegible] పడి దెబ్బలుతినడం. భగవాన్ ! రక్తపు మడుగులో తేలుతున్న శేఖరం సుజాత కళ్లముందు మెదిలాడు

ఇంతలో మళ్లీ గదిలో అడుగులచప్పుడు విన్పించింది. సుజాత తలెత్తకుండానే మరింత యేడుస్తూ వదినా ! అన్నయ్య యింకా రాలేదేం ? వెంటఅసలు నన్ను తీసుకెళ్లకుండా యెందుకెళ్లాడు.? నేనేం య్యేనూ. అంటూ అస్పష్టంగా అంది.

బలంగా వున్నచెయ్యి మృదువుగా సుజాత చేతిమీద పడింది.

'అన్నయ్యా' స్పర్శతో వులిక్కిపడి తలెత్తి చూసిన సుజాత కొయ్యబారిపోయింది. తను చూస్తున్నది వాస్తవమో అబద్ధమో అర్థంగాలేదు. యెదురుగుండా నలిగిన బట్టల్తో, చెదిరిపోయిన జుట్టుతో, కొంచంగా అలసటగా. అయినా నవ్వుతూ శేఖరం నిలబడివున్నాడు.

'సుజాతా' అతనికంఠం బరువుగా జీరుగా విన్పించింది.

'మీరా' ఇంకా తనకళ్ళు తనని మోసం చేస్తున్నాయేమో అనే అనుమానంతో [illegible] [illegible] లేదు

'నేనే. దాదాపు మృత్యుముఖంలోకి వెళ్ళి వెంట్రుకవాసిలో తప్పించుకుని బైటపడివచ్చాను.' మంచంమీద కూలబడ్తూ అన్నాడు శేఖరం. సుజాత అతని ఒళ్లో వాలిపోయింది. ఒకవేళ యిది కలే అయితే, తనమతి భ్రమిస్తే అది శాశ్వతంగా వుండిపోవాలనిపిస్తోంది సుజాత మనస్సుకి.

'మీరేనా ! మీరేనని— యిది నిజం అని చెప్పండి' శేఖరంచేతిని గట్టిగా రెండు చేతుల్తో పట్టుకుంటూ అంది.

సుజాత మాటలకి జవాబుగా శేఖరం తలనిమురుస్తూ వుండిపోయాడు. అతనికళ్లలోగూడ నీళ్లు తిరిగాయి. ఎవరిదో కంఠం విన్పించటంవల్ల కాబోలు బాబుకి పాలిస్తున్న శాంత అలాగే లేచివచ్చింది. వస్తూనే గుమ్మంలోపల్నుంచి కన్పిస్తున్న దృశ్యం చూసి తెల్లబోయి గబగబా పైటచెంగు సరిచేసుకుంది.

గుమ్మంలో కన్పించిన శాంతనిచూసి శేఖరం నవ్వాడు. లేచి నిలబడటానికి వీల్లేనంత గట్టిగా పెనవేసుకుని ఒళ్లోవుంది సుజాత.

"నా కళ్లని నమ్మలేకపోతున్నాను" అంది శాంత లోపలికివస్తూ.

సమాధానంగా శేఖరం నవ్వుతూ "నేనూ అంతే. మిమ్మల్నంతా మళ్లీ యిలా చూస్తాననుకోలేదు. అదృష్టంకొద్దీ బైటపడ్డాంగాని. కారు తుక్కు తుక్కు అయింది."

శేఖరం చెప్పడం మొదలుపెట్టాడు. కారు కాళీగానే వస్తోందికదాని తెలిసినవాళ్లు వస్తోంటే వాళ్లని గూడా యెక్కించుకొచ్చాడట. అప్పటివరకూ అతనే డ్రైవ్ చేశాట్ట. కొద్దిగా అలసటఅన్పించి వెనక కూర్చున్న వాళ్లలో డ్రైవింగ్ బాగా తెలిసిన అతన్ని స్టీరింగ్ తీసుకోమన్నాట్ట. అని తను వెనక కూర్చున్నాడు. ఆ కూర్చోవటంలో బాక్‌డోర్ సరిగ్గా పడలేదు. ఆ పడకపోవటమే శేఖరం క్షేమంగాతిరిగి రావటానికి కారణంఅయింది. యెదురుగుండా వస్తున్న లారీని తప్పించటానికి ప్రక్కకుతిరిగిన ఆతనుమరీ రెండు సైకిళ్ళు అడ్డురావటంతో అవిరెండూ అడ్డదిట్టంగా రోడ్డుమధ్య పరిగెత్తటంతో వాటిని తప్పించుకోవటంలో కారువెళ్లి పక్కనున్న చెట్టుకి గుద్దుకుంది. అంతాక్షణంలో జరిగిపోయింది. వెనక కూర్చున్న శేఖరం మరోఅతను తలుపుసరిగ్గా పడకపోవటంతో విసిరేసినట్లువెళ్లి అంతదూరానపడ్డారు. డ్రైవింగ్‌సీటులో కూర్చున్న అతను మటుకు చెట్టుకి గుద్దుకుని తలక్రిందులయిన కారులో యిరుక్కుపోయాడు. అతనికిమటుకు బాగా గాయాలు తగిలినాయి.

శేఖరం చెప్తున్నదానిని సుజాత, శాంత యిద్దరూ వూపిరిపీల్చటం మర్చిపోయి వింటున్నారు.

అదృష్టవశాత్తు అక్కడికో అరమైలు దూరంలో చిన్న ఊరువుంది అక్కడికెళ్లి, అక్కడున్న బ్లాక్ డెవలెప్‌మెంటు ఆఫీసులోనుంచి బెజవాడకి ఫోన్ చేశారు. సుధాకరం కారు తీసుకుని వచ్చేసరికే బ్లాక్ డెవలప్‌మెంట్ ఆఫీసర్ మరి ముగ్గురి సాయంతో కారు సరిదిసి దెబ్బతిన్న అతన్ని యివతలకు లాగారు. అతనికి ఒంటిమీద స్పృహ లేదు. హాస్పిటల్లో చేర్పించి వచ్చారు

# నాకి పెళ్లివద్దు

'పాలేరి' అంది శాంత. సుధాకరాన్ని గురించి అడుగుతూ.

'నాతోపాటు వెనక కూర్చున్న అతన్ని ఇంటి దగ్గర దించి కారు యిచ్చేసి రావటానికి వెళ్లాడు.

వదిన వచ్చింది. లేచి సరిగ్గా కూర్చోవాలని కొస్సేపు అన్పించింది సుజాతకి. కాని లేచేందుకు వోపికే లేకపోయింది.

ఇంతలో సుధాకర్ వచ్చాడు 'సుజాత లేచిందా? యెలా ఉంది' అంటూ.

'రంగధామం వచ్చి యాక్సిడెంట్ అయిందన గానే నిలబడ్డది నిలబడ్డట్లే విరుచుకు పడిపో యింది' శేఖరంతో అన్నాడు.

'అలాగా. నాకు చెప్పనే లేదు '

'ఏం చెప్పమంటావు ? నిన్ను సవ్యంగా చూసిం తర్వాత కాని నా మతి నాకు తిరిగి రాలేదు'' అంటూ శాంతవైపు తిరిగి ''ఏమే ? వేడునీళ్లు స్నానాని కున్నాయేమో చూడు. స్నానం చేస్తేగాని కొస్త ప్రాణం రాదు' అన్నాడు శాంత లోపలికి వెళ్లిపోయింది.

'అబ్బ ! ఇవాళ లేచి ఎవరి ముఖం చూశామో గాని అందరం అదృష్టవంతులం' ఏదీ పిల్లలు కాస్త కాఫీ అయినా యిచ్చిందా నాకు ' అని 'శాంత' అని పిలుస్తూ సుధకర్ లేచి లోపలకు వెళ్లాడు.

ఆ రాత్రి పడుకోబోతుండగా 'ఇంకా ఎందుకు అలా మాటిమాటికీ కళ్ల నీళ్లు పెట్టుకుంటావు? నేను క్షేమంగానే తిరిగి వచ్చేశానుగా' అన్నాడు శేఖరం సుజాతని దగ్గరకు లాక్కుంటూ.

''మీరు ఆడపిల్లయితే అప్పుడు తెలిసేది మీకు'' కన్నీళ్ల మధ్య నవ్వుతూ అంది సుజాత.

''అబ్బో ! అలాగా నే నాడపిల్లయితే నువ్వు మగ పిల్లాడుగా పుట్టద్దూ మరి.' అన్నాడు శేఖరం.

''నిజంగా. నా కేదో పీడ కల జరిగిపోయినట్లని పిస్తోంది.' భర్త చేతుల్లో ఒదిగిపోయి గుండెల కంటుకుపోతూ అంది.

''నే నిలా తిరిగి రావటం కేవలం నీ అదృష్టమే సుజాతా. తిరిగి వస్తుంటే నా కదే అన్పించింది. భగవంతు డెప్పుడు చాలా మంచివాడని బామ్మ అంటూ ఉంటుంది. ఇలాటి భార్య నిచ్చి జీవితం లేకుండా చేస్తే ఏమై పోవాలి నేను ?' సుజాత నుదుటిమీద ముద్దు పెట్టుకుంటూ అన్నాడు.

''నిజమే ! నేను అదృష్టవంతురాలినే ! ఆ నమ్మ కము నాకు యిప్పుడు ఏర్పడింది. ఇకనుంచి మీరు క్షణం గూడా నన్ను వదలద్దు. మీరు ప్రక్క నున్నప్పుడు ఎంతో అందమైన భావాలని రే గించే వూహ మీరు లేకపోతే నాకు నరకాన్ని చూపి స్తుంది. నే నది భరించలేను.'' ఆగిఆగి అస్పష్టంగా అంది సుజాత, తనని బలంగా చుట్టేసిన భర్త చేతుల్లో మరింత ఒదిగిపోతూ.



# శ్రీ దేవి

27-వ పేజీ తరువాయి

శ్రీదేవి మరునాడు మధ్యాహ్నం పన్నెండు గంటలకే రిక్షా వేయించుకొని సుభద్రమ్మఇంటికి వెళ్ళింది. ఆరోజు ఆమె వెళ్ళేసరికి కృష్ణమూర్తి ఇంట్లోలేడు. సుభద్రమ్మా, పిల్లలూ, శ్రీదేవీ కలసి కాసేపు కారమ్సు ఆడారు. పిల్లలకి వాళ్ళ బాబాయంటే చాలా ఇష్టం. అందుకని సాధారణంగా వాళ్ళు ఏ విషయం వచ్చినా బాబాయిని పొగుడుతూంటారు.

"బాబాయి కారమ్సు చాలా బాగా ఆడ్తాడు వదినా! మొదట ఒక్క దెబ్బలోనే పది 'కాయిన్సు' వేసేస్తాడు" అంది శీల.

"అహా!" అంది శ్రీదేవి. సురేష్‌కూడా వర్ణించి చెప్పాడు బాబాయి ఎలా ఆడ్తాడో. ఒక కాయిన్‌ను ఒక్క దెబ్బతో వాలుగువైపులా తిరిగేటట్లుచేసి, మొదటిచోటులోనున్న పాకెట్‌లో పడేటట్లు కొట్ట గలడని, చెప్పాడు. ఇంకా ఇంకా అతనుచేసే తమాషాలు వర్ణించాడు బాబాయి టెన్నిస్‌ఆట గురించి చెప్పాడు. శ్రీదేవి శ్రద్ధగా వింది. సుభద్రమ్మను టెన్నిస్ ఎలా ఆడతారో చెప్పమని అడిగింది. సుభద్రమ్మ గోడనున్న టెన్నిస్ 'రాకెట్' చూపించి, టెన్నిస్‌బంతి చూపించి, ఆటను వర్ణించి చెప్పింది. శీల రాకెట్ తీసి శ్రీదేవి కిచ్చింది. అది చాలా బరువుగా ఉన్నట్లనిపించింది శ్రీదేవికి అలాంటి రాకెట్‌తో ఆడాలంటే ఎంత బలముండాలో!

శ్రీదేవికి కాస్సేపు కత్తిరింపులూ, మిషన్‌మీద కుట్టడం నేర్పింది సుభద్రమ్మ. శ్రీదేవి మిషన్‌మీద కూర్చొని కుట్టూఉంటే సుభద్రమ్మ కాఫీ, టిఫిన్ తయారు చెయ్యడానికి వంటింట్లో కెళ్ళింది. శీలా, సురేష్ కారమ్సు ఆడుతూనే ఉన్నారు.

ఎండలో బాగా తిరిగి తిరిగి వేణు రెండు గంటలకి ఇంటికి వచ్చాడు. వస్తూనే, అతని దృష్టి శ్రీదేవి మీదపడింది శ్రీదేవి అతనిని అంతగా గమనించ లేదు. తన మిషను—పని చూసుకుంటూ కూర్చుంది. సుభద్రమ్మ తామంతా సినిమాకి మేట్నీకి వెళ్తున్నామని వేణుతో చెప్పింది. వేణు తను కూడా సినిమాకే వెళ్తున్నాననీ, కాని, తను వెళ్ళేది ఇంగ్లీషు సినిమా కనీ చెప్పాడు పిల్లలు అది విని, వాళ్ళకికూడా ఇంగ్లీషు సినిమాయే చూడాలనిఉందని, అందరం దానికే వెళ్దామని అన్నారు సుభద్రమ్మ, శ్రీదేవి అభిప్రాయం అడిగింది. శ్రీదేవి తనెప్పుడూ ఇంగ్లీషు సినిమాలు చూడలేదనీ, అందుకు అవి ఎలా ఉంటాయో తనకి తెలియవంది.

"చాలా బాగుంటాయి. మన సినిమాలు వాటి ముందు ఎంతో తీసికట్టు." అన్నాడు వేణు, శ్రీదేవి వైపు చూస్తూ.

పెరట్లో తను మొహం కడుక్కొని లోపలికి వచ్చాడు వేణు. అతను లుంగీ, బనీనుతో ఉన్నాడు. అతని విశాల వక్షస్థలం, మెలితిరిగిన కండలూ కన్పించాయి, శ్రీ దేవి అతనివైపు చూడగానే

"కాని, అర్థం కావేమో ?" అంది శ్రీ దేవి.

వేణుకు, శ్రీ దేవి అమాత్రమైనా మాట్లాడడం చాలా ఆనందం కలిగించింది. "ఎందుకు కావు? సంభాషణ అర్థంకాదంటే ఒప్పుకుంటాను. కాని వాళ్ళు చేసే ఏక్షన్‌తోనే మనకు వాళ్ళ భావం అర్థమై పోతుంది. వాళ్ళ డ్రస్సులూ, వాళ్ళ కథ, వాళ్ళ దేశపు పరిస్థితులూ చూసి మనం ఎన్నో విషయాలు నేర్చుకోగలుగుతాం అసలు జీవితమంటే ఏమిటో వాళ్ళకు తెలిసినట్లు మనకు తెలియదు. వాళ్ళ దేశంలో స్త్రీలెంతో స్వేచ్ఛగా తిరుగుతారు. మన దేశంలోలాగ స్త్రీని బానిసగా చూడరు. పురుషులు స్త్రీకి ఎంతో గౌరవం ఇస్తారు. అక్కడ స్త్రీలంతా పెద్దపెద్ద చదువులు చదువుకొని, ఉద్యోగాలు చేస్తారు. మనం వాళ్ళదగ్గరనుంచి ఎన్నో విషయాలు నేర్చుకోవాలి." అన్నాడు వేణు.

"అబ్బా ! అలాగయితే ఆ దేశాలు చాలా నయం మనకంటే" అంది, శ్రీ దేవి. మునుపు శ్రీ దేవి విదేశాల గురించి వింది గాని, వేణుమాటలు ఆమెలో, పాత విషయాలమీదే, కొత్త ఉత్సాహం కలిగించాయి.

సుభద్రమ్మ అవాళ ఇంగ్లీషు సినిమాకే వెళ్దామంది. వేణు వెంటనే బట్టలు వేసుకెళ్ళి, ఉత్సాహంగా, రిక్షాలు తీసుకొచ్చి వాళ్ళని సినిమాకు తీసుకెళ్ళాడు. క్రితంసారి చూపించిన బెట్టు ఈసారి శ్రీ దేవి చాలావరకు సడలించిందని గ్రహించిన వేణు ఆమెతో చనువుగా మాట్లాడ నారంభించాడు. వేణు, ఆడవాళ్ళనుకూడా వచ్చి తనతో మగవాళ్ళ సీట్లలో కూర్చోమన్నాడు. కాని, సుభద్రమ్మా శ్రీదేవీ ఇష్టపడలేదు. వాళ్ళు ఆడవాళ్ళ సీట్లలోనే కూర్చున్నారు.

మగవాళ్ళ సీటులోనే కూర్చున్న వేణు దృష్టంతా శ్రీదేవిమీదే ఉంది. ఆమెకూడా మధ్యమధ్య తన వైపు చూడడం గమనించాడు. శ్రీదేవి చూపులో ఒకరకమైన మార్దవం ఉందని గ్రహించాడు

ఆ యింగ్లీషు సినిమాలో స్త్రీల దుస్తులూ, ప్రవర్తనా వింతగా ఉన్నాయి. తెరమీద స్పష్టంగా నాయికా నాయకులు ముద్దుపెట్టుకుంటున్నారు. స్త్రీ, పురుషులు ఒకరినడుముచుట్టూ ఒకరు చెయ్యివేసి డాన్సు చేస్తున్నారు. జీవితం హాయిగా, తియ్యగా ఉన్నట్లు ఆ సినిమాలో వాతావరణం చూపిస్తుంది. ఫోటోగ్రఫీ, సీనరీలు చాలా బాగున్నాయి. ఆ చక్కని సీనులకున్న నేపథ్య గానం, హృదయాన్ని గిలిగింత పెట్తోంది. శ్రీదేవికి ఆ సినిమా చూస్తున్నంతసేపూ ఏదో స్వర్గలోకంలో విహరిస్తున్నట్లుంది. వేణు చెప్పినట్లు, కథా, సంభాషణా అర్థం కాకపోయినా, చూస్తున్నంతసేపూ కంటికీ, చెవికీ ఇంపుగాఉంది.

సినిమా అయిపోయి ఇంటికి వచ్చేసిన తరువాత, సినిమా గురించి కొద్దిసేపు సుభద్రమ్మ, శ్రీదేవి, వేణూ మాట్లాడుకున్నారు. వేణు ఆ సినిమాను తెగపొగిడాడు. ఆ సినిమాలో నాయిక వేసిన యువతి చాలా అందంగా ఉందన్నాడు. సుభద్రమ్మ మన సినిమాలకన్నా బావుందంది. శ్రీదేవి, ఇంగ్లీషు వాళ్ళ దుస్తులు ఎంతో బాగున్నాయనీ, వాళ్ళ నేపథ్య సంగీతం చాలా బావుందంది. వేణు తనకు ఇంగ్లీషుట్యూనులు, పాటలు వచ్చునని, అవి ఎలా ఉంటాయో, అని చూపించాడు. తను చూసిన కొన్ని మంచి ఇంగ్లీషు సినిమాలు, వాటి కథలూ శ్రీదేవికి చెప్పాడు.

"వాళ్ళు అంత స్వేచ్ఛగా పురుషులతో తిరుగుతారుకదా ! వాళ్ళకది తప్పులేదా ?" అని అడిగింది శ్రీదేవి

"అబ్బే. వాళ్ళ దేశంలో స్త్రీ పురుషులు సమానం. ఒక స్త్రీ పురుషుడితో ఒంటరిగా తిరిగితే వాళ్ళు తప్పుపట్టుకోరు. ఆ స్త్రీ, తనయొక్క మంచి చెడ్డల్ని తానే నిర్ణయించుకోగలదని వాళ్ళ ఉద్దేశం.

మన దేశంలో అలా తిరిగితే ఇంకేమన్నాఉందా! తలిదండ్రులు ఆ అమ్మాయిని చావగొట్టారు.

ఆ ! మనదీ ఒక జీవితమేనా ? అసలు మనకు ప్రేమంటే ఏమిటో తెలుసా ? వాళ్ళలో స్త్రీ గాని, పురుషుడు గాని తన ప్రేమించిన వ్యక్తినే గాని ఇతరుల్ని పెళ్ళాడరు. మనదేశంలో అలాకాదు. తనకిష్టమున్నా లేకపోయినా, తలిదండ్రులు నిర్ణయించిన వ్యక్తినే పెండ్లాడాలి. అలా పెండ్లాడిన తరువాతా, వారిలో వారికి ఒకరికొకరు నచ్చకపోతే, జీవితాంతం ఇద్దరూ బాధపడాలిసిందే. వారి బంధం ఇక విడరానిది. ఇష్టంలేని భర్తతో కాపురం చేసే స్త్రీకి మంగళసూత్రం—ఉరిత్రాడులా—రోజురోజుకీ బిగుసుకుపోతుందే గాని, తప్పించుకునే మార్గం కనిపించదు. అదే ఇంగ్లీషువారిలో నైతే, వాళ్ళు ఒకరి విషయంలో ఒకరు పొరపాటుపడి, వివాహం చేసుకునిఉంటే, ఆ పొరపాటు గ్రహించగానే ఒకరికొకరు విడాకులిచ్చేసుకుంటారు."

"స్త్రీకి ఇష్టంలేకపోతే స్త్రీకూడా విడాకులిచ్చేయవచ్చా ?"

"ఓ ! నిరభ్యంతరంగా."

"అప్పుడు ఆస్త్రీ జీవితం ఏమవుతుంది ?"

"మళ్ళీ తనకు నచ్చిన వ్యక్తిని వివాహం చేసుకుంటుంది. అందుకు ఆమెకే మనంటి అభ్యంతరమూ, ఎవరివల్లా ఉండదు ఒకవేళ, మొదటి భర్తవల్ల సంతానం కలిగినా, రెండవ భర్త ఆ సంతానంయొక్క బాధ్యతను తీసుకోవడానికేమీ జంకడు. పైగా ఆమెకు రెండో వివాహం అయ్యేవరకూ, మొదటి భర్త ఆమెకు జీవనభృతి నిస్తాడు. స్త్రీ, పురుషులు స్వేచ్ఛగా తిరుగుతూ, ఒకరినొకరు అర్థం చేసుకుంటారు కాబట్టి, వారి దాంపత్య జీవనం ప్రేమమయంగా ఉంటుంది. మన దేశంలో స్త్రీ తనకు నచ్చిన పురుషుణ్ణి ప్రేమించడానికే జంకుతుంది. ఒకవేళ ప్రేమించినా పైకి చెప్పలేదు."

"మరి వాళ్ళ దేశం ఎందుకలాఉంది? మనలో ఇటువంటి కట్టుబాట్లెందుకు వచ్చాయి?" అని శ్రీదేవి ప్రశ్నించింది.

వేణుకి ఈ ప్రశ్న కొంచెం ఘాటనిపించింది. ఇది చాలా క్లిష్టమైన ప్రశ్న. అతనికి బుద్ధితో ఆలోచించి చెప్పవలసిన విషయాలంటే చిరాకు. అయినా, ఎంతసేపూ తనకు నచ్చినవిషయాలలో, తనకందిన సుఖాన్ననుభవించడమే అతని ధ్యేయం. అంతేకాని—'ఇదెందుకూ?'—'అదెందుకూ?' అని ప్రశ్నించే తత్వం కాదతనిది. కాని, ఆరోజు అతని బుర్ర అద్భుతంగా పని చేస్తోంది దానికి కారణం శ్రీదేవిలో క్రితంసారికన్నా వచ్చిన మార్పూ, ఆమె తనయందు చూపిస్తున్న శ్రద్ధా! అదేవిధంగా ఆమె శ్రద్ధ చూపించినట్లయితే ఆమెను తనదానిగా చేసుకోవడానికి ఆట్టేకాలం అక్కరలేదు

"మనది వట్టి మూఢాచారాలతో నిండిన దేశం. ఎంతసేపూ చాదస్తం, భయం తప్ప, మనలో తెగింపు లేదు. నిజానికి ఇంగ్లీషువాళ్ళు అన్నిటిలోనూ మనకన్నా అధికులని తెలిసి కూడా, మనం వాళ్ళని అనుసరించలేకపోతున్నాం. వాళ్ళు ఎన్నో గొప్ప విషయాలు కనిపెట్టారు రైళ్ళూ, కార్లూ, సినిమాలూ, రేడియోలూ అన్నీ వాళ్ళు కనిపెట్టినవే. వాళ్ళు అంత గొప్పవాళ్ళు కాబట్టే అవన్నీ కనిపెట్టా

# శ్రీదేవి

రు. మనం ఎంతసేపూ వారిని చూసి ఆనందించడం తప్ప, వారిలో ఉన్న మంచిని గ్రహించలేకపోతున్నాం. మనలో పురుషులు కొంతవరకూ నయం స్త్రీలు బొత్తిగా వెనకబడి ఉన్నారు" అని తనకు తోచిన మాటలు చెప్పి తప్పించుకున్నాడు వేణు.

సుభద్రమ్మ, "ఇప్పుడిప్పుడు మన దేశంలో స్త్రీలు కూడా ముందుకు వస్తున్నారు. పెద్ద పెద్ద పట్టణాల్లో స్త్రీలు కూడా, పురుషులతో సమానంగా చదువుకుంటూ ఉద్యోగం చేస్తున్నారు. ఈ ఊళ్లల్లో కూడా కాలేజీలలో ఎంతోమంది చదువుకుంటున్నారు. మునుపటికన్నా కొంతవరకూ ఇప్పుడు పరిస్థితి బావుంది" అని తను కూడా తన అభిప్రాయం వెల్లడించింది.

"ఆ—! ఏం నయం వదినా! ఏదో చదువంటే చదివేస్తున్నారు కాని, వాళ్ల మనస్సుల్లోనూ, ఆచారాల్లోనూ, ఆలోచనల్లోనూ ఏమీ మార్పు రాలేదనుకో. ఎంత చదువుకున్న అమ్మాయి అయినా, పెళ్లి విషయంలో స్వతంత్రించి, తనకు వచ్చిన వాణ్ణి చేసుకోవడానికిమాత్రం భయపడుతుంది. తలిదండ్రులు ఎంచినవాడినే చేసుకుంటోంది. అతనే తన భర్త, తన దైవం అనుకొని, ఆత్మవంచన చేసుకుంటోంది. అది మన స్త్రీలలో ఉన్న బలహీనత. చదువుకున్నవాళ్లకన్నా, ఆ తెగింపేఉంటే చదువుకోని స్త్రీనే నేను అభినందిస్తాను" అన్నాడు వేణు.

శ్రీదేవికి శ్యామల జ్ఞాపక మొచ్చింది. ఆమె ఆ—ఆచారిని ప్రేమించిందేమో? అయినా భర్తే తన సర్వస్వం అంటోంది. వేణు ఉద్దేశంలో అది బలహీనత! వేణు భావాలన్నీ నూతనత్వంతో కూడి ఉన్నాయి. అతను చాలా తెలివైనవాడిలాగా, చలాకీ తనంకలవాడిలాగా కన్పించాడు శ్రీదేవికి.

అప్పటికే చాలా చీకటి పడిపోవడంవల్ల శ్రీదేవి తాను ఇంటికి వెళ్ళిపోతానంది. సుభద్రమ్మ, వేణు ద్వారా రిక్షాను పిలిపించి, శ్రీదేవిని పంపించింది. శ్రీదేవి ఇంటికి వెళ్ళగానే, అనసూయమ్మకు వంట్లో బాగులేదని తెలిసింది. ఆమె గదిలోకి శ్రీదేవి వెళ్లగానే, శ్రీదేవిని ఆమె—అంతసేపు ఏమి చేశావని అడిగింది. శ్రీదేవికి తను సినిమా చూశానని చెప్పడానికి భయం వేసింది. అందుకని ఆ విషయం దాచి, సుభద్రమ్మ తన కేవేవో నేర్పిందని, మిషన్‌మీద కుట్టడం నేర్చుకుంటూంటే ఆలస్యమైపోయిందనీ చెప్పింది. తరువాత, తల్లికి తలనొప్పిగా ఉందంటే అమృతాంజనం రాస్తూ కూచుంది. శ్రీదేవి ఆలోచనలన్నీ ఆ ఇంగ్లీషు పిక్చరుమీదా, వేణు మాటలమీదా మొసలసాగాయి. అంతేకాక, అంతవరకూ తల్లివద్ద గాని, అమ్మమ్మవద్ద గాని దాచని విషయాలు ఇప్పుడు దాస్తోంది. పూర్వం తన మనసులో ఏ భావంపుట్టే ఆ భావం పైకి అనేస్తూండేది. కాని, ఇప్పుడలా అంటే ఏం చిక్కు వస్తుందోనని, తన భావాలు తనలోనే అణిచేసుకునేది ఆమెలో ఉదయించే అనేక సందేహాలకు, మునుపు తల్లిని గాని, అమ్మమ్మను గాని, అడిగి జవాబులు చెప్పించుకునేది. కాని, ఇప్పుడు వాళ్లు తనకు సరియైన జవాబు లివ్వలేరని, వారి అజ్ఞానంవల్లనే వారి జీవితం అంత దుఃఖభాజనం చేసుకున్నారనీ, అందువల్ల ఒకవేళ వారేదైనా జవాబు లిచ్చినా, అవి తనకు పనికి రావనీ, శ్రీదేవి దృఢనిశ్చయానికి వచ్చింది. తను, జీవితంలో ఒక క్రొత్త మార్గాన్ని అనుసరించాలి. పాత పంథా వదిలిపెట్టాలి. ఆమె బుర్రలో ఇంగ్లీషువారి జీవన విధానం చాలా ఆదర్శమైనదిగా కన్పించింది. ప్రేమించిన స్త్రీ పురుషులు హాయిగా పెండ్లి చేసుకోవచ్చు పైగా స్త్రీ, పురుషులు ఒండొరులను ప్రేమించుకున్నట్లు తెలుపుకొని, కలిసి మెలసి తిరగవచ్చు. మనదేశంలో ప్రేమ గురించి గట్టిగా మాట్లాడకూడదు. పైగా స్త్రీకి ఇష్టంలేకపోయినా, భర్తతో కాపురం చేసి తీరవలసిందే. తన తలిదండ్రుల విషాద దాంపత్యం ఆమె కంటిముందు మెసిలింది పరస్పరం ద్వేషించుకునే వారిద్దరూ సంఘాన్ని ఎదురించలేక భార్యాభర్తలుగా తిరుగుతున్నారు. ఇది సంఘంకోసం చేసుకుంటున్న ఆత్మవంచనకాదా? పైగా పురుషుడు— తన కిష్టంలేని భార్యను కలిగిఉండి, వేరొక స్త్రీతో తిరగడానికి సంఘం అడ్డురాదు కాని, స్త్రీకి ఆ అవకాశమైనా ఏది? నిజంగా స్త్రీని ఇంత హింసించే సమాజం ప్రపంచంలో ఎక్కడా ఉండదని శ్రీదేవి అనుకుంది. ఆమెలో ఈ సమాజంమీదా, ఈ వ్యక్తుల మీదా, ఈ కట్టుబాట్లమీదా ఒక అసహ్యభావం బయల్దేరింది. ఈ సంఘానికి లొంగిఉండడం పట్టి చేతకానితనం అనిపించింది. మరి, ఈ చదువుకున్న అమ్మాయిలూ, గొప్ప గొప్ప ఉద్యోగాలు చేసే స్త్రీలూ వీళ్లెవ్వరూ తమ స్థితి ఇంత అధ్వాన్నంగా ఉందని ఆలోచించుకోలేరా? వారెందుకు ఇవన్నీ భరిస్తున్నారో అడగాలనిపించింది శ్రీదేవికి.

(సశేషం)

---

# అప్పారావోపాఖ్యానం

22 వ—పేజీ తరువాయి

నోటికి కండువా అడ్డుపెట్టుకుంటూ, "ఓరినీ! మీ అసాధ్యంకూల! ఎన్ని చెప్పారయ్యా! అసలు సంగతి వినకుండానే, పోవటం అంటే చచ్చాడని కాదయ్యా నే నన్నది! పారిపోయాడని," అంటూ అసలు సంగతి బయటపెట్టాడు.

ఆ! అంటూ నోరు తెరచి, గ్రుడ్లు అప్పగించారు. అక్కడున్న పెద్దలంతా. ఇంతలో ఒకాయన తేరుకొని "ఎప్పుడూ ?" అన్నాడు.

"రాత్రండీ !"

*　　*　　*

అసలు అప్పారావు పుట్టుపూర్వోత్తరాలు తెలిసిన వాళ్ళు, ఈ మూడు సంవత్సరాలనుంచి ఆ ఊళ్లో ఎవరూ లేరనే అనవచ్చు. ఒకరోజు సాయంకాలం, ఆ ఊరి కరణంగారు మాసిన గడ్డం, మురికిబట్టిన బట్టలు, పీచురేగిన జుట్టు వగైరా.... అవతారం గల వ్యక్తిని వెంటబెట్టుకొని రావటం రచ్చబండమీద కూర్చున్న పెద్దల కంట బడింది. రెండు రోజులనంతరం, అతని పేరు అప్పారావని, స్కూలు—ఫైనల్ చదివాడని, కారణాంతరాలవల్ల ఇంటిదగ్గరనుంచి పారిపోయి వచ్చాడని ఊరంతా తెలిసింది. చాలా మంది కరణంగారి ఇంటికి వెళ్ళి అసలు సంగతేమిటని కరణంగార్ని అడిగారు.

అతన్ని గురించి తనకు అంతకంటె తెలియదని, పట్టణంనుంచి వస్తుంటే రైల్లో తటస్థ పడ్డాడని, ఊళ్లో అతనికి ఒక దారి చూపిస్తే, పనికివస్తాడని తలంచి తనతో తీసుకొనివచ్చానని ఆయన క్లుప్తంగా చెప్పి ముగించాడు కరణంగారి దయార్ద్ర హృదయానికి అలా ఒక మాట అని ఆయన్ని అభినందించేశారు.

మనిషి చూస్తే నమ్మకస్తుడివలె ఉన్నాడు. మరి ఎందుకు పారిపోయివచ్చాడో ఎవరికీ అర్థం కాలేదు. రెండు మూడు నెలల పర్యంతరం చాలామంది 'ఏ ఊరు? ఇలా ఎందకు వచ్చావు?' మొదలైన ప్రశ్న వర్షం అతనిమీద కురిపించారు. అప్పారావు ఆ ప్రశ్నల వర్షంకు తట్టుకోలేక చిరునవ్వు అనే గొడుగొకటి అడ్డంబెట్టి మౌనవ్రతం పట్టేవాడు. అందుకని అతన్ని ఎవరూ ఒత్తిడి పెట్టేవారుకాదు. ఎవరైన ఒకరు, అలా ప్రయత్నించినా వాళ్ళ కంఠశోష తప్ప, అప్పారావువద్దనుంచి జవాబు మాత్రం వచ్చేది కాదు.

కరణంగారింట్లో పిల్లాజెల్లా లేనందువల్ల ఆయనకు వెనుక కొద్దో గొప్పో ఉన్నందువల్ల, అప్పారావు పని బాగానే ఉండేది. అప్పారావు వెనకటి అవతారం విడిచి కాస్త తేరుకొని కొత్త అవతారం ఎత్తాడు

అతనికి ఇంటి బెంగ ఉన్నట్లు ఎవరికీ తెలియదు. అసలుందో లేదో మరి. ఎప్పుడూ పళ్ళు బయట పెట్టి నవ్వుతూ ఉండేవాడు. కరణంగారు చెప్పిన కాగితాలు వ్రాయటం, లెక్కలు చేసిపెట్టటం వంటివిచేసి, ఆయనకు సహాయంగా ఉండేవాడు. ఎప్పుడన్నా అద్దద్దమని పట్టణం పనులు వచ్చి కరణంగారు బయలుదేరుతుంటే అప్పారావుకూడ ఆయన వెనుక బయల్దేరేవాడు. ఊళ్లోవాళ్లకి కూడ అప్పారావంటే నమ్మకం కుదిరింది

ఇప్పుడు ఊళ్లో ప్రతివాళ్లకి నోటులు రాసి పెట్టే బాధ కరణంగారికి తప్పింది. కరణంగారి సహాయంతో అప్పారావు దస్తావేజులు రాయటం నేర్చుకున్నాడు. అతని తెలివికి కరణంగారు లోలోన చాలా మెచ్చుకొని అప్పుడప్పుడు ఆ మాట పైకి అనేశేవారు. అప్పుడు అప్పారావు 'ఇహిహి' అని పళ్లు ఇకిలించేవాడు. తనవలననే కదా ఇతను ఇంత ప్రయోజకుడు అవుతున్నాడని కరణంగారు గర్వపడేవారు. దానికి నిదర్శనంగా ఎవరైన అప్పారావు ఊసు ఎత్తితే ఛాతీ నిగ్గబెట్టి కూర్చునేవాడు.

అప్పారావు కూడ కరణంగారంటే భక్తితోను, దానితోపాటు విధేయతగాను ఉండేవాడు. దస్తావేజులు వ్రాయించుకున్నవాళ్లు కొద్దో గొప్పో అతని చేతుల్లో పెట్టేవారు. కాని ఎవ్వరినీ డబ్బు ఒడిగేవాడు కాదు. డబ్బంటే అంతగా లెక్కలేని మనిషల్లే కనిపించేవాడు.

అంతవరకు ఆ ఊళ్లో ఏ స్టాంపులు కావాలన్నా, పట్టణం పరుగెత్తవలసివచ్చేది. కాని ఇప్పుడో ? ఊళ్లోనే దొరుకుతున్నాయి అప్పారావే ఈ ఉపాయం కరణంగారి చెవిలో ఊదాడు. అసలే అతని తెలివికి ఉబ్బిపోతున్న కరణంగారు "ఓ! అంతకంటేనా" అనేశారు. తర్వాత పది రోజులకే అప్పారావు స్టాంపు వెండరయి కూర్చున్నాడు. దానికి కావలసిన పెట్టుబడి, ఇంకా ఇతర తతంగం యావత్తు కరణంగారి చేతుల మీదుగానే జరిగిందనుకోండి. అది ఆయనకంత సమస్యేం కాదు. ఎందుకంటే, అప్పారావుమీద ఆయన కున్న నమ్మకం, ఇంకా అతని సామర్థ్యంమీద ఆయనకున్న గురి అలాంటిది. అస లతని సామర్థ్యం గలవాడన్న భావన ఆయనకు అప్పారావుని చూడటంతోనె కలిగింది.

ఇన్ని రోజులనుంచి అప్పారావు బయటకు వచ్చి పలుగురితో కూర్చుని లోకాభిరామాయణం

మాట్లాడే అలవాటు లేదు. మరి అతను కూడ ఇప్పుడు ఊళ్లో కొన్ని వలుగురికి తెలిసినవా డయ్యాడు. అందుచేత ప్రొద్దున, సాయంత్రం అప్పారావు కూడ రచ్చబండమీద చేరి పిచ్చాపాటి మొదలుపెట్టాడు. రాజకీయాలు కూడ అరు దుగా మాట్లాడేవాడు. కరణంగారితో కోర్టులకు తిరగటంవలన కోర్టు వ్యవహారాలు కొంచెం అబ్బి వాయి. అప్పుడప్పుడు ఎవరైనా వస్తే, సలహాలు ఇవ్వటమే కాకుండ, అవసరమొస్తే కరణంగారి అనుమతితో కోర్టులకు వెళ్లేవాడు. వెళ్లినప్పుడు కొద్దో గొప్పో ముట్టుతుండేది. ఏది చేసినా కరణంగారి అనుమతితో మాత్రమే చేసేవాడు. ఆయనమీద అతనికున్న భక్తి అలాంటిది.

క్రమేణ వచ్చిన డబ్బుతో కరణంగారు పెట్టిన పెట్టుబడంతా తీర్చేశాడు. అప్పారావు ఇప్పటి వరకు కరణంగా రింట్లోనే ముందువైపు సావిడిలో ఒక గదిలో ఉండేవాడు. మరి ఒకనాడు ఏమను కున్నాడో గాని, కరణంగారు తీరికగా కూర్చున్న సమయం జూచి, తనుకూడ తీరుబాటు చూసుకుని నెమ్మదిగా ఆయన ప్రక్క జేరాడు.

కాసేపు అదీ, ఇదీ మాట్లాడుకున్న తర్వాత అప్పారావు అసలు సంగతి బయటపెట్టాడు; పల్లకు వచ్చి ముంత దాయటం ఎందుకన్నట్లుగా.

"ఏమండీ! ఎవరైనా ఏదో కొన్నాళ్లపాటు చూస్తారు. ఎల్లకాలం చూడటం కష్టంకదా ? అందులో కొస్త నా కాళ్లమీద నేను నిలబడేటట్లు చేశారు. ఇంకా నేను మీకు భారంగా ఉండటం నాకు ఇష్టంలేదు. ఏదో అంతా తమ చలవ. తమరి అనుమతయితే, ఊళ్లోనే వేరే ఇంట్లో అద్దెకుండి, స్వయంగా వండుకొందామని ఉంది" అంటూ చెప్పి, కరణంగారు ఏమంటారో నని భయం భయంగానే ఆయన సమాధానం కోసం నిరీక్షిస్తున్నాడు.

ఒక్క అర—నిముషంపాటు ఏమి మాట్లాడలేదు కరణంగారు. తరువాత గద్గదమైన గొంతుతో "ఇదుగో, అప్పారావ్ ! ఇప్పు డీ బుద్ధి నీ కెందుకు పుట్టిందయ్యా ? నీ కేమన్నా మా ఇంట్లో లోటుగా ఉందా ? చెప్పు ? నీవు ఏదడిగినా నేను కాదన్నానా ? లేక నామీద కోపం వచ్చిందా ? నీవు వేరే ఉండటానికి కారణం ఏమిటి ?" అని నిగ్గదీసి అడిగారు.

"అబ్బెబ్బె ! అదేమి లేదండి. తమమీద ఒట్టు. నా కా విధమైన ఉద్దేశ్యం ఏ కోశానా లేదు. నన్ను తల్లిదండ్రులకన్న ఎక్కువగా చూశారు. ఇంకా మిమ్మల్ని కష్టపెట్టటం ఇష్టంలేకనే ఇలా అన్నాను" అని అప్పారావు అన్నాడు.

కాని, కరణంగారు తమవల్ల ఏదో కష్టం అప్పారావుకు కలిగిందని బాధపడ్తున్నాడు.

అప్పారావుకి మాత్రం కరణంగారికి ఇంకా భారంగా ఉండటం ఇష్టంలేదు.

మొత్తానికి ఇద్దరూ రాత్రి పది గంటలవరకు బుర్ర బద్దలు కొట్టుకుంటూనే ఉన్నారు. అతి కష్టంమీద అప్పారావు వేరుగా ఉండటానికి కరణంగారు ఒప్పుకున్నారు.

మరి రెరడు రోజులకు అప్పారావు ఒక చిన్న డాబాలో, ఒక చిన్న గది అద్దెకు తీసుకొని, అదే స్టాంపులు అమ్మే ఆఫీసుగాను, అదే వంటగది గాను, అదే పడకగది గాను భావించుకున్నాడు. ఎవరైన "ఏమిట్లండి ? మరి ఒక్క గది కాకపోతే ఇంకొక గది కూడ అద్దెకు తీసుకుని హాయిగా ఉండరాదూ ?" అంటే ! "అబ్బే ! ఎందుకండీ ? బ్రహ్మచారి ముండాకొడుకుని, ఒంటరివాడిని. ఇది చాలక ఇంకా ఎందుకండీ ? నెత్తినేసి రుద్దుకోవ టానికా ?" అనేవాడు.

ఇలా ఎవ రడిగినా "బ్రహ్మచారి ముండా కొడుకునీ, ఒంటరివాడిని" అంటూ ఉండేవాడు. ఈ రెండు మాటలే ఎవరో కరణంగారి చెవి నేశారు.

అప్పారావు వేరుగా ఉంటున్నా, ప్రతిరోజు కరణంగారింటికి వచ్చి, ఆయన్ని, ఆయన భార్యని పలకరించవల్సిందే. ఒకవేళ ఏ రోజైనా అలా జరగలే దనుకోండి; అటు కరణంగారి మనస్సు, ఇటు అప్పారావు మనస్సు తహతహ లాడేవి.

మామూలుగానే ఆరోజు అప్పారావు కరణంగా రింటికి వచ్చి కూర్చున్నాడు. ఆవేళ కరణంగారు, ఆయన భార్య మహ సంతోషంగా ఉన్నారు.

"నాయనా ! అప్పారావ్ !" అంటూ కరణం గారు వచ్చారు. ఏమిటి విశేషం చెప్మా ! అను కున్నాడు అప్పారావు. మళ్లీ కరణంగారు, "అప్పా రావ్ ! మొత్తానికి అవుతున్నావయ్యా !" అని నవ్వుతున్నాడు.

**"ఇంతకీ బస్సు వెళ్ళిపోగే-నేళ వరకూ ఊగకొని పరిగెడతా వేం!" కామేశం అడిగాడు సుబ్బా రావుని.**

**"అదే ఆఖరి బస్సు. అయితే మరి నేను యింటికి పోనక్కర లేదు. కాపోతే మరో బస్సు కోసం చూస్తూండాలి. అందుకని" సుబ్బారావు చెప్పాడు.**

ఏమిటో అవుతుంది, మంచివాడినా, చెడ్డవాడినా ? ఈయన ఇంత సంతోషంగా ఉన్నాడు గన్క చెడ్డ వాడిని కాదన్నమాట; మంచివాడినే అనుకుంటూ తనలో తనే మురుసుకుంటూ, ఉండబట్ట లేక

"ఒక ఇంటివాడవయ్యా !" అన్నాడు కరణం గారు.

"ఇప్పుడు ఒక ఇంటివాడిని గాక, రెండు ఇళ్ల వాడిని కాలేదు గదండీ ?" అన్నాడు అప్పారావు అమాయకంగా.

కరణంగారు నవ్వుతూ "అదిగాదు అప్పారావ్, నీకు పెళ్లయ్యా ! పెళ్లి. ఆమాత్రం తెలుకసుకో లేవూ, ఇంత తెలివిగలవాడివి !" అంటున్నారు.

ఇక చూడండి అప్పారావు మొఖాన కత్తివాటుకు నెత్తురుచుక్క లేదు. పెళ్లి అనటంతోనే ఏదో భయం పుట్టుకువచ్చినట్లయింది.

నాకు పెళ్ళేమిటి ? నా బొంద ! అని మన స్సులో అనుకుంటుంటే ఆమాట బైటకే వచ్చి కరణంగారి కర్ణపుటాలకి తాకింది.

"నీకు గాక నాకంటయ్యా ?" అనే కరణం గారి ప్రశ్నకు సమాధానం లేకపోయేటప్పటికి కొస్త మందలింపు ధోరణిలో "ఏదో ఆ మూడు ముళ్లు వేయిస్తే నిన్ను ఇక్కడకు తీసికొనివచ్చిన బాధ్యత వదులుతుందని నే ననుకుంటుంటే, అట్లా తెల్లమొగం వేస్తావేమయ్యా ?" అన్నారు.

అప్పారావును మాట్లాడనివ్వకుండానే కరణం గారు మళ్లీ "చక్కని నిక్షేపంలాంటి పిల్లయ్యా ! ఈ ఊరే ! ఫస్టుఫారం ఫస్టున ప్యాసయిందట. రెండు మూడొందలు కట్నం ఇస్తామన్నారు. పిల్లను గాని చేసుకొనేది, కట్నం కాదుకదా అనుకొని సరే నన్నాను. ముహూర్తం పెట్టడమే ఆలస్యం. నీతో చెప్పకుండా ఇంతా జేశానని కోపం వచ్చిందేటి ఇస్మీ !" అంటూ అనుమానంగా అడిగారు.

అంతవరకు తల దించుకు కూర్చున్న అప్పారావు కొస్త తల ఎత్తి నెమ్మదిగా "నాకు .... నాకు .... ఈ పెళ్లి వద్దండీ !" అని దీర్ఘంగా నిట్టూర్పు విడిచాడు.

కరణంగారు ఒక్కసారిగా మొహం మార్చు కొని "ఏం ? ఎందుకు వద్దూ ? ఆ అమ్మాయికి ఏం తక్కువైందని వద్దంటున్నారు ? అసలు ఆ అమ్మాయిని చూశావా ?" అంటూ తుపాకి గుండ్లలాంటి ప్రశ్నలవర్షం కురిపించాడు.

దాంతో అప్పారావు ఒక్కసారిగా కూలబడి ఇందాకటికంటె నెమ్మదిగా "ఆ అమ్మాయిని కాదండీ వద్దందీ, అసలు పెళ్లి వద్దంటున్నా !" అన్నాడు.

కరణంగారికి కోపం వచ్చింది. "అంత పెళ్లి వద్దనేవాడివి ఊళ్లో అందరిముందు బ్రహ్మచారినీ, ఒంటరివాడినీ అని ఎందుకు అనవలసివచ్చింది ? అలా అన్నావంటే పరోక్షంగా పెళ్లి కావాలని అడ గటం అవునా ? కాదా ? అందుకనే నేను సంబం ధము నిశ్చయించాను. పెళ్లి జరిగి తీరవలసిందే !" అంటూ తను కూర్చున్న మట్టి అరుగు గట్టిగా గుద్ది చెప్పారు.

అప్పారావుకు ముచ్చెమటలు పోశాయి. తనేదో మాటవరసకొచ్చి అన్నాడు గాని, ఈ ఊళ్లో వాళ్లు దానికి ఇంత ఇదిగా 'లా' పాయింటు తీస్తారనుకోలేదు. మరి ఇప్పు డెలా ? ఈయన గట్టిగా పట్టుబడుతున్నాడు. తనకు పెళ్లి ఇష్టం లేదు. బాగా ఆలోచించి 'తెల్లవారి ఏ సంగతి చెబుతా' నని బయటపడ్డాడు అప్పారావు.

రాత్రంతా నిద్రపోకుండా ఆలోచిస్తూ కూర్చు న్నాడు. తెల్లవారుజామున ఏమి తట్టిందో గాని, నిండా ముసుగుపెట్టి పడుకొని, ఏడు గంటలకు లేచి, కరణంగా రింటికి వెళ్లాడు.

అప్పటికే ఆయన అరుగుమీద తిష్ఠ వేశాడు. అప్పారావు వచ్చి రావటంతోనే "ఏం జేశావోయ్ ?" అని అడిగారు.

"చేసుకుంటానండీ" అని ఒక్కసారిగా అన్నాడు అప్పారావు.

"నాకు తెలియదటోయ్ ! నిన్నేదో ఆలోచించ కుండా అనేశావ్" అని కరణంగారు నవ్వుతూ అన్నారు.

అప్పారావు వెంటనే అందుకుని "అయితే ఇప్పుడు కాదండి, మరో నాలుగు నెలల తర్వాత" అన్నాడు.

"అప్పటివరకు ఏంజేస్తావేంటి ?" అని కరణం గారు అడిగారు.

"ఏంలేదండి, మన ఊళ్లో ఉన్న రామాలయం చూశారూ ? ఎంత పాడుబడి ఉందో ! ఏదో

# అప్పారావోపాఖ్యానం

ఊళ్లో చందాలు ప్రోగుచేసి దానిని బాగుచేయిం చుదామని ఉంది. ఆ కాస్త పనీ నా చేతులమీదుగా జరిగితే నాకు పేరూ వస్తుంది, పుణ్యం ఉంటుంది. ఆ తర్వాత పెళ్లికి అభ్యంతరం ఉండదు'' అన్నాడు అప్పారావు.

కరణంగారు దీర్ఘంగా ఆలోచించారు. ఉద్దేశ్యం బాగానే ఉంది. ఎటుతిరిగి వివాహం చేసుకుంటా నంటున్నాడు కాబట్టి, నాలుగు నెలలు ఆగిన తర్వాతే చేద్దాం, ముంచుకుపోయిందేముందని 'సరే, నీ ఇష్టప్రకారమే కానియ్' అన్నారు.

దాంతో అప్పారావుకు భారం నెత్తిమీద నుంచి దిగినట్లయింది. అసలు అప్పారావు స్వేచ్ఛాజీవి కావాలని కలలు గంటున్నట్లు ఒకసారి అన్నాడు అటువంటివాడికి గుదిబండ కడతానంటే అంగీక రిస్తాడా ? గుడి వంకపెట్టి నాలుగు నెలలు వాయిదా వేశాడు. అసలు గుడి కూడ బాగు చేయించి భక్తుడ నవుదామన్న ఉద్దేశ్యం కూడ అప్పారావు మనస్సులో లేకపోలేదు. అందుకే 'రామా లయోద్ధరణ నిధి'' అని ఒకటి స్థాపించాడు

ఈలోగా పంచాయితీ ఎన్నికలు వచ్చి అప్పా రావు పనికి ఆటంకం కలిగించినాయి. అన్ని ఊళ్లలో మాదిరిగా, ఆ ఊళ్లోనూ రెండు పార్టీలు ఉన్నాయి. రెండు వైపులవారు ప్రచారం జోరుగా మొదలుపెట్టారు.

ఇదొక పెద్ద సమస్యగా తయారయింది మన అప్పారావుకు. ఎవరికి వేయాలి వోటు ? ఒకరికి వేస్తే రెండవవాళ్లకు కోపం. మరి తను అంద రికీ తలలో నాలుకవలె ఉంటున్నాడయ్యె, తను ఒంటరిగాడు. జంట ఉండి ఉంటే ''మీకొక వోటు, వాళ్లకొక వోటు'' అనే పని. ఏ చిక్కు ఉండేది కాదు. అందులో ''రామాలయోద్ధరణ నిధి'' ఒకటి ఉన్నది. ఒక పార్టీకి వోటువేస్తే, రెండవవాళ్లు తన నిధికి చిల్లిగవ్వ ఇవ్వరు. ఎట్లా అబ్బా ? అను కొని మరొక్కసారి బుర్ర తిరిగేలా ఆలోచించి మంచి ప్లానొకటి తయారుచేశాడు

ఎక్కడైనా సామాన్యంగా ఒక పార్టీవాళ్లు ఒక వార్డులో ప్రచారం చేస్తుంటే, మరొక పార్టీ వాళ్లు మరొకవార్డులో ప్రబాచారం చేస్తారు. అదే, అప్పారావు పాలిటి కల్పతరువయింది.

ఒకనాడు ఒక పార్టీవాళ్లు వచ్చి, ''ఏమోయ్ అప్పారావ్, నీవోటు ఎవరికేంటి ?'' అని అడిగారు·

''అదేమిటండీ? ఎవరికంటారేంటి ? నా వోటు మీకే ! ఇంకెవరికేస్తాను?'' అని అనటమే గాకుండా వాళ్ళకు ఇంకా నమ్మకం కుదరటానికి, వాళ్ళతో కలిసి నాలుగయిదు ఇళ్ళు తిరిగేవాడు. ఆ తిరగటంలో ఎంత జాగ్రత్త! పదిమంది మధ్యలో కనబడీ కనబడ కుండా ఉండేవాడు. నెత్తిమీద ముసుగేసుకుని తల వంచి నడిచేవాడు. ఆఖరుకు ఇంటాయనకుకూడ కనిపించనంత జాగ్రత్తపడి, ఎవరికి తెలియకుండ గదికి చేరుకునేవాడు.

రెండవపార్టీవాళ్లు వచ్చి అడిగినా అంతే. మొత్తా నికి ఇద్దరికీ ''అప్పారావు మనవాడే'' అనుకునే టట్లు చేశాడు.

ఎలక్షన్‌రోజు రానే వచ్చింది. అందరితోపాటు అప్పారావు వోట్లువేశాడు. రెండుపార్టీలవాళ్ళు అప్పారావు తమకేశాడంటే, తమకేశాడను కుంటు న్నారు మనస్సులో. మరి అప్పారావు ఎవరికివేశాడో?

ఆ సాయంత్రమే ఫలితాలు ప్రకటించారు. అప్పారావు, గెల్చినవాళ్ళదగ్గరకు వెళ్ళి మహానందం ప్రకటించి, వెంటనే వోడినవాళ్ళదగ్గరకు వెళ్ళి తన గాఢ సంతాపం వెలిబుచ్చాడు.

ఈ తతంగం అంతా అయినతర్వాత, అప్పారావు తన పని మొదలుపెట్టాడు, రెండుపార్టీలవాళ్ళు తనకు అనుకూలురే గనుక అందరి దగ్గరకు వెళ్ళి చందాలు వేయించాడు. చందా వేయటమే గాని వెంటనే ఇచ్చేవాళ్ళు తక్కువగదండీ !

వేయించిన చందాలకోసం తెగ తిరిగి వసూలు చేస్తున్నాడు అప్పారావు. ఒకనాడు పోగయిన డబ్బు లెక్కచూడగా రెండువేల రూపాయల చిల్లరగా వచ్చినట్లు తేలింది.

కాలంకూడ మూడునెలలు నడిచింది. అప్పారావు పెళ్ళి ఇంకా నెలరోజులే ఉంది. కరణంగారు రోజు రోజుకూ గుర్తుచేస్తూనే ఉన్నారు.

ఈలోగా ఒక వింత జరిగింది. అప్పారావుమీద ఊళ్ళో చిన్నచిన్న పుకార్లు బయలుదేరాయి. అప్పా రావు ఎలక్షనులో నడిపిన శల్యసారథ్యం చాలామందికి తెలిసింది. అక్కడక్కడా దీనిని గూర్చి చర్చలు ప్రారంభమయినట్లు ఎవరో అప్పారావుకు చెప్పారు. బుజువులతోసహా బయటకు వచ్చేటట్లున్నాయి.

రాజు: ''ఇంతకూ అష్టగ్రహ కూటమి అయితే పెళ్ళి చేసు కుంటానన్నావుటగా? మరి ఆ లక్ష్మిని వివాహమాడలేదేం?

రాము : సరి సరి! అష్టగ్రహ కూటమి ధర్మమా అని ఆ అమ్మాయి సూర్యంతో లేచి పోయిందిగా?

భీమారావు (రాజమండ్రి)

ఒకవేళ అలా గనుక వస్తే తనకు నలుగురిలో అవమానం తప్పదు. ఇందులో అప్పారావు చేసింది పెద్ద పొరపాటు కాకపోయినా, అందరిని నమ్మించి నందుకు, వాళ్ళకు బాగా కోపంవచ్చింది. ఈ గండం గడవటం ఎలాగో తెలియటంలేదు అప్పారావుకు.

అనుకున్నట్లు ఆ ధాత్రి రానేవచ్చింది కబురు; కోపంపాలు కాస్త ఎక్కువగా ఉన్న ఒకపార్టీ పెద్ద నుంచి. తెల్లవారి వచ్చి వాళ్ళింటిదగ్గర కలుసుకో మని.

అప్పారావుకు ముచ్చెమటలు పోసినాయి. గుం డెల్లో చేయిబెట్టి కెలికినట్లయింది. ఇన్ని రోజుల నుంచి గౌరవంగా బయటపడితేనే మంచిదను కున్నాడు. ఎలా ?

గుడి డబ్బు, అదే ! ''రామాలయోద్ధరణనిధి'' రెండువేలూ, తన దగ్గరే ఉన్నాయి. తళుక్కున ఒక ఉపాయం మెరిసింది అప్పారావు బుర్రలో.

అవసరమనుకున్న సామానంతా, చిన్న పెట్టెలో సర్దాడు. కాగితం కలం తీసికొని కరణంగారికి ఉత్త రం మొదలుపెట్టాడు.

**పితృ సమానులైన కరణంగార్కి,**

**నమస్కారములు. ఈ విధంగా నేను చెప్పకుండా** వెళ్తున్నందుకు మీకు చాలా బాధగా ఉండవచ్చు. మీ ఊరును, మిమ్ములను విడిచి వెళ్ళటం నాకూ చాలా బాధగానున్నది. అయినా వెళ్ళడం తప్పనిసరి. ఎందుకంటే—

నన్ను తీసికొనివచ్చిన మీకు, మీ ఊళ్లోవాళ్ళకు ఇంతవరకు నా పుట్టుపూర్వోత్తరాలు తెలియవు. ఇప్పుడు అత్యవసరంగనుక కొంచెం నా సంగతి వివరి స్తాను.

అసలు నేను మోసగాడిని. నాకు ఒక పేరంటూ లేదు. ఊరు ఊరు తిరుగుతూ, అవసరమొస్తే నెలల పర్యంతరం కూడ ఉండి, ఊళ్లోవాళ్ళను బాగా నమ్మించి అందినంతవరకు డబ్బు గుంజి, జల్సాగా ఖర్చుపెట్టూ ఉండేవాడిని. అదే ఉద్దే శ్యంతో నే మీ ఊరు కూడా వచ్చాను. ఇటువంటి సహృదయులుగల ఊరు ఇంతవరకు నేను చూడ లేదు. అందుకనే మూడు సంవత్సరాలు నేనః ఉండ గలిగాను.

మీ అందరిమధ్య నావంటి కల్మషహృదయుడు, మోసగాడు ఇన్ని రోజులనుంచి మెలిగాడంటే అదంతా మీ గొప్పతనమే. ఇన్ని సంవత్సరాలు ఉండటంవలన నాలో నిజంగా మార్పు వచ్చింది. నేనుగూడ ఊరు శ్రేయస్సు కోరుతుండేవాడిని. అందువల్లనే రామాలయాన్ని బాగుచేయాలని సంకల్పించాను.

పోతే, ఎన్నికలలో నేను నడిపిన శల్య సారథ్యం కూడ ఎవరికీ బాధ కలుగకుండా ఉండాలనే చేశాను. నిజంగా నేను ఎవరికీ వోటు వెయ్యలేదు. ఇది అందరికి కోప కారణ మయింది. నా గౌరవానికి భంగం వచ్చేటట్లున్నది. అసలు విషయం నేను వాళ్ల ముందు చెప్పుకునే ధైర్యం నాకు లేదు. అందుకనే ఇలా వెళ్తున్నాను.

ఇకనుంచి కాయకష్టం జేసి స్వచ్ఛంద జీవితం గడపాలనుకున్నాను. ఆ పనే మీ ఊరులో చేయటం ''పూలు అమ్మినచోట కట్టె లమ్మటం'' అవు తుంది. నన్ను గురించి అందరిముందు చెప్పు కొందామని అప్పుడప్పుడు అనుకునేవాడిని. కాని, ధైర్యం చాలేదికాదు. క్లుప్తంగా నా గురించి ఈ కొంచెము వ్రాసిన తర్వాత నా మనస్సు తృప్తిగా ఉంది. మీరందరూ నన్ను అపార్థం చేసుకొన వద్దని ప్రార్థన.

ఇంకొక మాట. మీరు నాకు పెళ్లి తలపెట్టారు· కాని నాకు పెళ్లంటే అసలు యిష్టంలేదు· ఆ బాధ కూడ తప్పించుకోవటానికి మీ ఊరు నుంచి దూరమవ్వవలసివస్తుంది క్షమించాలి మరి. ఆ రెండువేలున్నాయి చూశారూ ? పొట్లం కట్టి ఆ మూలనున్న గూటిలో దాచాను. జాగ్రత్త చేసి రామాలయాన్ని తప్పక బాగుచేయిస్తారని ఆశి స్తున్నాను.

నా ఆఖరు కోరికగా ఇంకొక మాట. మీ ఊళ్లో వాళ్లందరికీ నామీద ఇప్పుడు కోపంగా ఉండి ఉంటుంది. నిజంగా నాలో పరివర్తన కలిగిం దను టకు నిదర్శనంగా, ఆ రెండు వేలూ, ఉత్తరం, ఊళ్లోవాళ్లందరి ముందు పెట్టవలసినదిగా ప్రార్థన.

ఇట్లు,

**విధేయుడు,**

**అప్పారావు.** ★

కాని 'పాట మారిపోయింది.'

'బటర్‌ఫీల్‌డ్—8' అనేచిత్రం నిర్మాణం ప్రారంభ మయింది. ఆమె జీవితంలోని విషాదఘట్టం మొద లయింది. వాళ్ళ వివాహంకూడా భగ్నం అయి పోయే సూచనలు కనిపించాయి.

'బటర్‌ఫీల్‌డ్—8'లో నటించటానికి ఒప్పు కునేముందు యం. జి. యం.తో తన భర్తకూడా అదే చిత్రంలో వేసితీరాలని చెప్పింది. అప్పుడు ఫిషర్ పరిస్థితి అంత బాగాలేదు. అమెరికా గాయ కులలో ప్రథమ శ్రేణికి చెందిన ఫిషర్ క్రమంగా తన కీర్తి పోగొట్టుకుంటున్నాడు. టెలివిజన్ కాంట్రాక్టులుకూడా ఆగిపోవటం ప్రారంభించాయి. అసలు ఎప్పుడూ భార్యతోనే కాలక్షేపం చెయ్యడం చూసిన మిత్రులు అతనికి తన వృత్తిపైన ఆసక్తి తగ్గిపోయిందా, అనికూడా అనుకున్నారు.

"మిస్టర్ ఫిషర్ అనటంకన్నా మిస్టర్ టేలర్ అంటే బావుంటుంది," అన్నాడు, ఒక పెద్దమనిషి.

అయితే ఎడ్డీ లిజ్ ప్రేమలో పూర్తిగా మునిగి పోయి ఇటువంటి అవహేళనలను పట్టించుకో లేదు. తను ఒక సినిమా తీసి అందులో ఆమెను వేయించాలని తహతహలాడేవాడు. వీరి ఇద్దరి వివాహం బంధం పూర్తిగా విరిగిపోయేవరకూ అతని ఉద్దేశ్యం అలానే ఉంది ఇప్పటికీ, లిజ్ కోసం ఏమిచెయ్యమన్నా చేస్తాడని నే ననుకుంటాను.

నాకు బాగా జ్ఞాపకం; లండన్‌లోని డోర్ చెస్ టర్ హొటల్‌లో అతన్ని కలుసుకున్నాను. లిజ్ కి ఇంకా కొన్నిరోజులలో నిమోనియా తగలపోతున్నదని ఎవరూ కలగనలేదు.

గడ్డం గీసుకోక, ఎండిపోయిన కళ్లతో రాత్రి అంతా మేలుకుని ఉన్న మనిషిలా కనిపించాడు.

"దిగులు పనికిరాదు," అన్నాను.

అసహాయంగా, "ప్రయత్నిస్తున్నా," అన్నాడు. "కాని. . . ." మాట మధ్యలోనే ఆగిపోయింది.

# రెండు రూపాల మనిషి

19—వ పేజీ తరువాయి

బటర్ ఫీల్‌డ్—8లో అతని నడక బాగాలేదని అందరూ అనుకుంటారు. చిత్రం బాక్సాఫీస్‌హిట్ అయినప్పటికీ, సరిగ్గా కుదరలేదని అందరూ ఒప్పు కున్నారు.

చివరిదాకా ఎడ్డీ లిజ్ ప్రేమ పోగొట్టుకోకుండా ఉందామని ప్రయత్నించాడు. రోమ్‌లో వారి భవ నంలో లిజ్ కి షూటింగ్‌లేని రోజులలో తనే స్వయంగా వంట వండి ఆమెకు గదిలో వడ్డించే వాడు. లిజ్ కి కాఫీఅంటే చాలా ఇష్టం. కాల్చిన రొట్టెముక్కలూ, ఉడకబెట్టిన కోడిగుడ్లూ పళ్లెంలో తీసుకుపోయి పొద్దున లిజ్ లేవగానే ఆమెకు అందించేవాడు.

కాని లిజ్, పేరుప్రతిష్టలు అతనిలో చంచల నం కలిగించేవా అనిపించేది కొన్ని సమయాలలో. క్లియోపాత్ర డైరక్టర్‌గా పనిచేస్తూ ట్వెంటి యత్ సెంచురీ ఫాక్స్‌తో అభిప్రాయభేదాలు వచ్చి రాజీనామా ఇచ్చిన రూబెన్ మామూలియన్ నాతో చెప్పాడు . "రోమ్‌లో జరుగుతున్న ఒలిం పిక్ ఆటలు చూడటానికని లిజ్ స్టేడియమ్‌లోకి వచ్చింది. స్టేడియంలో కాలుపెట్టిందో లేదో, ఎక్కడ వక్కడే ఆగిపోయాయి. అన్ని తలలూ ఆమె వైపే తిరిగాయి. ఆమె చుట్టూ మూగిన గుంపులు తప్పించుకోవటానికి ప్రయత్నిస్తున్న లిజ్, అమాం తంగా, 'నన్నెవరో గిల్లారు !' అని అరిచింది. ఎడ్డీ ఫిషర్ ఆమెవద్దకు తోసుకుంటూ వెళ్లి, 'ఎవరు ?' అని అడిగాడు. 'ఏమో !' అంది లిజ్.

"నిజం చెప్పాలంటే ఆమెని మున్ఫయ్ అయిదు సార్లు గిల్లారు ! ఈ ఇటాలియన్‌లు పండుగ చేసు కున్నారంటే నమ్మ !"

లిజ్ షూటింగ్‌కి వెళ్లినంతసేపూ, ఎడ్డీ ఆమె మొదటి ఇద్దరు భర్తలవల్లా కలిగిన పిల్లలను చూస్తూ ఉండేవాడు. మైకేల్, క్రిస్టఫర్ అని ఇద్దరబ్బాయిలూ, లిజాఅనే అమ్మాయి ఉండేవారు. మగపిల్లలిద్దరికీ ఇతనంటే చాలా ఇష్టం. ఇతనికీ వారంటే ఎంతో ప్రేమ. రాత్రి వాళ్ల హోమ్‌వర్క్‌కి సహాయపడేవాడు. (ఇంగ్లీషు కాని, చరిత్ర కాని ఉంటే ఇతనికి చాలా సంతోషంగా ఉండేది. అవంటే ఎడ్డీకి చాలా ఇష్టం.)

లిజ్ కి తన పిల్లలతో వీలయినంతసేపు గడపా లని ఉంటుంది. వారందరూ కలిస్తే ఒకటే హడా వుడి ! ఒకరోజు రాత్రి వారింటికి భోజనానికి వెళ్లిన మిత్రుడు చెప్పాడు: "ఆమె రాగానే పిల్లలు అమాంతంగా వెళ్లి మీదపడ్డారు. ఏళ్లతరబడి కలుసుకో లేదన్నట్లుగా అల్లరి చేశారు. ఆ క్షణం, ఆమె సినిమాతార అని ఎవరూ అనుకోరు."

కాని, షూటింగ్ ముగించుకుని వచ్చిన లిజ్ ఎప్పుడూ మరీ అలిసిపోయి ఉంటుందేమో సాధార ణంగా పిల్లల్ని కలుసుకొనటం ఉండదు. నిజం చెప్పాలంటే పిల్లలకి సరిఅయిన 'గృహజీవితం' లేదు. ఎక్కువగా హోటళ్లలో వారి జీవితం గడిచిపోయింది. అమెరికాలో, బ్రిటన్‌లో, స్విట్‌జర్‌లాండ్‌లో— స్కూళ్లు మారటం అలవాటయిపోయింది. అంతే కాక, తమ సహాధ్యాయులు తమ తల్లిగురించి చాలా కష్టం కలిగించే కథలు చదవటం మరొక సమస్యగా తయారయ్యేది.

మైకేల్ విల్‌డింగ్‌కి పుట్టిన అబ్బాయి లిద్దరూ అచ్చం తమ తల్లిలాగే ఉంటారు—అదే కనుముక్కు తీరూ, మెడా; ఆడపిల్లమాత్రం తండ్రి మైకేల్ టాడ్‌ని పోలిఉంటుంది.

అప్పుడే తల్లిలాగా దుస్తులంటే ఎంతో ఇష్టం చూపుతోంది; ఆడుకుంటున్నప్పుడు మట్టి గనుక అయితే వెంటనే మార్చాలి, అంటుంది.

(సశేషం)

---

ఇంటికెళ్లాక నరసింహంగార్ని భార్య చివాట్లు పెట్టింది "పిల్లలుగలవాళ్లం. మనకేమంత ముల్లె ఉందని అంతా వాళ్లకి పెడతామంటున్నారట. వాళ్లకేం ఉన్నన్నాళ్లూ కిందా మీదా లేకుండా బోడి దర్జాలకి పోయారు. ఇప్పు డనుభవిస్తున్నారు" అంది. నరసింహంగారికి నోట మాట రాలేదు. ఇది కాబోలు మానవ జీవితం అంటేను అనుకున్నారు.

## 10

## చావూ బ్రతుకూ

ఇరవై ఎనిమిదేళ్ల సుబ్బారావు ఇంతవరకూ తన భార్య, తన ప్రపంచంతప్ప వేరే బాధ్యత లేవీ లేకుండా ఏ విషయంలోనూ జోక్యం కలగజేసుకో కుండా తిరిగాడు. సూరపరాజుగారు గుట్టుమనిషి కావడం, చిన్నప్పట్నించీ పిల్లలంటే అమిత ప్రేమ వల్ల బాధ కలిగించే విషయాలు వాళ్లదాకా ఎందుకని, వాళ్ల క్కావలసినవేవో అమర్చి తనే బాధ తను పడ్డంతో, బాధ్యత వహించగలిగిన వయస్సొచ్చినా, చిన్నవాడిలాగే ఉండి పోయాడు. పీకలమీదకొచ్చాక కలగజేసుకోక తప్ప లేదు. కాని, కలగజేసుకున్నా ప్రయోజనమూ లేకపోయింది. తండ్రి మంచమెక్కడంతో సుబ్బా రావుమీద పూర్తి బాధ్యత పడింది. అతని ప్రపంచం తల్లకిందులయింది.

# పన్నీరు - కన్నీరు

11—వ పేజీతరువాయి

సరిగ్గా ఆ సమయంలో సూరపరాజుగారి తల్లి లక్ష్మమ్మగారు కాలం చేశారు. ఇంట్లో అన్నీ సమ న్వయించుకుని, కూడగట్టుకుని వచ్చే వ్యక్తి లోపిం చింది. ఆవిడ ఖర్చు విషయంలో ఎంత చేతికి ఎముక లేకుండా చేసే మనిషయినా, ఇంట్లో పోరు లేకుండా ఎవరి జాగాలో వాళ్లని ఉంచేది. ఇప్పుడు సీతమ్మ గారికి ఆ మాదిరి గడసరితనం లేకపోవటంతో ఇల్లంతా చిందర వందర కాసాగింది.

మెల్లిగా సుబ్బారావు భార్య రమణమ్మ తప్పని సరిగా ఇంటి విషయాలన్నీ స్వయంగా చూసుకో వల్సిన అవసరం వచ్చింది అత్తగారు కూడా ఆమెకే ఇచ్చింది పెత్తనమూ, బాధ్యతా కూడాను. ఇంట్లో జబ్బుతోఉన్న మామగారు, అత్తగారు, భర్త, ఇద్దరు మరుదులు, తన పిల్లలు—కొడుకూ, కూతురూనూ. ఇంతవరకూ సూరపరాజుగారి ఇంట్లో ఉంటూ వచ్చిన ఆశ్రిత జనమంతా మెల్లిగా జారుకున్నారు. సూరపరాజుగారి బాబాయిగారు వెళ్లేటప్పుడు ఎంతో బాధపడ్డారు. "ఇన్నేళ్ళుగా నిన్ను కనిపెట్టు కుని బతికాను. నిన్ను ఈ పరిస్థితుల్లో వదలా ల్సొస్తుందనుకోలేదు."

"ఎక్కడికి వెడతారు? ఉండండి. మా అందరితో బాటు మీరూనూ" అని అంతా బలవంతం చేసినా ఆయన ఉండలేదు. ఆయన దౌహిత్రు డెక్కడో ఉద్యోగం చేస్తుంటే అక్కడికి బయల్దేరి వెళ్లారు. కాని, పాపం! వెళ్ళిన మూడోరోజునే ఈ లోకాన్ని కూడా వదిలేశారు.

వచ్చే ఆదాయం ఖర్చులో సగానికేనా సరిపోడం లేదు ఆస్తులు తరిగినా అహంకారాలు చావలేదు. ఎవరి కెవరొచ్చినా వారింట [illegible] మాన లేదు. అక్కడక్కడా చిల్లర అప్పులు పెరగడం ప్రారంభించాయి. బంగారం పెద్ద వస్తువులే, చిన్న చిన్నవి కూడా తాకట్టులోకి పోయాయి. ఖర్చు లెలాగైనా తగ్గిద్దామని శత విధాల ప్రయత్నం చేశాడు సుబ్బారావు. ఏ ఖర్చు చూసినా అత్యవసరం లాగే ఉండేవి. ఎప్పుడేనా తమ్ముళ్లని ఏ బట్టల విషయంలోనో కొంచెం తక్కువ ఖర్చు పెట్ట మనో, కళ్లనీ, [illegible] మర్యాదపాలు తగ్గించ మనో చెపితే, వాళ్ళకి ఇన్ని [illegible] అవుతుంటే నాకు [illegible] ఇంత చిన్న విషయానికే కష్ట మై పోయిందా అనిపించేది ఆర్థిక విషయాల్లో మొద ట్నుంచి బాధ్యతా రహితంగా ప్రవర్తించినవాళ్ళు పరిస్థితులు మారిపోయినంతమాత్రంచేత ఒక్క మాటుగా బాధ్యతాయుతంగా ప్రవర్తించరు.

అందులోనూ ఇంకోళ్ళ చెప్పి చేయించడం మరీ కష్టం.

సుబ్బారావు పెద్దకొడుకు సూర్యం మంచి తెలివైనవాడు. చదువులో ప్రతి క్లాసులోనూ ఫస్టని పించుకుంటూ వస్తున్నాడు. అంత చిన్న వయసులోనే అతనికి తమ కుటుంబపు ఆర్థిక పరిస్థితుల

## పన్నీరు - కన్నీరు

తికమకల్లో ఏదో ఒక మెలత ఉన్నట్లుగా అనిపించేది. సుభాషితాల్లో చదువుకున్న "విద్య యను దివ్యధనం బఖిలార్థి కోటికిన్ బూర్తిగనిచ్చినన్ బెరుగు హోదు యుగాంతపువేళనైన" అనే మాట నిజమైనా,

తనవాళ్ళ భూములూ, ఇళ్ళూ, నగలూ శాశ్వత ధనమనుకుని ఈ స్థితికి వచ్చారనీ, అతని చిన్ని మనసుకి అనిపించేది అయినా మళ్ళీ సందేహాలొస్తుండేవి ఎంతో చదువుకున్న తన తెలుగు మాస్టారు ఎప్పుడూ చిరుగు లాల్చీలు వేసుకుని వచ్చేవారు. ఊళ్ళో రాయుళ్ళకి తన కొచ్చినపాటి చదువు కూడా












లా. అయితేనేం వాళ్లూ ళ్ళిలుతున్నారు. ఏమయినా ఈ ఆ చనర్ని తన చదువుకి అంతరాయం కలగ నీయకుండా శ్రద్ధగానే చదువుకొంటున్నాడు. కాని అతనికి యమగండం స్కూలుకి జీతం కట్టాల్సిన రోజులు. తండ్రిని నోరు తెరిచి అడగటానికి భయం అడిగినా తక్షణం ఉంటుందని నమ్మకంలేదు కట్టక పోతే, మేస్టారు తిడతారు మరీ ఆలస్యమయితే పేరు కొట్టేస్తారు. తోటి పిల్లలు ఎగతాళి చేస్తారు.

మెల్లిగా తల్లిదగ్గర చేరి నసిగాడు. ఆవిడ అతని ధోరణి గమనించి అర్థం చేసుకుని భర్తకి చెప్పేది. మొత్తానికి అప్పో సప్పో చేసి, జీతం కట్టడం అయిం దనిపించేవారు సూర్యం తమ్ముళ్ల సంగతివేరు మళ్లీను. వాళ్లు ఒకటి రెండుసార్లు జీతాలకని డబ్బు తీసుకెళ్లి కాఫీ హోటళ్ళకీ, సినిమాలకీ తగలేశే వారు అందులో రోజా పొరుగూరు వెళ్లిరావడ మయ్యే స్కూలుకి.

ఇవి ఇలా ఉండగా, ఆ రోజుల్లో భార్యకు రెండు పురుళ్లయ్యాయి కూడాను. ఒకసారి ఆడపిల్ల, ఇంకొక సారి పిల్ల దక్కలేదు. భార్య ఆరోగ్యం దెబ్బతినడం ప్రారంభించింది.

సూరపరాజుగారు ఉన్నట్లుండి హఠాత్తుగా కాలధర్మం చేశారు. ఇది మరీ తట్టుకోలేని దెబ్బ యింది సుబ్బారావుకి. ఆయన బ్రతికిన హోదాకి తగినట్టు కర్మచెయ్యడం తప్పనిసరైంది. తల తాకట్టు పెట్టి, డబ్బుతెచ్చి కర్మ చేశాడు. అంతా "ఆయనకేం మహారాజులా బ్రతికాడు అలాగే వెళ్లాడు. మిగిలిన వాళ్ళదే దురదృష్టం" అన్నారు.

నరసింహంగారు వచ్చి సహాయం చెయ్యబోతే సుబ్బారావు ఒప్పుకోలేదు. తండ్రిమాటలు జ్ఞాపకం వచ్చి, ఆయనమీదున్న గౌరవంకొద్దీనూ.

## 11
## తెగింది తీగ

ఇక ఎంతో కాలం ఆ ఊళ్లో ఉండలేకపోయాడు సుబ్బారావు. పువ్వులమ్మిన ఊళ్లో కట్టెలమ్మడం కష్టం. సుబ్బారావు ఊరు విడిచి వెళ్లడం నర సింహంగారికి ఇష్టంలేకపోయింది. అక్కడే ఉండి మిగిలిఉన్న కాస్త భూమి చేసుకుంటూ కాస్త పూర్వపు దర్జా పద్ధతులు మానేసి పొదుపుగా ఉండకూడదని ఆయన అభిప్రాయం. అలా ఉంటే తను కూడా అప్పుడప్పుడు సాయం చెయ్యొచ్చని. కాని, సుబ్బారావు కొంచెం మొండిపట్టు. పైగా చిన్నప్పట్నించీ మంచి దర్జాగా ఊళ్లో అందర్లోనూ మొదటిశ్రేణిలో మెల గిన తను ఆ ఊళ్లోనే ఇతరులమీద ఆధారపడి ఉండడం అసంభవం అనుకున్నాడు.

బ్రతకడానికి సరిపడ్డ గింజలు రావడానికి నాలు గెకరాలుంచుకుని, తక్కిన భూమీ, ఇల్లూ అమ్మే శాడు. భూమి కౌలుకిచ్చి, అప్పులు తీరగా మిగిలిన డబ్బు తీసుకుని పట్నం చేరాడు; ఏదేనా వ్యాపారం చేద్దామని. అప్పుడు ఎక్కడ చూసినా మంచి హడా విడిగా ఉండేది. 'డిప్రషను' రోజులు వెళ్ళిపోయాయి. ఇంగ్లీషువాడూ, జర్మనీవాడూ మాటా మాటా పట్టింపులమీదున్నారనీ, జర్మనీవాడు మన శాస్త్రా లన్నీ పట్టుకుపోయి, వాటి సహాయంతో కొత్త ఆయుధాలు బోల్డు తయారుచేసి, డొక్క చీల్చేస్తా నని ప్రపంచాన్నంతటినీ హడలగొడుతున్నాడని అంటుండేవారు. గవర్నమెంటువారు యుద్ధం తయా

# పన్నీరు—కన్నీరు

రికో ఏవో అనేక రకాలైన పనులు, రోడ్లు, బిల్డింగులు, ఏరోడ్రోములు వగైరా కట్టించడం మొదలెట్టారు. చిన్నప్పట్నించీ ఒకరి కింద పనిచెయ్యడం తెలియని సుబ్బారావు ఈ కంట్రాక్టు పనైతే గౌరవంగానూ ఉంటుంది; ఒకళ్ల అధారిటీ ఉండదని ఆ ప్రయత్నం చేశాడు.

పూర్వపు పలుకుబడిమీద కొంచెం తెలిసిన ఇంజనీర్ల సహాయంతో ఒకటి రెండు చిన్నపనులు తీసుకుని పని చేశాడు. కొద్దో గొప్పో లాభం వచ్చింది. ఇక ఇలాగే నెగ్గుకుపోగలమని ధైర్యం వచ్చింది. కొంచెం పెద్దెత్తుమీద రెండు మూడు బిల్డింగులు కంట్రాక్టు తీసుకున్నాడు. ఒక రిటైర్డైన ఇంజనీర్ని సహాయానిక్కూడా పెట్టుకున్నాడు. ఆ ముసలాయన వాళ్లకి పెట్టాలి, వీళ్లకి పెట్టాలి, మనకి రేటు బాగా పడాలంటేనని డబ్బు బాగా వదిల్చి, చివరికి పెట్టుబడి పెట్టిన డబ్బు కూడా రాకుండా చేశాడు.

నరసింహంగారు, సుబ్బారావు ఉన్న ఊరికి పని కట్టుకుని వచ్చి చూసి వెడుతూండేవారు. వాళ్ల ఇంటి సంగతులూ, వాళ్ల అమ్మాయి విశేషాలు చెబుతుంటే సూర్యం చెవు లప్పగించి వినేవాడు నరసింహంగారికి సుబ్బారావు ధనార్జనకోసం చేస్తున్న ప్రయత్నాలు నచ్చలేదు. ఆయనకి స్వతహాగా ఈ దోపిడీ—సూత్రంమీద నడిచే నాగరికతంటేనే ఏవగింపు. ధనం ముళ్లైగా రావాలని చేసే ఈ వ్యాపారా లసలే కిట్టవు ఏదైనా ఉద్యోగం చెయ్యమని వచ్చినప్పుడల్లా చెప్పేవారు సుబ్బారావుకి అతను అలాంటి సలహాలను పాటించే పరిస్థితులో లేడు అప్పటికి.

జీవితం కొన్ని విధాల పేకాటలాంటిది. అదృష్టలక్ష్మి వరించినవాడు ఎలా ఆడినా ఎంత దుడుగ్గా ముక్కలెత్తినా లాభమే. పాడి ముక్కల్తో ఆట ఎత్తి బేస్తులు కొట్టేస్తాడు సాక్షాత్తూ శ్రీమన్నారాయణుడొచ్చి పిలిచినా లక్ష్మి అతన్ని వదలదు. ఇక పోడం మొదలెడితే జేజేలు దిగొచ్చినా ఆపలేరు. ఆసు, రాజు, మదాం, పాడి, యూరు రెండాసులుతో ఆట ఎత్తితే కింద పాడిముక్క కూడా కలవదు. ఆసులు తెగిపోతాయి. జీవితంలో కూడా నష్ట జాతకం ప్రారంభించిననాడు ఎప్పుడు ఏది ముట్టుకున్నా హతమారిపోతుంది; ఎంత జాగ్రత్తలు తీసుకున్నాసరే.

సుబ్బారావుతల్లి ఈ బాధలు చూడలేకనేమో అన్నట్టు భర్తని చేరుఎందికి పరలోకాలకి వెళ్లిపోయింది. పిల్లలు పెరుగుతున్నారు. తమ్ముళ్లు కాలేజీ చదువులకొచ్చారు సూర్యంకూడా వాళ్లని చదువులో వెనక తరుముకొని వస్తున్నాడు. ఎప్పుడో వాళ్లని దాటేస్తాడు కూడా; చదువు 'కంటిన్యూ' చేస్తేను. సుబ్బారావు ఏ పనిచేసినా వెనకట్టుతోంది పిల్లల చదువులుమాత్రం ఎలాగో నెట్టుకొస్తున్నాడు.

ఎవరో చెప్పారు: ''మన ఊళ్లో చదువూ సంధ్య లేకుండా జులాయిగా తిరుగుతూఉండే వియ్యన్న పంతులు జ్ఞాపకముందా? అతను యుద్ధం మొదలెట్టినరోజుల్లో మెడ్రాసు పోయాడు. ఎలాపట్టాడో మిలటరీవాళ్లని. ఇప్పుడువాళ్లకికూరలూ, పళ్లూ సప్లై కాంట్రాక్టు వ్యాపారం. వేలకి వేలు సంపాయిస్తున్నాడు. పైగా ఇంగ్లీషు టకాటకా మాటాడేస్తు

# మీ భోజనాల గదిని ఆకర్షణీయముగా చేసుకోండి!



మీ భోజనాల గదిని ఆకర్షణీయముగా చేసుకొనుటకు భోజనాల టేబుల్‌మీద బొంబే డైయింగ్ వారి టేబుల్ గుడ్డలను పరచుకోండి! తెలుపు, గులాబి, నీలి, ఆకుపచ్చ మరియు పసుపుపచ్చ లేత రంగులలో టేబుల్ కవర్లు, టేబుల్ గుడ్డలు మరియు టేబుల్ నేప్‌కిన్లు దొరకుతున్నాయి. వీటన్నిటికి ఆకర్షణీయమైన, నేయబడిన పూల డిజైనులు కలవు. బొంబే డైయింగ్ వారి యీ టేబుల్ గుడ్డలను కొంటే మీరు ఎంతో మంచి బట్టలను కొంటున్నారన్నమాట.

దేశమంతటా అన్ని పెద్ద చిల్లర బట్టల షాపులలోను
మరియు యీ క్రింది వారివద్ద లభిస్తున్నాయి.

దక్షిణ భారతమునకు డిస్ట్రిబ్యూటర్లు,

చెల్లారావ్స్

మద్రాసు & హైదరాబాదు।

**బొంబే డైయింగ్**

ది బొంబే డైయింగ్ & మ్యానుఫేక్చరింగ్ కంపెనీ లిమిటెడ్

JWT BD-4428 (S)

# పన్నీరు - కన్నీరు

న్నాడు. ఆ మిలటరీ వాళ్లతో నానాతిండి తిని లాగు తున్నాట్టుకూడానూ."

సుబ్బారావు ఆలోచించాడు. యుద్ధంపేరు చెప్పి అనేకులు బాగుపడుతున్నారు. తనూ ఏదో చేసి బాగుపడాలి. వేలాది జనులు అల్లాడిపోతున్నారనీ, ఆర్థికంగా బాగుపడ్డం అనేది మన సమాజంలో అందరికీ సమానంగా సాధ్యమయ్యేదికాదనీ, దానికి కొన్ని సహజ లక్షణాలు కావాలనీ ఆతడికి తట్టలేదు. "వంగదేశవు క్షామ మనియెడి వార్త వింటీవ పోదరా" అనే పాట రైళ్లల్లో ముష్టాళ్లు పాడుతుంటే విన్నాడు గాని ఆ సంగతేమిటో అతనికి పట్టలేదు. తను ఎలాగైనా బాగుపడాలి. డబ్బుచేసుకోవాలి. అంతే. ప్రపంచం అందరి బాధలూ తనవిగా బాధపడే మనస్తత్వంకాదు అతనిది.

విశాఖపట్టణంలో ఏరోడ్రోము కడుతున్నారు పెద్దది. అనేకమంది ఇంజనీర్లు, కంట్రాక్టర్లు, కంపెనీలు అక్కడ. దానికి రాయిసప్లై కంట్రాక్టు తీసుకుంటే చాలా లాభం వస్తుందనిపించింది. విశాఖపట్టణంచుట్టూ కొండలు. ఎక్కడ చూసినా క్వారీలే. చాలా తక్కువఖర్చుతో తేలిగ్గా రాయిసప్లై చెయ్యవచ్చు. పైగా బాంబుల భయంతో జనం విశాఖపట్టణం వదిలి పల్లెటూళ్లు వలసపోతున్నారు. అందుకని ఎక్కువ పోటీ ఉండదు. భార్య, పిల్లల్ని చదువులకోసమని రాజమండ్రిలోనే ఉంచి, విశాఖపట్నం చేరాడు. అక్కడ పనులన్నీ మొత్తం కంట్రాక్టులకి పెద్దపెద్ద కంపెనీలవాళ్లు తీసుకున్నారు. తను ఎక్కువ పనులకు పలుకుబడి కలిగిన క్లాసు కంట్రాక్టరు కాదు. అందుకని గవర్నమెంటు డిపార్టుమెంటునించి తనకి తిన్నగా కంట్రాక్టు రాలేదు. అక్కడ పెద్దకంపెనీవాళ్లు రాతిసప్లై కోసం సబ్‌కంట్రాకర్ల కోసం చూస్తున్నారు. సుబ్బారావు కొంచెం తక్కువరేటుకి టెండరు పెట్టాడు. కంపెనీ ఇంజనీరుకి కొంచెం ఎక్కువ టెండరుపెట్టిన ఇంకొకతనికి పని ఇవ్వాలని ఉంది. కొంచెం లోపాయికారీ ఏర్పాట్లకోసం. కాని తక్కువ టెండరువాణ్ణి ఉరికే పంపేస్తే గొడవవుతుందని, ఇంకా అనుభవంలేదు గనుక ఇతనికి కొంచెం పనీ, మిగిలిన పనంతా పూర్వంనించీ చేస్తున్న రెండవవాడికీ ఇచ్చి అతను మాట దక్కించుకున్నాడు. సుబ్బారావు తీసుకున్నది ఇరవైవేల రూపాయల పని. పని మొదలెట్టడానికి పదివేలరూపాయలు, మిగిలిన కాస్తభూమి అమ్మేసి తీసుకొచ్చాడు.

లోతుపాతులు తెలియకుండా ప్రవేశించడం ఎంత ప్రమాదమో అతనికి కంట్రాక్టు తీసుకున్నాక గాని తెలియలేదు. క్వారీ చెయ్యడానికి లైసెన్సు దొరకడానికికూడా నానాగడ్డి కరవాల్సొచ్చింది. దానికి తగ్గినట్లు చేతులు తడిపితే గాని అది రాలేదు. గ్యాంగు కూలీల్ని పెట్టి పని ప్రారంభం చేశాడు. అందులో మొత్తం జట్టుకని ఎడ్వాన్సు నాలుగొందలు తీసుకున్న హెడ్డుకూలీ గైరుహాజరయ్యాడు. ఎలాగో కష్టపడి దగ్గరుండి రాయి కొట్టించి లారీ ఒకటి అద్దెకు తీసుకుని స్వయంగా వర్క్‌సైట్‌కి తీసుకెళ్లి గుట్టలు పేర్పించి కొలతలు వేసిపెట్టాడు. కొన్నాళ్ల పోయాక ఇంజనీరు తణిఖీ కొచ్చి పేర్చిన రాయిలో సగంపైగా సైజు సరిలేదు; పనికిరాదు పొమ్మన్నాడు. వాళ్లని ఎలా సంతృప్తిపరచాలో సుబ్బారావుకి అర్థంకాలేదు. పైగా అయినంత వరకూ డబ్బివ్వడానికి నానాతిప్పలూ పెట్టారు. ఎప్పటికప్పుడు బిల్లు ముట్టుతుంటే గాని ఇలాంటి చిన్న కంట్రాక్టరు పనిచెయ్యలేడు. తను తీసుకొచ్చిన డబ్బు చాలామట్టుకు బిల్లులో చిక్కుకుపోగా మిగిలిన పని కావడం కష్టమయ్యేది. తన కూలీలు, ఏజంట్లు డబ్బుకోసం తొందరచేసేవారు. మరీ ఇబ్బందివచ్చి వెళ్లి వాళ్లమీద కూర్చుంటే ఏవో కోతలవీ పెట్టి నాలుగువేల రూపాయిలు ఇచ్చారు. దాంతో మళ్లీ పని సాగించాడు. ఉన్నట్టుండి ఒకరోజున వర్క్‌సైటులో పేర్చిన రాళ్లలో సగంసరుకు మాయమయింది. తను పెట్టుకున్న వాచ్‌మన్ కనబడలేదు. రాయి మాకింకా అప్పగించలేదు కనుక మా భాధ్యత లేదన్నారు కంపెనీవాళ్లు. ఇలాంటి పరిస్థితుల్లో చచ్చిచెడి ఎలాగో కంట్రాక్టు పూర్తిచేశాననిపించాడు. తనతోటి కంట్రాక్టరు తనకంటె తక్కువ కూలీల్ని పెట్టినా తనకంటె ఎక్కువ మెటల్ ఎలా సప్లై చేశాడో, ఎలాంటిసైజు రాయైనా ఎలా పాసయిందో సుబ్బారావుకి అంతుపట్టలేదు. తనూ చూశాడు ఎవర్నెలా మెప్పించాలో, ఎలా రాబట్టుకోవాలో నేర్చుకుందామని. తనని చూడగానే ఇంజనీర్లు విసుక్కునేవారు. వాళ్ల చెయ్యి తడపడం ఎలాగో ఇతనికి బోధపడలేదు. అయినా లోగడ రిటైర్డు ఇంజనీరు చేసినమాదిరి అవుతుందని భయమొకటి.

ఈ పరిస్థితుల్లో కంట్రాక్టు పూర్తిఅయ్యేసరికి తనకు అన్నిరకాలుగానూ ఖర్చైనది 27 వేలు. కంపెనీనించి కోతలు వగైరా పోను ముట్టింది 19 వేలు. తను భూమి అమ్మి తెచ్చిన పదివేల్లోనూ కంట్రాక్టు పూర్తిఅయి విశాఖపట్నానికి దణ్ణం పెట్టి బయల్దేరే నాటికి అతని దగ్గర మిగిలింది రెండువేలు. అది కాక మిగిలింది ప్రసయామాత్రమే. ఆ రెండువేలకీ కూడా ఇంటికొచ్చేటప్పటికి చిల్లర అప్పులు కాచుకుని ఉన్నాయి.

ఇంక కోలుకోకుండా చితికిపోయాడు సుబ్బారావు.

## 12
## యుద్ధం

యుద్ధం! యుద్ధం! యుద్ధం వచ్చిందియుద్ధం ధర్మపద్ధతులకి విరుద్ధం. తెల్లాళ్లకీ తెల్లాళ్లకీ యుద్ధం. తెల్లాళ్లకీ నల్లాళ్లకీ యుద్ధం. నల్లాళ్లకీ నల్లాళ్లకీ యుద్ధం!

అధర్మబద్ధం యుద్ధం. అన్యాయాశ్రితం యుద్ధం. అన్నదమ్ములమధ్య యుద్ధం. జాత్యోన్మాదుల యుద్ధం.

కల్లు తాగినవాళ్లపోరు. కళ్లుతెరిచి చూడలేరు. న్యాయం అన్యాయం అనేవి చేతకానివాళ్ల భాషని ఖరాబు చెయ్యడానికి సృష్టించిన మాటలు. కండ కలవాడే మనిషి. శస్త్రాలు చేసేవాడే శాస్త్రకారుడు.

## వరుడు కావలెను

గ్రాడ్యుయేట్ మరియు సంగీతము, హోం సైన్సు తెలిసిన కన్యకు, శ్రీవత్స గోత్రమునకు చెందని, సుమారు 30 సంవత్సరముల వయస్సు గల తెలుగు బ్రాహ్మణ వైదీకి తెలగాణ్య శాఖకు చెందిన వరుడు కావలెను పూర్తి వివరాలతో బాక్సు నెం. W/34, C/o ఆంధ్రపత్రిక, మద్రాసు–1 కి వ్రాయవలెను

---

## ఐటెక్స్

(కాటుక)




శాస్త్రీయంగా తయారైనది

చంటిపిల్లలకు కూడ వాడవచ్చును

**అరవింద్ లేబరేటరీస్**

**పి. బి. 1415, మద్రాసు-17.**

తెలంగాణా జిల్లాలకు, హైదరాబాద్ మినహా ఆంధ్రప్రదేశ్‌కు ఏజెంట్లు

**ప్రగతి ఏజెన్సీస్,**

**పురిపాటివారి వీధి, విజయవాడ-1.**

---

## పెప్స్



లోక ప్రసిద్ధయిన

**గొంతు మరియు గుండె బిళ్లలతో రొమ్ము పడిశెము**

త్వరితంగా నివారించ బడినది

గొంతు నొప్పి, రొమ్ము పడిశెము దగ్గులు, జలుబులు, గొంతు మరియు గుండె బిళ్లలైన పెప్సతో త్వరితంగా నివారణ యగును. పెప్సను చప్పరించి, నొప్పిని నివారించి క్రిములను నిర్మూలించే చర్యను జరుపునట్టి... అందరికమనకర ఆవిరులను ఆస్వాదించండి.




**పెప్స**

గొంతు మరియు గుండె బిళ్లలు

మందుల వ్యాపారు లందరి వద్దనూ దొరకును

సి ఇ ఫుల్‌ఫోర్డ్ (ఇండియా) ప్రైవేట్ లి.

FPY-56-TEL

సోల్ ఏజెంట్లు : దాదా & కంపెనీ.

---

ఒక ముఖ్యావిష్కరణ నవీన తయారీ

## పిక్‌నిక్ పాకెట్ రేడియో

ధర సగానికి తగ్గింపబడినది

జపాను పాకెట్ రేడియో సిగరెట్ కేసుకంటే చిన్నది. తేలికైనది. స్థానికంగా ప్రపంచంలో ప్రతిస్టేషను వినవచ్చును ఇతర రేడియోల కంటే తక్కువఖర్చు. సులభముగా ఉంచుకొనుటకుఅనువైనది.



అందమైనది లైసెన్సుతో పాటు ఉపయోగమునకు సిద్ధముగా పంపబడును. 3 సం. గ్యారంటీ. రిపేరు ఉచితం ధర రు. 27/– స్పెషల్ నెం LR77 ధర రు. 32/ డీలక్స్ 8కం నెం GM 156 ధర రు 45-50. వి. పి. పి. చార్జీలు రు 3-50 అధనం తోలు కేసు ధర రు 5-50. ఇంగ్లీషులో వ్రాయవలెను

MADRAS TRADERS (30AR)
Post Box 1578, DELHI-6.

---

## నెర్వొటాల్

నరముల బలహీనతకునూ, రక్తపోటుకున్నూ రామ బాణము. అనుభవ యుక్తముగా చేయబడినది.

8 ఔ. సీసా 5-75, పోస్టేజి 1-75.

**ఇండియన్ మెడిసన్ హౌస్,**

**విజయవాడ-2.**

---

## National's (REGD.) 'Kashmir' SNOW & TALCUM POWDER

National's 'Kashmir'

ALL IN-ONE TOILET AND TALCUM POWDER

KASHMIR SNOW

your guide to beauty

THE NATIONAL TRADING CO. Kashmir BOMBAY 2 MADRAS 1

---

## మంచి పుస్తకాలు

జీవిత రహస్యాలు - మీ దాంపత్యసుఖానికి అనేక కామ సూత్రాలు – రూ 3-50
యువతి – స్త్రీలను గురించి అనేక కుతూహల విషయాలు...... రూ 3-50
సంతానము - గర్భనిరోధానికి 60 నవీన సులభ మార్గాలు ...... రూ 3 50
అమ్మక రహస్యాలు - వ్యాపారంలో లక్షలు సంపాదించే అనేక కొత్తదారులు రూ 6-00
ఉద్యోగదర్శిని - మనదేశంలోని అన్నిరకాల ఉద్యోగాలు, అర్హతలు, పొందే మార్గాలు రూ5 00
ఆత్మజ్ఞానము - శరీరానంతరం ఆత్మను గురించిన నవీన శాస్త్ర పరిశోధనలు రూ 2-50
పోష్టు ఖర్చులుచితం క్రింది ఎడ్రస్సుకు వ్రాస్తే వి పి పోస్టుద్వారా మీయింటికి పంపబడును

**దేశసేవ ప్రచురణలు, ఏలూరు, ఆంధ్ర**

---

## కేలండరు ఉచితం

**గ్లోరియా** ద్రవాన్ని, మీ ముఖానికి రుద్ది తుడిచినంతలో అద్భుతమైన కాంతిని, మంచి అందాన్నివెంటనే తెచ్చును ముఖంలోముదిరూపును పోగొట్టి చక్కని లేతదనాన్నితెచ్చును. ఎండకు వచ్చే నలుపును, మొటిమలను నమ్మకంగా పోగొట్టును గ్లోరియాతోపెద్దబొమ్మకేలండరు ఉచితంగాయివ్వబడును

వెల రూ 1-75 అన్నిషాపుల్లో దొరకును

**JANITA PRODUCTS, ELURU, A.P.**

# రాజధాని కబుర్లు

9 వ పేజీ తరువాయి

చేయాలని, అశేష ప్రజానీకం తహతహ లాడినట్టే మాతృభాషయైన తెలుగుమీద తమ మమకారం చూపెట్టాలని, ఎంతోమంది తాపత్రయపడ్డారు. ఈ గ్రంథాలయం దీనికి నాందీ ప్రస్తావన.

క్రమక్రమంగా బాలారిష్టాలను దాటుకుంటూ, యువ్వనదశలోకి ప్రవేశించింది. నిద్రాణమైన జాతి మేల్కొన్నట్లే నిక్షిప్తమైన తెలుగుపూలు వలె రేకలు విరిసినాయి. ఘుమఘుమ వాసనలను వెద జల్లినాయి. ఆంధ్ర ప్రముఖులను సన్మానించటం మహామహుల వర్ధంతులను, జయంతులను జర పటం, సభలు, సమావేశాలు తరుచుగా ఏర్పాటు చేయుటం జరుగుతూ వచ్చింది. రజతోత్సవం, శోభాయమానంగా జరుపుకోనటం కూడా అయిపో యింది. సారస్వత, సాహిత్య రంగాల్లోనూ, గ్రంథా లయ ఉద్యమాల్లోనూ, తెలంగాణాలోని ఆంధ్రోద్య మంలోనూ ఈ ఉత్సవాల ప్రభావం ప్రస్ఫుటంగా కనిపించింది. నానాటికి ఉత్సాహం పెరిగిపోతూ వచ్చింది. మాతృభాషయందు అభిమానం ఎక్కు వయింది. నూతన వికాసానికి ఇదెంతో దోహద కారిగా, పరిణమించింది. ఈ ఫలప్రదమైన జయా నికి వెనక నిస్వార్థుల, ఉద్యమాభిలాషుల, త్యాగ పురుషుల నిష్కామసేవ అదృష్టంగా ఉన్నమాట విస్మరించటానికి వీల్లేదు

రోజులు మారాయి. స్వాతంత్ర్యం సిద్ధించింది కొంత ఆలస్యంగానైనా, బలప్రయోగం చేత నైనా, హైదరాబాదు సంస్థానం ఇతర ప్రాంతా లతో విలీనం కూడా జరిగిపోయింది. గ్రంథాలయ నిర్వాహకుల బాధ్యత ప్రతి యేటా ద్విగుణీకృతం అవుతూనే ఉంది. ఈ గురుతర బాధ్యతని నిర్వ ర్తించాలంటే, కార్యోత్సాహంతోపాటు, నలుగురితో వ్యవహరించటంలో నేర్పు, ఓర్పు కలిగియుండాలి.

బుద్ధికుశలత ఎక్కువయినకొద్దీ, ప్రతి సమ స్యను రకరకాల దృక్పథాలతో చూడటం సహజం. వీటన్నింటిని సమన్వయించుకుంటూ కొత్త రూపు రేఖలను దిద్దుతూ కార్యభారాన్ని సమర్థించు కుంటూ, ముందుకు సాగవలసి ఉంటుంది. ప్రము ఖులు నెలకొల్పిన వెనకటి సత్సాంప్రదాయాన్ని పాటిస్తూ, కొత్తకొత్త పోకడలకు రూపకల్పన చేస్తూ, మందు తరం వారికి ఆదర్శవంతంగా ఉండే లాగున ప్రవర్తిస్తూ, పాత కొత్తల మేళవింపుల్లో చదువరుల ఆసక్తి, పఠనాశక్తి పెంపొందించే లాగున కృషి చేస్తూ ఉండాలి. కేవలం రకరకాల గ్రంథాలు దొరికే స్థలంగానే కాకుండా రాజకీయ, సాంఘిక, సాహిత్య ఉద్యమాలతో పెనవేసుకుపోయి ప్రజల అభిరుచులకు ప్రాతినిధ్యం వహిస్తూ వచ్చిన ఈ గ్రంథాలయం యొక్క విశిష్టతను కాపాడవలసిన గొప్ప బాధ్యత కూడా ఈ కార్యనిర్వాహకులమీద ఉంది.

అయితే ఈ దృక్పథంతోనే ఈ నిలయం యొక్క వ్యవహారాలు జరుగుతున్నాయా ? రెండు మూడు సంవత్సరాల్నుంచి, కార్యవర్గంలోకి చొర బడాలనే కొంతమంది వ్యక్తుల తహతహ కనిపి స్తోంది. వ్యక్తిగత హోదాలకు, అవసరాలకు ఇదొక వేదిక చేసుకోవాలనే ప్రయత్నాలు కని పిస్తున్నాయి. ఈమధ్యనే జరిగిన సర్వసభ్య సమా వేశంలో జరిగిన తర్జనభర్జనలే దీనికి నిదర్శనం.

గ్రంథాలయంలో అడుగు పెట్టగానే దీని గత ప్రాభవం యిట్టే స్ఫురణకు వచ్చి ఉత్తేజ పరుస్తూ, నూతన భావ పరంపరలకు ఆలవాలమై ఉండాలి. తాను ఒక పవిత్రమైన ప్రదేశంలో అడుగుపెడుతున్నాననే శాంతి, సంతృప్తి కలగాలి. ఉత్సవాలు జరపటంతో కార్యభారం తీరిపోలేదు. ఉత్సవాలు తాత్కాలికాలు; వాటి ద్వారా ప్రజా బాహుళ్యంమీద హత్తుకున్న ప్రభావం శాశ్వతం. ప్రజాస్వామ్యంలో ఓటింగు హక్కు యొక్క విలువ యింతా అంతా అని చెప్పటానికి వీల్లేదు. ఈ సూత్రం రాజకీయ వేదికలమీద సరిపోతుంది గాని, సాహిత్య, సారస్వత రంగాలలో ఇదే సూత్రం అమలుచేస్తే మూలసూత్రమైన సహకారం, పరస్ప రానురాగం, ఆప్యాయత నశించిపోతాయి. కలిసి కట్టుగా పనిచేయాలంటే, గ్రంథాలయం భవిష్య త్తులో యింకా గట్టిగా పనిచేయాలంటే, కార్య నిర్వాహకుల మధ్య, ఇతర సభ్యుల మధ్య సామ రస్యం పెంపొందాలి. ఇది ఏ ఒకరి సంస్థ కాదని, అందరూ అర్థం చేసుకునేటట్లు ప్రవర్తించాలి. ఉపన్యాసాల ఒరవడిలో మూలసూత్రం విస్మరించ కూడదు.

ఏ. ఎల్. ఎన్. ★

# పన్నీరు - కన్నీరు

అస్త్ర సన్యాసానికిక్కడ అవకాశాల్లేవు. బుద్ధుడు, జీసస్, గాంధీ—వీళ్లకి ఇప్పుడు గిరాకీ పడిపోయింది ముసలమ్మ కబుర్లు చెప్పకు.

యుద్ధం యుద్ధం యుద్ధం. సంరంభం; సంక్షోభం; సమ్మర్దన, సంఘర్షణ, కుట్రలు, ద్రోహాలు, మాయలు. రాలే బాంబులు; కూలే కట్ట డాలు. రక్తపు మడుగులు; నెత్తురు కాల్వలు.

హాహాకారాలు. ఆర్తారావాలు.

జర్మనీ,ఫ్రాంసు,రష్యా,ఇంగ్లండు,అమెరికా,జపాను, ఇండియా, చైనా, ఆసియా, యూరప్, అమెరికా, ఆస్ట్రేలియా—సర్వదేశ సర్వప్రజల్ని భయభ్రాం తుల్ని చేసి గడగడ లాడించిన యుద్ధం; అసలైన సిసలైన ప్రపంచయుద్ధం.

లక్షలన్నా ప్రాంకుల కథనాలు. ఆరని అగ్ని హోత్రాలు. మానవు డన్యాయం భరించలేనివాడా? ఈ యుద్ధం ధర్మ సంస్థాపనకేనా ? అశోకుని ఆత్మ, మరణించిన జన సందోహాన్ని, చల్లారిన సంసా రాల్ని చూస్తూ ఖండాంతర గామి ఐందా ?

ఏమిటీ యుద్ధం? ఎందుకీ యుద్ధం? ఎన్నాళ్లీ యుద్ధం? ఎన్నేళ్లీ యుద్ధం? ఈ రణానికి కారణ మేుందా? ఈ మారణానికి వారణముందా?

దుస్సహం.దుర్భరం. దుస్సాధ్యం. ఫిరంగుల మోత; విమానాల రొద. సైరన్ల రోదన. సిపాయిల సిసిం ద్రీలు. మిలటరీవాళ్ల సిమెటరీలు.

బాంబులు, బాంబులు, ఔమ్మను బాంబులు. గుండెలు చెదిరే, గుండెలు పగిలే బాంబులు. ఎక్కడో లోపల అణగిఉన్న పిరికితనాన్నీ, ధైర్యాన్ని కూడా పైకి రప్పించే బాంబులు. మానవునిలో దాక్కున్న అపార కరుణనీ, అమిత స్వార్థాన్నీ వెలికి తెప్పించే యుద్ధం.

సుందోపసుందుల పోరు. రామ రావణ యుద్ధం. పాండవ, కౌరవ భారత సంగ్రామం. కృష్ణార్జునుల ధర్మయుద్ధం. వాలి సుగ్రీవుల అధర్మయుద్ధం.

కలలన్నీ కల్లలు. యుద్ధ మొక్కటే యదార్థం. అన్నీ సంఘాత హేతువులే. మానవ సంప్రదా యాలు ఒయాసిస్సుల్లేని ఎడారులు. దేన్నీ దేన్నీ దేన్నీ నమ్మకు. వీళ్ళు అవసరమొస్తే నిన్నూ నన్నూ, మన పక్కవాణ్ణీ కాకులకీ, గద్దలకీ వేస్తారు యుద్ధ మొక్కటే నిజం.

యుద్ధ మొచ్చింది. ధరలు పెరిగాయి. కాంతి తగ్గింది. చీకటి హెచ్చింది. బజారుల్లో మరీను.

"ఏమిటయ్యా మరీ నాసి సరుగ్గడుతున్నావు."

"అబ్బో చెప్పొచ్చావు లేవయ్యా. వార్ క్వాలిటీ. లండన్‌లో లార్డ్ అయ్యమ్మ మొగుడుకూ్కడా ఇంతకన్న మంచి సరుకు దొరకడంలేదు.

మళ్లీ దొరకదు జర్మనీలో తయారు సరుకు. ఓ డజను బకిల్సు, ఓ గ్రోసు బ్లేళ్ళూ ఇయ్య మంటా రేమి టబ్బాయిగారూ!

కార్డు లేకుండా బియ్య మెక్కడ దొరుకు తున్నాయి, పంతులుగారూ ? తెలియకడుగు తానూ. మీరైనా మూడు కార్డులు వేరే పేర్లతో రాయించార్టగా."

"కంట్రోలు బియ్యం తింటేను కడుపులో మంటా."

"అబ్బే! ఒక్కాయ కిర్సనాలంటే ఇప్పుడే ఇంటి దాని కంపిచ్చాను దీప వెడ్డానికి లేదంటేను. వా దగ్గి రెక్కడిదీ? అయినా ఓ రూపాయిస్తే, తమ్ముడు పరీచ్చలకని ఓ సీసా పెట్టుకున్నాడు. అందులో ఏమైనా ఉంటే పోస్తాను."

"జపానువాడొస్తాట్ట. విశాఖపట్నంలో బాంబులు ఇవాళో రేపో పడతాయిట."

"పెద్దింటోల్లయితే మణుగులకొద్దీ పంచదార పెళ్లిళ్ల కిస్తారుగదా. మాబోటోళ్లిల్లల్లో పెళ్లి ళ్లకి వాలుగీసెలేవా ఇయ్యకపోతే ఎలా గయ్య గోరూ."

"సాయంకాల వేళ ఆడోళ్ళు జాగర్తగా ఉండండి ఈ మిలటరీవోళ్లకి నీతీ నియమం లేవుట.

"బాదామీ పేపరు కూడా మనిషికి అర దస్తా కంటె లేదని కంట్రోలు పెడితే ఎలాగండీ?"

"ఈ బ్లాకౌట్ వోటి మన ప్రాణాలమీదికి."

(సశేషం)

## న్యూఢిల్లీ లేఖ

7 వ పేజీ తరువాయి

మంచి అవకాశాలకు నీళ్లు వదులుకుని చైనా సంప్రదింపులు, సామరస్యాలు, వివరణలు, సవరణలూ, వగైరా వగైరా దీర్ఘకాలిక వ్యవహారాలకు అంగీకరిస్తుందా అనేదే పెద్ద సందేహం. అసలు చౌఎన్‌లై తంత్రాంగం దాని కదే సాటి. నెహ్రూ మంత్రాంగం కన్నా పైచెయ్యి అని బుజువైంది కూడా. కారణం ఆ తంత్రాంగం (చౌ ఎన్ లై) వెనుక పటిష్టమైన సైనికశక్తి మద్దతు ఉంది. మహామహా మేధావు లనిపించుకున్న వాళ్లకి కూడా చౌ తంత్రం ఏమిటో అంతుబట్టటం లేదు. కొంతమంది ఉద్దేశం ప్రకారం తను తిరిగి దెబ్బకొట్టబోయేలోగా పాశ్చాత్య ప్రపంచం నుంచి భారతదేశాన్ని వేరుచేయటం ఆశయంట. చైనా ఈ పథకంలో ఎంతవరకు జయం పొందుతాడో ఇప్పుడప్పుడే చెప్పటం కష్టం. కాని, పాశ్చాత్యులంటే కానివర్గం వాళ్లు కేంద్రమంత్రుల్లో చాలా మంది ఉన్నారు మరి!

ఈ 1962 లోనే, చైనా దురాక్రమణ పురస్కరించుకొని, భారతదేశంలో ఉవ్వెత్తుగా లేచిన ప్రజా చైతన్యం, అపూర్వ ఉత్తేజం కూడా చూశాం. అంతా లోక సామెతుంది. కత్తికి రెండు పక్కల తెగేవాడు బీదవాడు. భారతదేశంలని మా అంతే స్టేట్ బ్యాంకుల ముందు స్త్రీ పురుషులు వరసల్లో నిలబడి, దేశం కోసం తమ సర్వాన్ని దత్తం చేయుటం నేను చూశాను. యువకులు అధిక సంఖ్యలో సైన్యంలో చేరేందుకు వస్తున్నారు ఇంకొక పక్కన వ్యాపారవర్గాలు లక్షలాది రూపాయల ధనాన్ని (వాళ్ల సొమ్మేం కాదులెండి, అంతా వాటాదార్లది) ఈ రక్షణ నిధికి ఇచ్చారు.

ఈ అపూర్వమైన ఈ ప్రజా చైతన్యం, ఉత్తేజ సమీకరణలో వర్గ, వర్ణ, భాషా, ప్రాంతీయ భేదాలు మరుగున పడిపోయాయి. ఒక ప్రక్కన ప్రజలంతా ఇలా ఏక హృదయులై ఉంటే, ప్రభుత్వంలో కేంద్రమంత్రులంతా తలా ఒక దోవ. ఎవరి మతాలు వాళ్లవి. ఎవరి సిద్ధాంతాలు వాళ్లవి. అత్యవసర పరిస్థితి అనేది తాను సామ్యవాద వ్యవస్థ నెలకొల్పుకునేందుకు అత్యుత్తమ సాధనమని శ్రీ గుల్జారీలాల్ నందా అభిప్రాయం. చైనీయుల యుద్ధ విరమణ ప్రారంభం కావటంతోటే పండిట్ నెహ్రూ వియా పాశ్చాత్యుల మానె కంపెనీలకు బద్ధ విరోధై పోయారు. ఎవరికివారు తమ తమ పథకాలకు పునాదులు వేసుకోవటంలో తీరిక ఉండటంలేదు. అన్నిటికన్నా బాధ కలిగించే విషయమేమిటంటే ప్రధాని పదవికి వారసులుగా నిర్ణయించుకోటానికి పోటీపడటం.

సుమారు 47 ఏళ్ల క్రిందట బ్రిటన్‌లో కూడా అస్క్విత్ బదులు లాయడ్‌జార్జి పదవిలోనికి వచ్చినప్పుడు ఇలాటి తమాషాయే జరిగింది. ఇది ఎలా జరిగిందో శ్రీమతి మార్గరెట్ అస్క్విత్ తమ ఆత్మకథలో వివరించారు.

"ఒకే వ్యక్తిని దుష్ప్రచారం చేసి పడగొట్టేందుకు మా ఆయనమీద జరిగినంత ప్రచార ఉద్యమం మరి ఏ ఇతర వ్యక్తిపైనా, ఇంతవరకు

ఎక్కడా జరుగలేదని జాన్ మోర్లే, తదితరులు చరిత్ర బాగా తెలిసిన వ్యక్తులు చెప్పారు. కాబినెట్ మంత్రుల్లో ఎవరో రహస్యాలను బయల్పరుస్తున్నారని నేను అంటే, వెంటనే ఇలాంటి విషయాల్లో విశ్వాసంత మౌనం వహించటం మంచిదని సలహా రావటం జరిగింది."

"మా సముద్రతీరాలమీద జరుగుతున్న విషాద ఘట్టాలు, అత్యాచారాల గూర్చి వదంతులు వ్యాపించగానే, ప్రజల మనస్సులు చెదరిపోయాయి. నరాలు నలిగిపోయాయి యుద్ధం ప్రారంభంలో ముమ్మరంగా ఉన్న దేశభక్తి, నిధులు క్రమక్రమంగా ఇగిరిపోయాయి."

అయితే బ్రిటన్ గురించి శ్రీమతి అస్క్విత్ వర్ణించినంత దుర్భరంగా భారతదేశ పరిస్థితి లేదు. అస్క్విత్ పదవీచ్యుతి జరిగిన 1916 వ ఉన్నంత హేయ పరిస్థితి, మన ప్రధానమంత్రి శ్రీ నెహ్రూ పాలనలో ఉన్న కాలంలో లేనూలేదు

ఎవరెన్ననుకున్నా ఒక్క విషయాన్ని నిర్భయంగా, నిర్మొహమాటంగా చెప్పవచ్చు. శ్రీ నెహ్రూ సదేహులై ఉన్నంతవరకు భారతదేశం ఇంకొకర్నెవర్నీ ప్రధానమంత్రిగా అంగీకరించదు కనుక ఆయన బదులు అనే ప్రశ్న రానే రాకూడదు. ఆయన అనుసరించిన విధానాల్లో ఈరోజున ఎక్కడో పొరబాటు కన్పించవచ్చు. కాని తన దేశం కోసం ఆయన త్యాగం చేసినంతగా ఏ వ్యక్తి (వ్యక్తిగతమైన) ఇంతవరకు త్యాగం చేయలేదనేది మాత్రం నగ్నసత్యం. 1962 సంవత్సరంలో సగభాగం వరకు కూడా భారతదేశమంటే ప్రపంచంలోని వింతలలో, అద్భుతాల్లో ఒకటన్న స్థానం ఆక్రమించింది. ఆర్థిక, సైనిక బలగాలు లేకుండానే భారతవాణిని ప్రపంచవ్యవస్థ పాటించింది. (శ్రీ నెహ్రూకు కృతజ్ఞత చెప్పుకోవాలి ఇందుకు) చాలా వరకు గౌరవించింది. అభివృద్ధిపథకాలనేవి శ్రీ నెహ్రూ స్వయంసృష్టి. 1947 తర్వాత నుండి భారత ప్రజలకు ఒక స్వతంత్రమైన ఆలోచన, మనుగడ ఇంత తిండి, బట్టా లభిస్తున్నాయి. ఏవేవో కొన్ని బాలపాప చిన్నెల్లాంటి అవరోధాలు తప్పించి, భారతదేశం ఒక జాతిగా రూపొందింది. వీటన్నిటికీ మించి

శ్రీ నెహ్రూ ఆరోపణలకు తావులేని వ్యక్తి. అసలాయన తన అల్లుడికే ఉద్యోగం ఇవ్వలేదు. ఒక్కమాటలో చెప్పాలంటే ప్రపంచంలో శాంతి సమయాల్లో ప్రధానమంత్రి గావలసిన వ్యక్తి శ్రీ నెహ్రూయే. అందుకే ఆలాంటి వ్యక్తి రక్షణ అంటూ ఏదీ ఉండనవసరంలేదు. పైన చెప్పిందంతా, శ్రీ నెహ్రూ గొప్పతనానికి, ఆయన నిస్వార్థమైన దేశభక్తికి అంజలి మాత్రమే.

అయితే శ్రీ నెహ్రూ ఎదుర్కొంటున్న సమస్య ఒకటే. శాంతికాలంలో ఆర్థిక విధానాన్ని అభివృద్ధి చేసినంత విజయవంతంగా భారతదేశ సైనిక శక్తిని అభివృద్ధి చేయగలరా అనేదే. అంటే, శాంతి కాలంలో మాదిరిగానే యుద్ధకాలంలో కూడా విజయవంతమైన ప్రధానమంత్రిగా ఆయన కావాలన్నమాట. అయితే ఇదంతా శ్రీ నెహ్రూ ఒక్కరిపైనా ఉండదు. ఆయన చేయగల్గినదంతా చేస్తూనే ఉన్నాడు బాధ్యత ఎక్కువగా ఆయన అనుచరులమీదే ఉంటుంది. శ్రీ నెహ్రూను అడిగిన ప్రశ్నలన్నీ ఆయన అనుచరుల్లో ప్రతి ఒక్కరినీ అడగవచ్చునన్నమాట. అసలు విమర్శ అంటూ ఏదైనా ఉంటే అది—శ్రీ నెహ్రూ తమ అనుచరులపై ఉంచిన విశ్వాసానికి తగ్గట్టు వాళ్ళు ఆయనపట్ల ప్రవర్తించలేకపోతున్నారని మాత్రమే. వాళ్ళకు నిజంగా గాంధేయ పద్ధతులమీద నమ్మకమే ఉంటే, ఈ మంత్రులు ప్రధాన్ని ఇరకాటాన పెట్టేబదులు, తమను పదవులనుంచి విడుదల చేయమని ఆయనను కోరిఉండాల్సింది.

సైనికమైన అసన్నద్ధత మాత్రమే కాదు ఈ 1962 లో కన్పించింది. భారతదేశం ఇంటా బయటా జరిగిన నాసిరకం ప్రచారం కూడా చూశాం. రాష్ట్ర మంత్రులు, కేంద్ర మంత్రులు, సహాయ, ఉపమంత్రులూ—వీళ్ళందరి ఉపన్యాస దస్త్రాలు, ఫోటోలు పత్రికల్లో గుప్పించటం ప్రచారంలో ఒక తంతు. చైనీయులు దురాక్రమణ జరిపినప్పటినుండి మన ఆకాశవాణి కార్యక్రమాలు, వెగటుగా తరచు తలనొప్పి కలిగించేవిగా తయారయ్యాయి. చైనా వ్యతిరేక ప్రచారాన్ని గూర్చి పత్రికా సమాచార శాఖ (ప్రెస్ ఇన్‌ఫర్‌మేషన్ బ్యూరో) పంపిన పత్రాలన్నీ చెత్తబుట్టలో దాక్కునిపోయాయి. ప్రజలలోని చైతన్యాన్ని పట్టయినా, ప్రజలకు చైనా వ్యతిరేకతకు నూరి పొయ్యటం అనవసరమని, ప్రభుత్వ ప్రచార శాఖ గుర్తించి ఉండాల్సింది. ఆడా, మగ, చిన్నా, పెద్దా, ఆఖరికి ఓనమాలు చదువుకుంటున్న పిల్లలకు కూడా, చైనీయులు భారతదేశంపై జరిపిన దురాగతాలు తెలుసు.

మా పని మేం చేస్తూనే ఉన్నాం. మాకు పాఠాలక్కర్లేదయ్యా అని ప్రజలు తమ చేతల ద్వారా నిరూపించుకున్నారు కూడా! దేశ ప్రతిష్ఠను పునఃప్రతిష్ఠ చేసేందుకు ఎట్టి త్యాగమైనా చేయటానికి, ఆక్రమిత ప్రాంతాలనుండి దురాక్రమణదారులను వెళ్ళగొట్టి తిరిగి సంపాదించుకునేందుకు వాళ్ళు ప్రభుత్వం అండన ఉండనే ఉన్నారు. ఇది దేశంలో ప్రచార వ్యవహారం.

ఇక వైదేశిక ప్రచారాలను గూర్చి ఎంత నోరు మూసుకుంటే అంత మంచిది. గత వేసవిలో నేను ఐరోపా వెళ్ళినప్పుడు అక్కడ, ఇంగ్లీషులో ఉన్న మన ప్రచారపత్రాలన్నిటిని చెత్తబుట్టలో కుక్కివేయటం నేను కళ్ళారా చూశాను

ఉదాహరణకు గోవా విషయంపై భారత ప్రచారం విఫలమైందనుకుందాం. పోర్చుగల్ ప్రభుత్వం జర్మనీలో జర్మన్ భాషలోనూ, ఇటలీలో ఇటాలియన్‌లోనూ, తదితర దేశాల్లో ఆయా దేశభాషల్లోను ప్రచారం చేస్తుంటే, భారతదేశ ప్రచారం మాత్రం అన్ని దేశాల్లోనూ ఒక్క ఇంగ్లీషులోనే! అసలు సేఠ్ గోవిందదాస్‌కు కాస్త సందు దొరికి కనక ఉంటే ఈపాటికి విదేశాల్లో, భారతదేశ ప్రచారం హిందీలోనే జరుగుతుండేది. ప్రభుత్వం ఇప్పటికన్నా గుణపాఠం నేర్చుకుని, ఆయా దేశభాషల్లో ప్రచారం సాగిస్తున్నదేమో ఇంకా తెలియలేదు మరి!

# ఆంధ్రసచిత్రవారపత్రిక

## రాబోయే ఆకర్షణలు!

**మాలతి తండ్రి**

కీ॥ శే॥ కల్కి తమిళ కథకు 'విశాఖ' అనువాదం.

వచ్చేవారమే ప్రారంభం!

●

**'నా అనుభవంలో కెల్లా పెద్ద పరిశోధన'**

లండన్, మాస్కో, వాషింగ్టన్
మొదలయిన మహానగరాల పోలీసు
అధికారులు రచించిన తమ పరిశోధనల
యదార్థ గాథలు,

**15-2-'63 సంచిక నుంచి ప్రారంభం!**

●

**'తెరమీద-తెరవెనుక'**

ఒక సరికొత్త సినిమా శీర్షిక
వివరాలకు ఎదురు చూడండి!

●

## 'బొంబాయి సినిమా తారల వ్యాసాలు'

వివరాలు త్వరలో!






Edited, Printed and Published by S. Radhakrishna at the Andhra Patrika Press 6 & 7, Thambuchetty Street. Madras-1. Chief Editor: S. Sambhu Prasad.

